సంస్థాపకులు
కీ॥ శే॥ వి.వి. రాఘవయ్య



మేనేజింగ్ ఎడిటర్
శ్రీమతి వి. లీలావతి రాఘవయ్య

సచిత్ర మాసపత్రిక
ఆగస్టు 1978

సహకార సంపాదకుడు : వేమూరి సత్యనారాయణ

**సంపుటి 16** — **విషయసూచిక** — **సంచిక 7**





ఇంకా కవితలూ, మినీకథలూ, కార్టూన్లూ, జోకులూ మరియూ జయదేవ్ '(వి)చిత్ర విజ్ఞానం'

నవలానుబంధం :

## ధర్మధార—చెల్లూరి సీతారాజేశ్వరావు

ముఖచిత్రం: 'సింహబలుడు' లో వాణిశ్రీ

జ్యోతి, 17-B రాజారాం కాలనీ, P. B. నెం. 2650, మద్రాసు-600 024.
ఫోన్: 423123. సంవత్సర చందా (ప్రత్యేక సంచికతో రు. 42/-)

# తొలిమాట

మన్నించాలి! 'భూమి గుండ్రంగా వుంది' సీరియల్ కొనసాగించలేక పోయాము. సీరియల్ ఆగటంవల్ల ఆసక్తిగా సీరియల్‌ను ఫాలో అవుతున్న పాఠకులు అసంతృప్తికి లోనౌతారని తెలిసీ, తప్పని పరిస్థితులలో ఆ సీరియల్ కొనసాగించలేక పోతున్నాము.

* * *

నవలల పోటీ వివరాలు ఈ సంచికలో ప్రకటించబడ్డాయి. రచయితలకు ప్రత్యేక విజ్ఞప్తిగా ఒక విషయం వివరించవలసివున్నది. జ్యోతి కథల పోటీ బహుమతులు ప్రకటించబడ్డప్పుడు, తమ పరిచయంలో రచయిత యర్రంశెట్టి సాయి వెలిబుచ్చిన అభిప్రాయంతో మేమూ ఏకీభవిస్తున్నాము. నవలలు బహుమతి పొందాలంటే కొన్ని ప్రత్యేక లక్షణాలు (ట్రాజెడీ అవాలనో, క్లాస్ట్రొగుల్ ఉండాలనో, ఆర్థికంగా అట్టడుగుస్థాయివారి జీవిత చిత్రణం వుండాలనో. ఇలా) విధిగా కలిగి వుండాలన్న అపోహ—బహుశా బహుమతులు పొందిన నవలలు కారణంగానే కావచ్చు—రచయితలలో ఉన్నట్లు తోస్తోంది. అందుకే ఈ ప్రత్యేక వివరణ! 'కథా వస్తువు'లో వైవిధ్యాన్ని మేం కోరుకొంటున్నాము. మంచి హాస్య నవల, నవలగా మలచబడ్డ మంచి ప్రేమగాథ, ఏదైనా బహుమతికి అర్హమైనవే. వైవిధ్యమున్న కథా వస్తువులతో రచయితలు ఈ పోటీలో పాల్గొన గలరని విశ్వసిస్తున్నాము.

* * *

క్రోటను ముక్కలు అందంగా వుంటాయి తప్ప పూలుపూయవు, ఫలించవు. వేశ్యా కుటుంబంలో జన్మించిన ఆడదీ అంతే. వేశ్య కూతురు వేశ్యగానే ఉండాలి. పిల్లల్ని కనాలన్నా వయసు మళ్ళాకేగాని, వయసులో ఉండగా కాదు. ఇది ఆ కుటుంబాలలో ఆడపిల్లలకు తల్లులు కానీ, వారివల్ల లాభపడేవారుగానీ విధించే నిబంధన. శాస్త్ర విజ్ఞానం ప్రగతి చెంది క్రోటను మొక్కలకు పూలు పూయించవచ్చు. ఫలాలూ పండించవచ్చు. అలాగే సామాజిక వ్యవస్థకు వివేకం పెరిగి వేశ్యా గృహాలలోని యువతులను మాత్రం ఆదుకోకూడదని ఎందుకనుకోవాలి. ఈ సంచికలోనేవున్న 'క్రోటను మొక్కలు' కథ చదవండి.

## రామనాథం వైద్య సౌకర్యాల నిమిత్తం ఋణ సహాయం కావా లనుకున్నాడు.





# ఆంధ్రాబ్యాంక్ జనసహాయ పథకం అతని కోర్కెను తీర్చింది. అతనికి నూతనశక్తి నిచ్చింది.

రామనాథానికి సోకిన జబ్బు సామాన్యమైనదికాదు. ఆ జబ్బునుంచి బయటపడేందుకు సరైన సమయంలో వైద్య సౌకర్యం లేకపోతే అతను వికలాంగుడయ్యే ప్రమాదం వుండేది. అయితే వైద్యసౌకర్యానికి కావలసినంత ధనం అతను కూడబెట్టలేదు. కాని అదృష్టవశాత్తూ రామనాథం ఆంధ్రాబ్యాంక్ జనసహాయ పథకంలో చేరాడు. ఆ పథకమే అతనిని ఆదుకుంది. జనసహాయలో పొదుపుచేసిన ధనానికి రెట్టింపుధనం రామనాథానికి ఋణ రూపంలో అందచేసింది ఆంధ్రాబ్యాంక్. ఆ ధనంతో రామనాథం అవసరమైన వైద్య సౌకర్యాన్నిపొంది ఆరోగ్యవంతుడయ్యాడు.

సైకిల్, రేడియో, మరే ఇతర గృహోపకరణ వస్తువుల కొనుగోలుకైనా ఋణ సహాయం చేస్తుంది, జనసహాయ.

దాదాపు 55 సంవత్సరాల అపారమైన అనుభవం గడించి, 600కు పైగా శాఖలతో, దేశమంతటా విస్తరించిన ఆంధ్రా బ్యాంక్, అనేక ఇతర పథకాలనుకూడా ప్రవేశపెట్టింది. అవే - భాగ్యలక్ష్మి, శిశుబ్యాంక్, సంరక్ష, సంక్షేమ, కల్పతరువు, కర్షక సహాయ, గృహకల్ప మరియు మహిళా సంక్షేమ పథకాలు, ప్రతి పథకం ప్రత్యేకమైనదే. ఒక్కొక్క సమస్యను తీర్చడానికి ఒక్కొక్క పథకం.

అంతేకాదు పరిశ్రమలకు, బలహీనవర్గాలకు కూడా ఆంధ్రా బ్యాంక్ ఆర్థికసహాయం చేస్తోంది.

ప్రజావసరాలకై పాటుపడేదే - ఆంధ్రాబ్యాంక్



**ది ఆంధ్రా బ్యాంక్ లి.**

కేంద్ర కార్యాలయం, సుల్తాన్ బజార్,
హైదరాబాద్-500 001.

ఓ. స్వామినాథ రెడ్డి : చైర్మన్

KIRON/AB/78-13

# ఉత్తరాలు

జూలై నెల "జ్యోతి" చదివాను. మల్లాది వెంకట కృష్ణమూర్తిగారి "పడమట సంధ్యా రాగం" సీరియల్ థ్రిల్లింగ్‌గా ఉంది. ఐ. వి. యస్. అచ్యుతవల్లిగారి క్రొత్త సీరియల్ "పూలూ ముళ్ళు" మొదట కొంత 'బోర్' అనిపించినా, తర్వాత ఇంటరెస్టింగ్‌గానే ఉంది. జ్యోతి కథల పోటీలో ప్రత్యేక ప్రశంసలు పొందిన, వి.ఎల్.ఆర్.గారి "ఇట్ ఈజ్ లైఫ్", ఇచ్ఛాపురపు రామచంద్రంగారి "రాలేనమ్మా రాలేను" కథలు నాకు బాగా నచ్చాయి. "చిత్ర కారుడి జీవిత చిత్రం" కథ నా హృదయాన్ని కదిలించింది. "పెళ్ళాం - కళ్ళెం" కథ హాస్యంగా ఉంది. మొత్తమ్మీద కథలన్నీ బాగానే వున్నాయి. యండమూరి వీరేంద్రనాథ్ కాటూరు రవీంద్ర త్రివిక్రమ్‌లగారి "ఆకాశ దీపాలు" నవల వాస్తవంగా ఉంది. రచయితలకు నా కృతజ్ఞతలు.

—జి. బెనర్జి, మచిలీపట్నం.

ఈనెల జ్యోతిని తీసుకొని సీలుచించి పుస్తకమంతా వెదికేను. తరువాత పుస్తకం చించేదామా అని అనిపించింది కానీ 3 రూపాయిలు అంటే ఈ రోజుల్లో సరేలే ఈనెల కూడా బీనాదేవిగారి నవల (సీరియల్) ఎందుకు ప్రచురించలేదు? జ్యోతిపై కోపం వస్తుంది సుమా. జయదేవ్‌గారి (వి) చిత్ర విజ్ఞానం నాకు నచ్చిన శీర్షికల్లో ఒకటి. వారి ఫోటోను పత్రికలో ప్రచురిస్తే బాగుంటుంది. అతని ఎడ్రసు కూడా. శ్రీశ్రీగారు నాకు పిచ్చెక్కిస్తున్నారు. కారణం ఏమిటంటే వారి ప్రహేళికను పరిష్కరించడం గ్రంథ పాఠకులు తప్ప నాలాంటివారిక్కి సాధ్యముకాదు. అయినా శ్రీశ్రీగారిపైనున్న అభిమానం వలన పైనెలలోవచ్చిన జవాబులను నా పుస్తకాల్లో నింపుకొని ఆనందిస్తాను. కార్టూనిష్టుల శీర్షిక అనే పేరిట క్రొత్త కార్టూనిష్టులకు ఒక పేజీ కేటాయిస్తే బాగుంటుంది. వారికి ప్రోత్సాహిమిచ్చినట్లుంటుంది కూడా.

—లింగం మురళీధర్, పాలకొండ.

యస్ (టి. ఆర్) జాయ్ (సుధ) జంట ముఖ చిత్రంతో అత్యంతాకర్షణాలంకారియై మమ్ములను ఆకర్షించి, ఆనందింపచేసిన మీ ఈనెల (జూలై) జ్యోతికి నా అభినందనలు. ఎ. రామసంజీవి 'మయసభ' చక్కని వ్యాసము అందించినది. క్రొత్త సీరియల్ ఐ. వి. యస్. అచ్యుతవల్లి రచన 'పూలూ—ముళ్ళూ' చక్కని రచనా శైలితో సాగినది. బీనాదేవిగారి 'భూమి గుండ్రంగా వుంది' సీరియల్ ఈనెల కూడా ప్రచురింపబడనందుకు బాధకలిగింది. జంట రచయితల కల్పన 'ఆకాశ దీపాలు' నవల చివర చక్కటి మలుపు తిరిగింది. ఈ నవల జ్యోతికే హైలైట్ అని చెప్పక తప్పదు.

—యం. సుధాకర్‌గుప్త, తిరుపతి.

జూలై జ్యోతి చూసాను. అచ్యుతవల్లిగారి "పూలు - ముళ్ళు" మొదటి భాగంలోనే ఆకట్టుకొన్నది. ముఖ్యంగా మొదలుపెట్టిన తీరు ప్రశంసనీయం. కథలలో "స్థాయీభేదం" బాగుంది. ఇది ఆరెకెపూడిగారి కథలలోనే వెరైటీ. ఈ కథలలో జీవిన విధానం గూర్చి వివరిస్తూ, కష్టసుఖాలు, వెలుగు నీడలు అనేవి జీవితానికి రెండు అంచులని చక్కగా నిరూపించారు. జయదేవ్‌గారి (వి) చిత్ర జ్ఞానం, రామసంజీవిగారి "మయసభ" శీర్షికలు విజ్ఞానవంతంగాను, ఆసక్తికరంగాను ఉన్నాయి. యువ

చిన్న అక్షరాలలో పెద్ద ప్రకటన
త్వరలో
# యద్దనపూడి సులోచనారాణి
## సీరియల్ ప్రారంభం!

తరానికి ప్రతీకలు గూడ.

మేము సీరియల్స్ ఎన్నో చదివాము. అన్నిట్లోను ఉత్సాహంగ నడిపిస్తు మల్లాదిగారి "పడమట సంధ్యారాగం" సీరియల్ చాలా అద్భుతంగా ఉంది.

—ఈతకోట సుబ్బారావు, నెల్లూరు.

జూలై నెల జ్యోతి చదివాను. సీతారాజేశ్వర రావుగారి 'ఎదురీత', ఇచ్ఛాపురపు రామ చంద్రంగారి 'రాలేనమ్మా రాలేను' కథలు చాలా బాగున్నాయి. మిగిలిన కథలు ఫరవాలేదు.

ఒకే కథావస్తువుగల కథలు 'స్థాయీభేదం' 'రాలేనమ్మా రాలేను' ఒక సంచికలో వేయడం విశేషం. ఈ రెండు కథల్లోనూ శ్రీరామ చంద్రంగారికి, శ్రీమతి కౌసల్యాదేవిగార్కి—రచనలు చేయటంలో గల 'స్థాయీ భేదం' చక్కగా ద్యోతకమయ్యింది!

కౌసల్యాదేవిగారి కథ అంతంత మాత్రంగా వుంటే, ఇచ్ఛాపురపువారి కథ మా అందరి మనస్సులు దోచుకుంది. మధ్య తరగతి కుటుంబీకుడు గోపాల్రావుని చక్కగా చిత్రించారు రచయిత. కథ చదివాక గుండె బరువయ్యింది. కళ్ళు చెమ్మగిల్లాయి. 'పాపం సీతాలు' అను కోటం తప్ప మరేం చేయలేక పత్రిక మూసి కొంతసేపు అచేతనంగా వుండి పోయాను.

ఏమైనా జ్యోతికథలు ఒక వెరైటీ! జ్యోతికి నా అభినందనలు.

—వక్కలంక రామారావు, మానేపల్లి.

ఈనెల జ్యోతి అందంగా వుంది. కథలలో "రాలేనమ్మా రాలేను" చాలా బాగుంది. దుర దృష్టవశాత్తు దుర్మార్గుల పాలబడి అంగ వైకల్యం పొంది తనవారిని చేరాలని సీత పడే ఆవేదన గుండెల్ని కదిలించింది. తనయను గుర్తించినా, తమలో కలుపుకోలేని ఆ తండ్రి వేదన కళ్ళకు కట్టినట్టు చిత్రించారు రచయిత. "స్థాయీ భేదం" కంటే ఇదే నాకు నచ్చింది. ఆ తర్వాత స్థానం "ఎదురీత"ది. ఎదగని సంస్కారం, తన స్వార్థం కోసం ఆశయాలను ఎట్లా ముసుగు వేసుకొనేది రచయిత బాగా రాశారు. నవల ఆకాశ దీపాలు సినిమా చూస్తున్నట్లుందే తప్ప "జ్యోతి" స్థాయికి తగినట్లులేదు.

—కె. సత్యవతి, సికింద్రాబాద్.

జూలై నెలలో అందించిన "ఆకాశ దీపాలు" నవల మొదటి భాగం చాలా నిదానంగా నడిపించారు. రెండవ భాగం సినిమా దోరణిలో త్వరగా ముగించారు. ఏది ఏమయినా మొదటి భాగం బాగుందనుటలో సందేహం లేదు.

తను ఎవరి ద్వారా ఈ స్థితికి చేరుకొన్నాడో మరచిపోయినా "దివాకర్" లాంటి వారికి చక్కని గుణపాఠం. "ఎదురీత" కథ ద్వారా చక్కని సారాంశం అందించారు.

"ఇట్ ఈజ్ లైఫ్" కూడా బాగుంది.

—సుంకర మాధవరావు,

బొబ్బా శ్రీనివాసురావు, విజయవాడ.

జూలై మాసపు మా అభిమాన 'జ్యోతి' చక్కని సీరియల్స్‌తో ముస్తాబై వచ్చి మా చేతులను అలంకరించుకుంది. క్రొత్త సీరియల్ "పూలూ—ముళ్ళూ" ఐ. ఏ. యస్. అచ్యుతవల్లిగారిది మొదటి నెలే చాలా బావుంది. ఉత్సాహకరముగా యున్నది. "పడమట సంధ్యా రాగం" పోనుపోను పాఠకులలో ఆసక్తిని పెంచుతున్నది. కథల విషయానికొస్తే 'జ్యోతి'లో ప్రచురిత మవుతున్న ప్రతి ఒక్క కథానిక వెరైటీగా, ఎంతో స్టాండర్డుగానూ మనస్సుకు హత్తుకొనేట్టుగావుంది. ఇక ఈ సంచికలో ప్రచురించిన కార్టూన్లు చూసి నవ్వకుండా ఉండలేక పోయాం. ఈ సంచికతోపాటు మాకు అందించిన, ఇద్దరు రచయితలు యండమూరి వీరేంద్రనాథ్ మరియు కాటూరు రవీంద్ర త్రివిక్రమ్‌గార్లు రచించిన "ఆకాశ దీపాలు' సంక్షిప్త నవల మాకెంతో నచ్చింది.

—గంటా ఉమాశంకర్ రెడ్డి.

కమల, గీత, సుజాత, రూపలు.

బరంపురం.

జూలై నెల "రామకృష్ణులు" ముఖచిత్రంతో వెలువడిన "జ్యోతి" సచిత్ర మాస పత్రిక కనుల కింపుగా వుంది. "ఇట్ ఈజ్ లైఫ్" "పూలూ—ముళ్ళూ" కథలు ఎంతో బాగున్నాయి. నవలానుబంధం 'ఆకాశ దీపాలు' నవల మరీ బాగుంది,

—పసుపులేటి రాజేశ్వర్‌రావు, కరీంనగర్.

జూలై నెల సంచికలోని డి. వి. మురళి కొవ్వాడగారి లేఖ చదివాను. వారు ఆ లేఖలో "మలుపులో మనుషులు" కథ చాలా బావుంది కాని రచయిత్రి ఒక స్త్రీ - మరి యొక స్త్రీని అలా చిత్రించటం - ఎంతో పవిత్ర నామమయిన 'సుశీల'ను ఆ పాత్రకు పెట్టడం తమకు ఆశ్చర్యం కలిగించిందన్నారు. మురళిగారు ఇలా వ్రాయడం నాకూ ఆశ్చర్యంగానే ఉంది. వారి ఉద్దేశ్యం ఏమిటో అంతుపట్టడంలేదు. రచయిత్రి 'సుశీల' పాత్రను అలా చిత్రించడంలో తప్పేయింది? బహుశా సమాజంలో అటువంటి స్త్రీలు ఉండరని మురళిగారి అభిప్రాయం కావచ్చు. సమాజంలో సుశీలలాంటి స్త్రీలు లేనప్పుడు దేశం నలుమూలలా పెద్ద పెద్ద వేశ్యా గృహాలను నడుపుతున్న స్త్రీల మాటేమేటి? వారి కన్న మన కథలోని సుశీలపాత్ర ఏ మాత్రం దిగజారి పోలేదు. ఆ మాటకొస్తే రకరకాల మనస్తత్వాలను రచయిత్రి ఎంతో హుందాగా చిత్రీకరించారు. చవుకబారు సెక్స్ సాహిత్యాన్ని బూతు పదాలను ఉపయోగించక, కథను అతి నేర్పుగా మరింత హుందాగా నడిపించిన ఘనత ప్రభావతిగారికే దక్కింది.

మురళిగారింకా పవిత్ర నామమయిన 'సుశీల'ను ఆ పాత్రకు రచయిత్రి వాడటం చాలా ఆశ్చర్యంగా ఉంది అని పేర్కొన్నారు. 'సుశీల' అనేది పవిత్ర నామమే కావచ్చు. కాని ఆ పేరును పతితలు పెట్టుకోకూడదని ఏదైనా రూలుందా? మనం పుట్టగానే మన పేర్లను మన తల్లితండ్రులు నిర్ణయిస్తారు. మనం పెద్దవారయిన తరువాత మన గుణాలకు మనస్తత్వాలకు ఆ పేర్లు సరిగ్గా సరిపోవాలా? అలాగే సుశీల పేరును రచయిత్రి ఆ పాత్రకు వాడటం ఆశ్చర్య పోవలసిన విషయమేమికాదు.

—యినుగంటి బుచ్చివెంకట్రావు,

పిఠాపురం.



# మయసభ

వందా నలభై సంవత్సరాల క్రింద కన్ను మూసిన కల్నల్ జేమ్స్ టాడ్ అనే చరిత్ర కారుడు మన దేశం గురించి ఇలా రాశాడు:

"రెండు వందల ఏళ్ళ క్రింద ఒక లావాదేవీ నిమిత్తం మీరొకమాట చెబితే చాలు, సరి పోయేది; అందుకోసం ఎక్కడా రాసి ఇవ్వాల్సిన అవసరం వుండేది కాదు. మీ దేశంలో బ్యాంకింగ్ వ్యవస్థ అంతా నోటి మాట ఆధారంగా నడుస్తుండేది. భారతీయుల వంటి సత్య సంధులు ఎక్కడా లేరు. అని ఎందరో చరిత్ర కారులు పేర్కొన్నారు-నిజం పలకడం అన్నది భారతదేశపు విశిష్ట గుణంగా భావించబడేది."

ఇది చదవగానే చాల అవమానకరం అన్పించింది; మన గ్రేట్ ఇండియన్స్‌ను ఈ టాడ్ గాడొచ్చి 'ఇనసల్ట్' చేయడమా అని ఒళ్ళు రవరవమని మండిపోయింది. అతడు రాసిన వాక్యాలను చదివి మురిసిపోకూడదు మనం. శబ్దాడంబరంతో ముగ్ధులయి పోరాదు మనం.

వాక్యాల వెనకవున్న అర్థం ఏమిటి, శబ్దాల వెనకవున్న భావం ఎటువంటిది అని లోతుగా పరిశీలించాలి. మన కావ్యాలు, తెలుగు మేష్టార్లు మన చెవుల్లో ఇళ్ళు కట్టుకుపోరేది అదే కదా శబ్దాల వాకిలి దగ్గర నిలబడకుండా "కౌముదులూ, రత్నాకరాలు" టార్చిలైటుల్లా చేతుల్లో పట్టుకుని లోలోపలికి వెళ్ళాలి. కవి హృదయం, అనగా ఈ సందర్భంలో టాడ్ హృదయం ఏమిటో కనుక్కునే యత్నం చేయాలి.

ఆ విధమైన తపస్సుచేస్తే ఈ టాడ్ వాక్యాల వెనుక దాగిన వ్యంగ్య వైభవంయొక్క విశ్వరూపం మనకు గోచరించగలదు.

ఆయన రాసిన దాని సారాంశం ఇది: "ఈ ఇండియన్స్ వున్నారే, వాళ్ళు కాచి వడపోసిన బడుద్ధాయిలండీ... వాళ్ళకి బొత్తిగా ప్రపంచ జ్ఞానం, లౌక్యం, వ్యవహార విధానం ఏమీ తెలియదు. ఈ జాతి జాతంతా శాశ్వతమైన బాల్యదశలో వుంది—అంచేత మన వాళ్ళెవళ్ళొచ్చినా, వీళ్ళకిట్టే శరగోపం పెట్టెయొచ్చండీ—" అని మన్ని ఎక్స్‌రే తీసి తన దేశం వాళ్ళు ఈ దేశం ఆక్రమించడానికి దారి చూపించాడు టాడ్.

ఈ వాక్యాల వెనక ఇంత గ్రంధం వుండగా మనమేమో అదంతా ప్రశంసేననుకుని గోతిలో పడిపోయాము, స్వాతంత్ర్యం కోల్పోయాము.

స్వాతంత్ర్యం వచ్చాక మనకు జ్ఞానోదయం అయింది. నిజంగా ఎదగడం నేర్చుకున్నాము. మనలను, మన మాటలను, చేతలను చూచి ఎవరన్నా అపార్థం చేసుకుంటారేమోనని— ఏకంగా మన మూడు సింహాల మార్కు జాతీయ చిహ్నం క్రింద "సత్యమేవ జయతే!" అని రాసి పెట్టేశాం! అంతే.

నిజానికి సత్యానికి అంతకన్నా మంచిచోటు ఏముంది గనుక! పుస్తకాల్లో, ప్రవచనాల్లో ప్రబోధాలల్లో వుంచడానికి సత్యాన్ని మించినది

ఏ. రామసంజీవి

లేదు. అంతే కాని సత్యవచనం అన్నదానిని నిజ జీవితంలోకి దిగుమతి చేసుకునేటంత అజ్ఞానం ఇప్పుడు మనలోలేదు.

"సత్యం" ఆడలేదు. అంటే అసత్యం పలికాడు—అని అర్థం తీయడం చాలా తప్పు. సత్యా సత్యాల మధ్య ఎన్నో ఇంద్రధనుస్సులుంటాయి; వాటి సాయంతో జీవితాలను చక్క బెట్టుకోవాలి.

1969 లో మన నాయకుడొకడు కాంగ్రెసు పేరు చెప్పి ఓట్లు దండుకుని ఢిల్లీ వెళ్ళోయి మంత్రయి పోయేడు. ఈలోగా ఇందిరాగాంధీ అంతరంగం ఒకటి ప్రవేశించింది. అప్పుడు మన్నాయకుడికి అగ్ని పరీక్ష; తీరాచేసి ఒక పార్టీలోచేరాడు. కాని నెలతిరక్కముందే—"దేశసేవ చేయడానికి ఈ పార్టీలో అవకాశాలు బొత్తిగా లేనందున నేను ఆ పార్టీలో చేరుతున్నాను." అని గీత దాటేశాడు. 1977 వచ్చింది; తను, తన పార్టీ ఓడిపోయారు.—"ఈ పార్టీలో ప్రజాస్వామ్య విలువలు బాగు పడిపోయాయి గనుక అసలు సిసలు ప్రజాస్వామ్య భక్తుడయిన నాకు రోతపుట్టింది. అంచేత నేను—పార్టీలో చేరుతున్నాను." అని తన పాతికేళ్ళ జీవితంలో అయిదోసారిగా పార్టీ మారాడు. ఇందులోకూడా దేశ సేవకు "అంకితం" అయ్యే అవకాశంలేదు. అన్పిస్తూంది గనుక—ఏమి చెయ్యాలా అని చూస్తున్నాడాయన. ఈ విధంగా సర్వకాల సర్వావస్థలయందు—అధికార పక్షంలో వుండితీరాలి—అన్న ఒక ప్రాథమిక సత్యానికి కట్టుబడిన ఆ హరిశ్చంద్రుడిని అపార్థం చేసుకుంటే మనకు కళ్ళు పోవూ? ఇంతోటి సత్యసంధులు వీథికి వందమంది వెలసిన ఈ రోజుల్లో గనుక జేమ్స్ టాడ్ గనుకవస్తే, పైన రాసినట్లు అవాకులు, చెవాకులు రాసి మనలను అవమానించ గలిగే వాడా? ఇసీ!

వారం క్రింద నేను పెట్టిన సంతకం—ఇవాళ అది నాదికాదు—అని ప్రమాణంచేసి వాదించి, సుప్రీంకోర్టుకు, Amnesty International కు వెళ్ళిపోయి 'కేసు' గెలిచేంత ఎత్తుకు ఎదిగాను నేను. మనమంతా అలా లేకపోతే ఈ కోర్టులు, లాయర్లు, చట్టాలు—ఈ వ్యవస్థ వ్యవస్థంతా కుప్పగా కూలి పోదూ? అంచేత "ఎప్పటికెయ్యది ప్రస్తుత మప్పటికా మాట" లాడ్డం వుందే—అది అష్టసిద్ధుల తర్వాత సిద్ధించే తొమ్మిదవ సిద్ధి. అంతే కాని సరిగ్గా విషయం తెలుసుకోకుండా "అబద్ధాలాడేస్తున్నాం!" అని దిగాలుపడిపోయి మన్ని మనం కించపరచుకోకూడదు. ఆత్మనిందా, పరస్తుతీ సర్వత్ర వర్జయేత్!

ఈ విధంగా లౌక్యం తెలిసి బండినడుపుకు రావడానికి మన ప్రాచీన సాహిత్యంలో—ఎన్ని మహోజ్వలమైన ఉదాహరణలున్నాయో గమనించండి.

రుక్మిణిని పెళ్ళాడడానికి కృష్ణుడి ఎత్తు—
సుభద్ర చేయి పట్టడానికి అర్జునుడి తపస్సు-
అశ్వత్థామను చంపడానికి ధర్మరాజు నీతి-
వాలిని చంపడంలో శ్రీరాముడి వ్యూహం-
—ఇవన్నీ మనకు ఎట్లా నడుచుకోవాలో చెప్పడం లేదూ

స్కూల్లో అడ్మిషన్ కావాలంటే జన్మదినం మారుతోంది. రిజర్వేషన్ సౌకర్యం కావాలి అంటే కులం మారుతోంది. మంత్రి పదవి అంటే పార్టీ మారుతోంది. కోటీశ్వరుడు కావాలి అనకుంటే ఇన్‌కంటాక్స్ రిటర్న్ మారుతుంది. మనకన్న తెలివయినవాడు ప్రత్యర్థి అని తెలియగానే ఉద్యోగం సంపాదించడానికి మన వ్యూహం మారుతోంది. ఇంతెందుకు—"నాకివాళ బద్ధకంగా వుంది. ఆఫీసుకు రావాలని లేదు. కనుక కాషువల్ లీవ్ ఇప్పించండి—" అని రాస్తే యిస్తారా? ఇవ్వరు గనక "చాలా అర్జెంటు పనివుందని" రాసినప్పుడు సెలవు కారణం మారుతోంది.

ఇట్లా అన్నీ 'మారడం' అంటే అబద్ధాలాడినట్లు లెక్క కడితే మీరు అజ్ఞానులన్న మాట. ఈ దేశంలో వుండదగరు. ఏ చంద్ర మండలానికో వెళ్ళిపోతే మీకూ మాకూ సుఖం. మార్పు అన్నది ప్రకృతి సహజం. అది ప్రగతి సూచకం.



నిన్నటిమొగ్గ నేడు పువ్వు: నేటి పువ్వు రేపటి పండు. చూశారా! ఆ లెక్కని ప్రతి చెట్టూ అబద్ధాలాడుతున్నట్టే లెక్క.

తెలుగు సినిమాకవుల బోపుసామానులో ఆవాలువంటి వాడయిన జాబిల్లి విషయం గమనించండి. ఒక రాజున్నట్లు మరో రాజు ఉంటాడా! దానినిబట్టి స్థిరత్వం అన్నది జడత్వానికింకో పేరు అని స్పష్టం కావడంలేదూ?

విశాఖపట్నంలో ఉక్కుఫ్యాక్టరీ అనిచెప్పి సాక్షాత్తూ ప్రధానమంత్రి విచ్చేసి, పునాదిరాయి మరియు పైలాన్ స్థాపించి వెళ్ళారు కదా! ఆ తర్వాత ఉక్కుఫ్యాక్టరీ పరదీప్ కు వెళ్ళిపోయింది అనుకుందాం. కేంద్ర ప్రభుత్వము అసత్యమాడింది—అనేయవచ్చా! తప్పుకదూ! అతి కళాత్మకమయిన ఆకారంలోవున్న ఆ పైలాన్ చుట్టూ ఇంచక్కా ఓ తోట, రంగు దీపాల ఫౌంటెన్లు అవీవేసి—దానిని గొప్ప టూరిస్ట్ ఎట్రాక్షన్‌గా రూపొందించి ప్రధానమంత్రిచేతనే ప్రారంభోత్సవంచేయిస్తే బ్రహ్మాండంగా వుంటుంది గాని. ! తెన్నేటి విశ్వనాథంగారికి ఉక్కుఫ్యాక్టరీ పక్కగా నివసించాలని అంత ఆశగావుంటే ఆయనకు భిలాయ్ స్టీల్‌ప్లాంట్ దగ్గర ఒక ఇల్లు కట్టివ్వండి గాని కేంద్ర నాయకత్వం అబద్ధం ఆడిందనిమాత్రం అనకండి.

న్యూటన్ చెప్పినదానిని ఐన్‌స్టీన్ తీసిపారేశాడు; నెహ్రూ చెప్పిందానిని ఇందిరాగాంధి కొట్టిపారేసింది; మొరార్జీ చెప్పిందానిని రాజ్ నారాయణ్ రూపాంతరం చేస్తున్నాడు; వీళ్ళందరూ కలసి "పత్రికలవాళ్లు మేం చెప్పినదానిని సరిగా వేయలేదు మొర్రో" అని గగ్గోలు పెడుతుంటారు.

అంటే ఏమిటన్న మాట?

మనదేశం మాంచి స్పీడుగా ముందుకు వెళ్ళిపోతూంది అన్నమాట; సత్యహరిశ్చంద్రలాటి బడీఫూల్స్, ధర్మరాజులాటి చవటలు లేరిప్పుడు; క్షణక్షణమూ మాట మారుస్తూ పాములను నిచ్చెనలుగా మార్చుకుంటూ ముందడుగు వేయగల జనమేజయులదే యిప్పుడు మెజారిటీ!

ఏదీ రమ్మనండి ఆ టాడ్‌నికాదు, అతగాడిని పుట్టించిన గాడ్‌ని!

చూపిస్తాం! స్వతంత్ర భారతదేశపు 'సత్యసంధత,' తడాఖాను! □

# లోకజ్ఞాన యోగం

## సంజయ, విధి నేమందును?

* ఇంత పెద్ద దేశంలో ఎమర్జెన్సీ ఉచ్చు అల్లి
  వేలాదిని పేవిధాల వేధించిన చిట్టి తల్లి
  తన కొడుకే ఈనాటికి చెరపడితే తల్ల డిల్లి
  ఏమిలోటు ఉందో అని జైలుకి పరిగెత్తిందేం?

## అసత్యనారాయణ వ్రతం

* 'నన్నెందుకు చూస్తారు దైవంతో సమానంగా!'
  అని కేకలేస్తా నంటాడు దొంగల్ని ఆలీబాబా
  మరి అదే ట్రస్టులో వారి భజనావళి అచ్చయింది కదా
  ప్రతి చరణంలో తన పేరుంటే అడ్డు పడదేం?

## యావత్తైలం, తావత్వ్యాఖ్యానం?

* స్త్రీలని విశేషంగా ఆకర్షించే చిత్రరాజమే,
  పత్రికలన్నీ పోటీపడి కాళ్ళు పిసికిన కళాఖండమే,
  జాతీయ స్థాయిని మనవాళ్ళ సినిమా
  దాటదేం భాయీ, గ్లిసరీను ఎనిమా?

## గుడగుడ శబ్దం కుండకు నష్టం

* 'కలిసి కట్టుగా పనిచేస్తాం, తీరుస్తాం ప్రజల కష్టాలు'
  అని రాజఘాట్ శపథాలు చేసిన జనతాపీ పనివారలు
  ప్రజల కల్లోలాలకేం, అవి ప్రభువుల కల్లోకయినా రావుగాని
  గుట్టుగా అయినా కొట్టుకోలేక పోతున్నారేం?

## ఎల్లాగో ఈడ్వడం ఇంతేనా జీవితం?

* ఆలోచిస్తే యిట్లా అడుగడుగున ప్రశ్న
  ఎందుకిలా జరిగిందో చెప్పేదే విద్య
  చెడుని పోల్చి మనకి మనం ఎదిరిస్తే తప్ప
  మరి ఎవరో మన బతుకులు సరిదిద్దుట కల్ల.

---

సీరియల్

# ప్రాణ-మిత్ర



ఐ.వి.యస్. అచ్యుతవల్లి

మామూలు పల్లెటూరి అమ్మాయిల్లా ఒదిగి ఒదిగి సిగ్గులు ఒలకబోయకుండా చనువుగా వుండే సుమన అంటే చాలా ఇష్టం కలిగింది. అందుకనే సెలవులు వచ్చి ఇంటికి వచ్చిందని వినగానే సుమన కోసం కబురంపేది సళిని. సుమన వస్తే కారమ్స్, ఛెస్, లేక పేక. ఏదో

వక ఆట ఆడుకుంటూ కూర్చునేవారు.

జగన్నాధరావుగారు కూర్చున్నా తను చొర వగా వెళ్ళుండేది. ఒకటి రెండుసార్లు "ఆవి దెవరు!" అని అతను అనటం "రామనాధంగారి అమ్మాయి సుమన. కాలేజీలో చదువుతోంది." అని నళిని అనటం తను. "జ్ఞాపకం లేనాండీ!" అనటం తప్ప ఇంకేమీ జరగలేదు.

కాని కాని నిన్న ఆయన తాకగానే అబ్బ నిజంగా ఎల్లాగ మళ్ళీ అంత వళ్ళు జల్లుమనే స్పర్శ ఆయన నించి తను ఎల్లాగ ఎల్లాగ పొందగలదు! సుమన తలలో అల్లిబిల్లి ఆలోచనలు గజిబిజిగా అల్లుకున్నాయి. రాధ మంచం కేసి చూసింది. రాధ దోమ తెరదించు కుని బోర్లగిలా పడుక్కుంది. వినోదకేసి చూసి

"వినోదా! ఒక చిన్నమాట అడగనా!" అంది సుమన సందేహంగా చూస్తూ.

"అడగవే!"

"నీకు నచ్చిన పురుషుడు నిన్ను పెళ్లిచేసు కోలేని పరిస్థితిలో వుంటాడనుకో! అప్పుడు నువ్వేం చేస్తావు!"

"పెళ్లిచేసుకో అక్కర్లేదు. కోరిక తీర్చు మంటాను"

"ఛఛ! అదెలాగ!"

"ఛఛ... ఛీఛీ.. కాదు. నేను నీకన్న చాలా చిన్నదాన్ని. సెక్స్ విషయాలు నేను మాట్లాడ కూడదు, కాని నేను పెరిగిన వాతావరణం మూలంగా నాకు చాలా విషయాలు తెలిసాయి. మా నాన్నది పెద్ద ఉద్యోగం. ఇంట్లో నాగరిక వాతావరణం వుంది. మా అమ్మ బాగా చదువు కున్నది. అప్పుడప్పుడు పెద్ద పెద్ద పార్టీలకు వెళ్ళుతూంటాము. ఒక్కడ ఒకొక్కప్పుడు ఒకొక్కరు మా అమ్మను కోరుతుంటారు. ఆవిడ వెళుతూవుంటుంది. హై సొసైటీలో మా అమ్మను గ్రేస్‌ఫుల్ లేడీ అని మెచ్చు కుంటూ వుంటారు. దానివల్ల మా అమ్మ సంసార జీవితం ఏం దెబ్బతింది! శ్రీ, నేను పెరుగుతున్నాం. అందరిలాగే మా అమ్మకూ గౌరవనీయుడైన భర్త, కొడుకూ, కూతురూ వున్నారు. డబ్బువుంది, గౌరవంవుంది. ఏం కొంప మునిగింది!"

"అయినా ఆ విషయాలు ఇక్కడ వాళ్ళకు తెలియవు కదా!"

"తెలియవలసిన అవసరం ఏమిటి! సోషల్ స్టేటస్‌కోసం ఒక భర్తా ఒక ఇల్లూ అని వుంటారు. అవకాశంవుంటే ఎవరు వదులు కుంటారు! పతివ్రతల కబుర్లు చెప్పేవాళ్ళు అవకాశం రానివాళ్లు మాత్రమే! మన ఆడ వాళ్ళల్లో ఎంతోమంది ఏదో వక సమయంలో చిలకకొట్టుడు బాపతేనని బుచ్చిబాబుగారో చలమో వ్రాసేరు. నాకు సరిగ్గా జ్ఞాపకంలేదు."

"నిజమే మనస్సులో ఒకర్ని తలపోసు కుంటూ ఇంకొకరితో అనుభవం పొందటం కంటె మనసుపడిన వార్నే తనని ఏలుకొమ్మని అడగటంలో నైచ్యం ఏమీలేదు." అంది సుమన.

"అదే మంచి మార్గం సుమనా! జగన్నాధ రావుగారు నీకేకాదు—నాకు కూడా నచ్చాడు. నువ్వు ముందు ఉంది పోయేవు కాని నేను అయితే అతన్ని ఎల్లాగయినా పడగొట్టేదును."

"ఛఛ ఆయన మాట ఎందుకే."

"దొంగా! నేను కనిపెట్ట లేదనుకోకు! ప్రొసీడ్! విష్ యూ బెస్ట్ లక్! నువ్వు కనుక ఇంత మధనపడుతున్నావు కాని నేనయినా రాధయినా అయితే రెండో కంటి వాళ్ళకి తెలియకుండా అతన్ని ఎంగేజ్‌చేద్దుము తెలుసా!"

"నీకో దండం పెడతాకాని ఊరుకో తల్లీ!"

"ఊరుకోను ఎందుకు ఊరుకోవాలి! అమూల్యమైన సలహా చెప్పించుకున్నావు. నాకు ఫీజ్ ఇవ్వవా! మరి!"

"ఫీజా! ఏం ఇవ్వను!"

"జగన్నాధంలో సగం ఇయ్యి!"

"ఎం తెలివే నీది! ముందు సగం ఇద్దా మంటే ప్రపంచం అంతా ఇచ్చినట్లు అవు తుంది. తర్వాత సగం ఇచ్చానంటే నాధుడే నీవాడు అయి వూరుకుంటాడు . ఇంకెలాగ ఇచ్చేది!"

జరిగిన కథ :

★ రామనాధం భూములు చూసుకొనేందుకు లాయర్ ప్రాక్టీస్‌కూడా వదులుకొని పల్లెటూళ్లో స్థిరపడ్డాడు. రామనాధం కూతురు సుమన ఆ వూళ్ళోని మరో రైతు జగన్నాధరావు వైపు ఆకర్షితురాలయింది. జగన్నాధరావు భార్యకూ, సుమనకూ స్నేహం కలిగింది. ★

"అంత దిగులుపడితే ఎల్లాగ! నువ్వు ఒకరి నుంచి తీసుకుంటూన్నప్పుడు ఎంత సులువుగా తీసుకోగలిగావో అంత సులువుగానూ ఇయ్య కలగాలి. ముల్లుగుచ్చుకుంటే పూవు రేకలు చీలక తప్పదు! పూవు బాధపడుతుందని ముల్లు గుచ్చుకోవటం మానుతుందా! గివ్ అండ్ టేక్ పాలసీ అంత ఉత్తమమైన మార్గం ఇంకోటి కనపడదు. ప్లీజ్ లెట్ మీ ట్రై" అంది వినోద.

"నిజమే వినో! పూలల్లాంటి వాళ్ళం మనం. ఈ మగవాళ్లు వాడిముళ్ళల్లాంటి వాళ్ళు. మన హృదయాల్ని చీల్చేస్తారు" అంది సుమన.

"బీ హేపీ! టేకిట్ ఈజీ!" అంది వినోద.

*　　*　　*

నళినికి కలో నిజమో తెలియటంలేదు. ఈ మధ్య జగన్నాధరావుగారు చాలా హుషారుగా వుంటున్నాడు. పెళ్ళయిన కొత్తలో కంటె ఇప్పుడే ఆయనలో నూతనత్వం చూడగలుగు తూంది నళిని.

ఏదో జరిగింది. జరిగి వుండాలి. మన్ను తిన్న పాములావుండే ఇతనికి ఇంత ఉద్రేకం ఎల్లా కలుగుతూంది? అనుకుంటుంది అప్పు డప్పుడూ. మళ్ళీ ఇంతలోనే 'ఏలాగయితేనేం! ఆయనలో జడత్వం వదిలింది. చైతన్యం కలిగింది. దానికి సంతోషించాలి కాని ఎందుకు తల్లబద్దలయ్యేలా అనవసరపు ఆలోచనలు!' అని తనని తనే సందాళించుకుంటుంది.

రాధ పెళ్లి హడావిడిలో, వూళ్లోకల్లా పెద్ద కుటుంబీకులు కనుక ప్రతి చిన్న పనికీ రామ నాధం, జగన్నాధరావుగారి సంప్రతింపులకు వస్తూ వుండేవాడు. రాధ పెళ్లివారు జగన్నాధ రావుగారికి ఏదో దూరపు బంధువులు కావ టంతో వాళ్ళకు తగిన ఏర్పాట్లు చేయటానికి కూడా జగన్నాథరావుగారి సహాయం కావల్సి వచ్చేది. ఈ సందర్భంలో సుమన చాలాసార్లు నళిని ఇంటికి రావటం జరుగుతూ వచ్చేది. సుమనకు జగన్నాధరావుగారిని చూసినప్పుడల్లా హృదయం దడదడలాడేది. జగన్నాధరావుకి ఏదో వంకన సుమన ఎదురుగా వుండాలని పించేది. సుమన ఇంట్లో మసులుతూంటే ఏదో పరవశం కలిగేది. ఒకొక్కప్పుడు జగ న్నాధానికి కూడా తన పరిస్థితికి తనకే విసుగు అనిపించేది. తను చిన్నవాడు చితకవాడు కాదు. నలభయ్యోపడి వస్తూంది. సంసారం పెరగక కాని లేకపోతే నలుగురు పిల్లాజల్లాతో ఇల్లు నిండి వుండేది. ఒకవేళ పిల్లలులేక తనలో ఇల్లాంటి చపలత్వం పుట్టిందా! పిల్లలు లేని దంపతులు బోలెడు మంది వున్నారు. అందరూ ఇల్లాంటి కామవికారానికి లోనయ్యేరా! తన తాత ముత్తాతలంతా చాలా రసికులని పేరు పడినారు. తన తాతగారయితే అన్నివర్ణాల వారి తోనూ సంబంధం పెట్టుకునేవారుట! తన తండ్రి అపర శ్రీరామచంద్రుడని పేరు పడి నారు. తనకీ సుమని కనపడేదాక ఇల్లాంటి బాధకలగలేదు! ఇన్ని రోజులబట్టీ సుమనని తెలియనివాడా! తన కళ్ళముందు పెరిగిన పిల్ల కదా! పెద్దమ్మాయి సావిత్రి చాలా అందంగా వుంటుందని తనని చూసుకొమ్మని మధ్యవర్తు ల్లాంటి బంధువులు చెప్పుతూ వుండేవాళ్ళు.

'ఊసుపోకపోతే ఊరిలో సంబంధం అంటారు. అయినా వాళ్లెక్కడ మనమెక్కడ!' అంటూ అక్కలూ వాళ్ళూ ఒప్పుకోలేదు. రాధనికూడా చాలాసార్లు చూసేడు. కాని పెద్ద

పట్టించుకోలేదు. సుమనని చాలా సార్లు చూసేడు. కాని ఎల్లాగయినా తన స్వంతం చేసుకోవాలనిపించలేదు. అదేమి దుష్టగడియలో ఒకరికొకరు తారసపడినారో! ఆపిల్ల ఏ మనుకుందో! ఒకటే తపనగావుంది.

"చీకటి పడింది. తోడుగా ఎవరైనా పంపలేకపోయేవా!" అన్నాడు నళినితో. రాత్రి ఎనిమిది దాటింది. చీకటి రాత్రుళ్లు. తోటలోంచి నడిచి సందులమ్మట గొందులమ్మట తిరిగి వెళ్ళాలి రామనాధంగారి మేడకు.

"ఎవరికి తోడు!" అంది నళిని.

"అదే! ఆ అమ్మాయికి!" అన్నాడు. నళిని నవ్వింది. జగన్నాధరావు భార్య ముఖంలోకి చూసేడు.

"ఎందుకు నవ్వుతావు!"

"సుమన ఏమన్నా చంటి పాపాయా! చేతిలో బాటరీ లైటువుంది. ఆ అమ్మాయికి ఈ వూరంతా కొట్టిన పిండి. కళ్లు మూసునుని నడవకలదు. ఇంకా నాబోటి దానికి ఈవూళ్లల్లో నడవాలంటే ఒచ్చే చావుగా వుంటుంది. రేగడి బెడ్డలు, గడ్డలు, గతుకులు. అలవాటులేదు." అంది నళిని.

"నువ్వెప్పుడూ బయటకు వెళ్ళవు!"

"వెళ్లితే నేనేదో వింత జంతువు అయినట్లు చూస్తారు. వాళ్ళచూపులు నాకు నచ్చవు. పట్నంలో అయితే "లాఖోంమే ఏక్" కలిసి పోతాను. నాకు అందరిలో కలిసి పోవాలని వుంటుంది. ప్రదర్శన వస్తువుగా వుండటం నాకు నచ్చదు."

"అప్పుడయితే వూరికి కొత్త కోడలివి కాబట్టి-అందునా వూరికి పెద్ద మొఖాసాదారు భార్యవి కాబట్టి, అందునా వూరిలోకల్లా అందమయిన ఆడదానివి కాబట్టి, అందునా అందరి ఆడాళ్ళకన్న ఎక్కువ చదువుకున్న దానివి కాబట్టి నిన్ను ప్రత్యేక దృష్టితో చూసేవాళ్ళుండటం ఆశ్చర్యం కాదు. ఇప్పుడు అంతగా ఎవ్వరూ పట్టించుకోరు."

"అయితే నేను బయటకు తిరగటానికి పర్మిషన్ ఇచ్చారన్నమాట."

"నేను ఇచ్చేదేమిటి నువ్వు పుచ్చుకునేదేమిటి! నీకెప్పుడూ ఏ పనిచేయాలన్నా స్వేచ్ఛ వుంది" అన్నాడు జగన్నాధం.

మర్నాడు సుమన వచ్చింది. కాఫీలు తీసుకుని కూర్చున్నారు.

"నువ్వేటూ పైకి చదవనంటున్నావు కదా! ఈ వూళ్ళోనే వుంటావా!" అంది నళిని.

"ఏం అల్లా అడుగుతున్నారు!" అంది సుమన.

"మన వూళ్ళో చదువు లేక ఇళ్ళమ్మట తిరిగే ఆడపిల్లలు చాలామంది వున్నారు. మనమో స్త్రీ సమాజం పెట్టుకుంటే బాగుంటుంది. నువ్వు కార్యదర్శిగా వుంటే నలుగుర్నీ పోగుచేసుకుని సంప్రతించుదాము."

"అక్క పెళ్లి అయినాక ఆలోచిద్దాము." అంది సుమన.

"ఈలోగా మనం ఒక అవగాహనకు రావాలి కదా"

"మీ ఊహలు చెప్పండి. ఒక రూప కల్పన చేయాలి కదా!"

"ముందు పెళ్లి కాకుండా ఎదిగివున్న అమ్మాయిలను పోగు చెయ్యాలి. వాళ్ళకు చదువుకోవాలని వుంటే, హిందీ పరీక్షలకు కాని మెట్రికు పరీక్షలకు కాని చదువు చెప్పించాలి."

"మనమా!"

"మనమంటే మనమేకాదు. మనం మనకు వచ్చిన సబ్జక్ట్స్ చెప్పుతాము. రెండు కుట్టు మెషిన్స్‌కొని, కుట్టు శిక్షణ ఇవ్వవచ్చును. లేక బట్టలు ప్రింట్ చేయటం నేర్పవచ్చును. లైబ్రరీ, రీడింగ్ రూం ఏర్పాటు చేయాలి. ఇవి అన్ని ఒక్క రోజుకోకాదు. సరదా, వర్కింగ్ మెంటాలిటీవున్న స్త్రీలు అందరూ కలవాలి. అందరూ కలవాలంటే ఎవరో ఒకరు ఒక సంస్థ అంటూ మొదలుపెట్టి ఆర్గనైజ్ చేయాలి. అంచేత ముందు మనం 'స్త్రీ సమాజము' అన్న దానిని ఒక దానిని పెడుతున్నాము లెక్క చెప్పి నలుగుర్నీ పోగుచేయాలి."

"మీరు చాలా ఆశయాలు మనస్సులో

## (వి)చిత్ర విజ్ఞానం




మగపిల్లల మీద తల్లి చూపే శ్రద్ధకన్నా తండ్రి చూపే శ్రద్ధయొక్క ప్రభావం చాల ఎక్కువగా వుంటుంది. అమెరికాలోని **National Institute of Child health and Human Development** కు సంబంధించిన డా॥ లియాన్ యారో తమ పరిశోధనల్లో, మగపిల్లల మీద తండ్రి ప్రభావమే అతి ముఖ్యమని చెబుతున్నారు. తండ్రియొక్క శ్రద్ధానురాగాల తో పెరిగిన మగపిల్లవాడికి సూక్ష్మదృష్టి, పరిసరాలను అతిత్వరలో అవగాహన చేసుకునే శక్తి, మెలకువ అన్నీ పరిపూర్ణంగా ఏర్పడుతాయంటున్నారు.

---

పెట్టుకున్నారే. మరి పదేళ్ళనించీ ఎందుకు పూరుకున్నారు! ఈ పాటికి సంఘం ఒకస్థాయికి వచ్చేది కదా!"

"మంచి ప్రశ్నవేసావు. నేను ఈ వూరికి కోడలుగా వచ్చేను. రాగానే సంఘం మరామత్తు మొదలు పెట్టానంటే నామీద లేని పోని అపోహలు రావచ్చును. పైగా నాకు నేను ఒక్కర్తినీ ఏమిచేయగలను. ఇంకా నలుగురయిదుగురు ఎడ్యుకేటెడ్ గర్ల్స్ సహాయం వుంటే కాని ఒక సంస్థ నడవటం కుదరదు. ముందు మనం చిన్న గెట్ టు గెదర్‌గా నలుగుర్ని పిలుద్దాము. వాళ్ళతో ఆలోచించి మన సంస్థకు ఒక రూపం తెద్దాము." అంది నళిని.

"అల్లాగే!" అంది సుమన.

రాధపెళ్లి చాలా ఘనంగా జరిపారు. రామనాధంగారి చుట్ట పక్కాలంతా చాలామంది వచ్చేరు.

రాధ అదృష్టాన్ని వేయినోళ్ళ పొగిడారు. రాధకూ సంతోషంగానే వుంది. ఖరీదయిన పట్టుచీరలు, రవ్వల నగలు. ఎల్లాగయినా అక్కకన్న తనకే మంచి బట్టలు నగలు వచ్చేయి. అత్తగారి కయితే వళ్ళంతా బంగారమే!

సుమన మేడమీద వంటరిగా కూర్చుంది. క్రింద అంతా హడావిడి, రణగొణ ధ్వనిగా వుంది. శ్రీకాంత్ వచ్చేడు. కూడా, జనక్ అని అతని ఫ్రెండ్, రాజేష్, సావిత్రి భర్తా వున్నారు.

"ఏకాంతంకోసం మేమువస్తే ఇక్కడ కూడా కాంత దర్శనం తప్పలేదే!" అన్నాడు రాజేష్. రాజేష్ పొడుగ్గా చామన చాయగా వుంటాడు.

"మరదలు మాణిక్యమేగా!" అన్నాడు శ్రీకాంత్. జనక్ ఎవరీవిడ అన్నట్లు చూస్తున్నాడు.

"పెళ్లి కూతురి చెల్లెలు. గ్రాడ్యుయేట్" అంటూ జనక్‌కిచెప్పి

"సుమనా ఇతను నా ఫ్రెండ్. మంచి ఉద్యోగంలో వున్నాడు. తెలుగు వివాహాలు ఎల్లా జరుగుతాయో చూడాలని వుందన్నాడు. అంచేత తీసుకువచ్చేను. చాలా సరదాగా వుందన్నాడు మన పెళ్లి తంతు" అన్నాడు

శ్రీకాంత్.

"మన పెళ్లి అంటున్నావేమిటి? మీరిద్దరూ పెళ్లి చేసుకుంటారా!" అన్నాడు రాజేష్ నవ్వుతూ.

"చాలా చీప్ జోక్ వేసారు బావాజీ!"అంది సుమన.

"నాకయితే అభ్యంతరంలేదు, షేక్స్పియర్‌ని అనుకుంటాను." అన్నాడు శ్రీకాంత్.

"సీతాదేవికూడా శ్రీరామచంద్రుడికన్న వయస్సులో పెద్ద అని అంటారు."అన్నాడురాజేష్. జనక్ వీళ్ళ సంభాషణ ఆసక్తిగా వింటున్నాడు. అతను మహరాష్ట్ర బ్రాహ్మణుడు. కొద్ది కొద్దిగా తెలుగు శ్రీకాంత్‌వద్ద నేర్చుకుంటున్నాడు. సర్వసాధారణంగా మహారాష్ట్రులకు తెలుగువస్తూనే వుంటుంది. కన్నడం మహారాష్ట్రులకు ఎక్కువగా వస్తుంది. 'జనక్' తల్లి తండ్రులు ఒకరు కన్నడులు ఒకరు మహారాష్ట్రులు. జనక్‌కు తెలుగు వాళ్ళంటే అభిమానం. మంచి గాయకుడు. త్యాగరాజ కీర్తనలు, రామదాసు భజనలు చక్కగా పాడుతాడు. వీళ్ళ సంభాషణ అర్ధం అవుతూంది. కాని మాట కలపటానికి అతను తడుముకుంటాడు.

"ఇంతకీ మీరు ఏకాంతం కోరుకుంటున్నారు కదా! నేను దిగిపోతాను" అంటూ లేచింది సుమన.

"అబ్బెబ్బె. వెళ్ళక్కర్లేదు. మన జనక్‌రాం చక్కగా పాడతాడు అంటే వినిపించమన్నారు. ఇక్కడెవరూలేరు కదా అని వొచ్చేము. నువ్వు వెళ్ళక్కర్లేదు" అన్నాడు శ్రీకాంత్.

"అన్నట్లు శృతికోసం ఏమీ అక్కర్లేదా!" అంది సుమన!

"ఇక్కడ తంబురాలూ తప్పెట్లూ ఎక్కడ దొరుకుతాయి! ఏదో సరదాగా కాస్సేపు పాడతాడు." అన్నాడు రాజేష్.

తివాసీమీద నలుగురూ కూర్చున్నారు. జనక్‌కు అంత బిడియంలేదు. ముందు "చక్కని రాజమార్గమే వుండగా" అంటూ రాగంతీసి చాలా హాయిగా పాడాడు. శ్రావ్యమైన గొంతు భగవద్దత్తం. ఆ పయిన కృషి. తర్వాత "సుఖి ఎవ్వరో రామా." తర్వాత సైగల్ పాట "శ్యాం హమారేచోర్" అన్న సూరదాస్ భజన పాడాడు. ఒకొక్కళ్లె ఒకొక్కళ్లె వస్తూ క్రమంగా హాలంతా నిండి పోయేరు. ఒకదాని తర్వాత ఒకటిగా ఒకదాని తర్వాత ఒకటిగా శ్రోతలు ఎక్కువయిన కొద్దీ అలాపాడుతున్నాడు జనక్‌రాం.

"ఏన భూల్‌నా జహాఁ జహాఁ జో ఫూల్ వహాఁ హై కాంటేఁభీ! జహాఁ జహాఁ పర్ హోతీహో తూఫాన్‌వహాఁ సన్నాటేభీ! కభీ భూల్‌కర్ భీనలగానా—జీవన్‌మే తుమ్ చింగారీ! ఘర్‌ఘర్‌కోతుమ్ స్వర్గ్ బనానా-హర్ అంగన్ మె ఫుల్‌వారీ—దేఖ్ రహీ హై దునియాసారీ—తుమ్‌పె బడే జిమ్మెదారీ—నయీ ఉమర్‌కె కలియోఁ తుమ్‌కో—" ఆపాట నిర్విణ్ణురాలై వింది సుమన. ఎంత చక్కని పాట! ఎంత చక్కని కవిత! ఎవరు వ్రాసేరో! ఆ పాట అంతా జనక్‌రాంచేత వ్రాయించుకుని కంఠతా పట్టింది.

పెళ్లి సందడి అంతా అయ్యింది. రాధ మనుగుడుపులకు రావటం వెళ్ళటం అయ్యింది. వసంత ఋతువు అయ్యింది. గ్రీష్మ ఋతు ప్రవేశం అయ్యింది. ఆవకాయల సందడి. మల్లెలూ మామిళ్ళూ. ఇంట్లో ఆడపిల్లలు వుంటే అంతా పనే.

సావిత్రి వచ్చింది—ఉరుములేని పిడుగులా. ఏమిటా అని శాంతా, రామనాధం ముఖ ముఖాలు చూసుకున్నారు. సావిత్రికి పెళ్ళి అయి ఏడెనిమిదేళ్ళు అవుతోంది. బొంబాయి అవతల ఏదో వూళ్ళో కంపెనీ ఉద్యోగం చేస్తున్నాడు. ముందు వాళ్ళు పెద్ద మొఖాసా దారులయినా వాళ్ళ కుటుంబం ఆడపిల్లల పెళ్లిళ్లు చేసీ మగ పిల్లలని చదివించీ దివాలా తీసారు. రాజేష్ ఆఖరివాడు. అతని తల్లీ తండ్రి ఆఖరి కొడుకు దగ్గర చేరారు. 'రాధ పెళ్లి అయి మూడునెలలు అయ్యిందో లేదో మళ్ళీ సావిత్రి రావటం ఏమిటీ!' అని సుమన కూడా ఆశ్చర్యపోయింది. సావిత్రివస్తే ఇంట్లో వెయ్యి రూపాయిలు ఖర్చు అవుతుంది. రానూ

పోనూ ఫస్టు క్లాసు ఛార్జీలు, పట్టు చీర ఇంకా మిఠాయిలు అన్నిచేయాలి. అయినా తల్లి తండ్రులు కూతుర్ని "ఎందుకు వచ్చేవు?" అని ఎలా అడగ గలరు? అల్లా అడిగితే ఇంక ఆడపిల్ల ఎక్కడకు వెళ్ళగలదు. మామూలు ఆదరంతోనే పలకరించేరు తల్లీ తండ్రీనూ. భోజనాలయినాక మేడమీదకు వచ్చేరు సుమన, సావిత్రి.

"ఏమిటే ఈసారి చప్పనే గాలి మళ్లింది ఇంటిమీద!" అంది సుమన.

సంవత్సరానికి ఒకసారి కాని వచ్చేదికాదు. దూరాభారం ప్రయాణం రైలు ఛార్జీలు ఉండుగ; వచ్చినప్పుడే ఒకనెల రోజులుండి వెళ్ళేది.

"చిన్న పనిమీదనే వచ్చేను. మా అత్త గారూ మీ బావగారూ పంపేరు." అన్నది సావిత్రి.

"ఏమిటే అది!" అంది సుమన. రాధ అత్త వారింటికి వెళ్ళటంతో రాధ మంచం ఖాళీగా వుంది. దానిమీద కూర్చుంది సావిత్రి. పచ్చగా పొడుగ్గా వుంటుంది. నొక్కు నొక్కుల జుత్తు. పొడవాటి జడ. చెంపకు చారెడేసి కళ్ళు, పల్చని చెక్కిళ్ళు. మృదువయిన మాటతీరు. మగ వాడికి గౌరవ భావం కలుగుతుందే కాని తేలిక భావం కలగదు ఆమెని చూస్తే.

"నీవే ఇందులో నాకు సాయం చేయాలి. నీకు నామీద ఏ మాత్రం అభిమానం ప్రేమా వున్నా నాకు సాయం చేయటానికి వెనుకాడవు."

"ఏమిటే పెద్దక్కా. చాలా పెద్ద పెద్ద మాటలు మాట్లాడేస్తున్నావు? నేనేమిటి నీకే విధంగా సాయం చేయాలి! బావగారు నిన్ను చదువు కోమన్నారా: నీకునేను చదువు చెప్పాలా!" అంది సుమన.

హృదయం ఎందుకో బరువుగావుంది. అక్క ఏమి అడగబోతుంది! ఆ సాయం ఎటువంటిది? అది తనవల్లనే కావాలి అంటే బహుశా చదువు విషయమే అయివుంటుంది. సావిత్రి చిన్నప్పుడు లేజీగా వుండేది. ఆటలు, లేసులు అల్లటం, తోటపని ఇష్టం. చదువంటే శ్రద్ధవుండేదికాదు. ఇరుగు పొరుగు పిల్లలని చేర్చి కొత్త కొత్త గేమ్స్ కల్పించి ఆడిస్తూ వుండేది. పెళ్లి అయినాక ఒకటి రెండుసార్లు రాజేష్ "నీకు చదువులోవున్న శ్రద్ధ మీ అక్కకులేదు. నీలాంటి చదువుకున్న అమ్మాయిలు అయితే నా ర్థిండియాలో బాగా రాణిస్తారు" అనేవాడు.

"అందాల సుందరులుంటారు నార్త్‌న. అల్లాంటి చోట నేను ఎలుగ్గొడ్డులా వుంటాను." అనేది సుమన;

"అందమెందుకు అడుక్కు తినటానికి; ఆడదానికి సుఖంగా బ్రతకటానికి చాకచక్యం వుండాలి!" అనేవాడు. బావగారి మెప్పుదల ఒకసారి సంతోషం కలిగించేది. ఇంకొకసారి చేతిలోవున్న వజ్రాన్ని గుర్తించలేని దౌర్భాగ్యుడు అని విసుక్కునేది.

అక్క ముఖంలోకి చూసింది. సావిత్రి చారెడేసి నీలాల కళ్ళు నీళ్ళూరుతున్నాయి. ముక్కు చివర అదురుతోంది; ముఖం-పసిమి ఛాయలో కలకల్లాడే ముఖం. బాధగా కమిలిపోయింది. సుమన మనస్సు అల్లకల్లోలమయింది, అక్క స్థితిచూసి.

"ఏమిటక్కా అంత బెంగపడుతున్నావు; ఏదన్నా డబ్బు అవసరం వచ్చిందా; నాన్న నడగమంటావా!" అంది సుమన. అందరు పిల్లలకన్న సుమనకి తండ్రి దగ్గర మాలిమి ఎక్కువ.

"అది కాదే; నువ్వేమనుకుంటావో అని భయంగా వుంది. వాళ్ళన్నమాట నాకూ పెద్ద తప్పుగా తోచలేదు. అంచేత బోలెడు దూరం అయినా సాహసించి వచ్చేసాను."

"ఏమిటో చెప్పవే! అంత తటపటాయింపు ఎందుకు; నేనేదో అనుకుంటాననే విషయం అయితే పోనీ వూరుకో. నన్ను బాధపెట్టటం నీకు మాత్రం సరదాయా!"

"బాధపడే విషయం కాదు. కాని ముందు వినగానే ఉద్రేకపడతారు. ఆలోచించితే సబబుగానే కనపడుతుంది."

"సర్లే? చెప్పు!" అంది సుమన.

"నువ్వు మీ బావని పెళ్లి చేసుకోవాలి!"

అంది సావిత్రి ముఖం దించుకుని.

"ఏమిటీ!" అంది సుమన—పడుకున్న దల్లా లేచి కూర్చుని.

"అదేనే. మా అత్తగారూ వాళ్ళూ చెప్ప మన్నారు. మీ బావకు కూడా ఇష్టమే. నీ అంగీకారం తీసుకుని వాళ్ళకు జాబు వ్రాస్తాను. నెమ్మదిగా అమ్మకు నాన్నకు నచ్చచెప్ప వచ్చును." అంది సావిత్రి.

"ఎవరికి పుట్టిందీ వుండు?" అంది సుమన కోపంగా.

"నాకీ మధ్య ఒంట్లో నలతగా వుంటోంది. కడుపులో ఏదో కణితిలాంటిది బయలుదేరింది అన్నది లేడీ డాక్టర్. కానుపువస్తే ప్రమాదంట! మాకు పిల్లలులేరు. ఆయనా చిన్నవారు. ఎంత కాలం భార్యవుండి బ్రహ్మచర్యం సాగించ గలరు! రాధనే అడగాలి అనుకున్నాను. కాని రాధకు కోపం, విలాసం ఎక్కువ. నువ్వు మంచి దానివి! ఎవరో పై అమ్మాయి అయితే నాకా ఇంట్లో ఆదరణ ఏం వుంటుంది? నువ్వయితే స్వంత చెల్లెలివి. ఈ రోగిష్టి, దీనురాలు అయిన అక్కమీద అభిమానం వుంటుంది. నీకు శాంతం సహనం, వున్నాయి. నువ్వయితే అందరికీ మనశ్శాంతిగా వుంటుంది."

"నీకు ఏదో 'కణితి' వున్నదని చెప్పితే మళ్ళీ పెళ్లికి తయారవుతున్నాడా! రాస్కెల్! తనకే ఏ చచ్చు రోగమో వస్తే నువ్వు మళ్ళీ పెళ్లి చేసుకుంటావా?"

"అదుగో ఆవేశపడుతున్నావు. ఆడవాళ్ళకు చేసుకుందామనివున్నా చేసుకునే నాథుడెవరు న్నారే! మొదటి పెళ్లి అవటానికే వేలకువేలు కట్నాలు కానుకలు పోసినా పాతికేసి ఏళ్ళు వస్తున్నాయి ఆడవాళ్ళకు! ఇంక రెండో పెళ్లి, మూడో పెళ్లి ఎవరు చేసుకుంటారే? పిచ్చి సుమనా!"

"ఒకవేళ నీకు 'కణితి' ఆపరేషన్ అయి మామూలు మనిషివి అయితే అప్పుడేం చేస్తావు?"

"మామూలు మనిషిని అయినా తల్లిని కాలేను. ఆ ష్యూరిటీ ఇస్తున్నాను."

"అక్కా!" అంది సుమన. ఆర్ద్రతతో కంఠం బొంగురుయింది.

"అవునే సుమనా! భగవంతుడు నాకంతే ఇచ్చాడు" అంది సావిత్రి.

"అయితే మీ అత్తవారు బావకు మళ్ళీ పెళ్లి చేయదల్చుకున్నారన్నమాట!" అంది సుమన.

"అవును వంశం నిలవాలి కదా!" అంది సావిత్రి.

"ఇంతోటి గొప్ప వంశం నిలవాలా! ఇంకా చాలామంది అన్నతమ్ములకు వున్నారు కదా వంశోద్ధారకులు! మునుపటివాళ్ళు మూకుళ్ళు ఎత్తుకు తిరుగుతూంటే సంతానం లేదని ఘోర తపస్సులు చేసేదట. మగవాడికి అల్లాంటి బుద్ధి పుట్టకనే పోవాలి. ఏవో వంకలు పెట్టూనే వుంటారు. ఆయనకు లేకపోతే నీకన్నా వుండాలి బుద్ధి. ఎదిరించలేక రాయబారానికి వచ్చేవా!" అంది సుమన తీవ్రంగా.

"తెలుగు దేశంలో సంప్రదాయ కుటుంబాలలోని ఆడవాళ్ళు ఇంకా భర్తలను ఎదిరించే స్థితిలోకి రాలేదు సుమనా! నేను రాయబారానికి రాలేదు. యాచన కొచ్చాను. నీవు ఒప్పుకున్నా ఒప్పుకోకపోయినా ఆయనకు మా అత్తవారు మళ్ళీ పెళ్లి చేయటం ఖాయం. నీవు ఒప్పుకుంటే నాకు కూడా అక్కడ గౌరవనీయ మయిన స్థానం వుంటుంది. పై అమ్మాయికి నా మీద అభిమానం, ఆదరణ ఎందుకు వుంటుంది! నలుగురు పిల్లల తల్లి అయిన దంటే నేను తినే ప్రతీమెతుకూ లెఖ్ఖక్రింద వస్తుంది. ఇంక పుట్టింట చేరితే భర్త ఒది లేసిన ఆడదాన్ని—వంట లక్కగానో, పని మనిషిగానో చూస్తారు తప్ప కన్నకూతురుగా చూడరు. కాగితాలమీద, సభల్లో ఉపన్యాసా లతో స్త్రీ జనాభివృద్ధి లెక్కకుమించి కనపడు తుంది తప్ప—స్త్రీ నలభయ్ ఏళ్ళ క్రితం ఎల్లాగవుందో ఇప్పుడూ అల్లాగేవుంది" అంది సావిత్రి.

"నీ బ్రతుకు చక్కగా నడవటానికి నేను బావకు తల ఒగ్గాలా!" అంది సుమన.

"సుమనా! కోపం తెచ్చుకోకుండా వుంటే ఒక్కమాట అడుగుతాను చెప్పు!"




"కోపమెందుకు అడుగు!"

"ఇప్పుడు నీకెన్ని ఏళ్ళు!"

"ఇరవయి ఆరు."

"నాన్నగారు ఈ ఏడాదే బోలెడు ఖర్చుపెట్టి రాధకు పెళ్ళి చేసారు. చెయ్యి కాలూ కూడ దీసుకోవాలంటే రెండు మూడేళ్ళు పడుతుంది. అప్పటికి నీకు ముప్ఫయ్ ఏళ్ళు దగ్గర దగ్గరగా వస్తాయి. అప్పుడు మటుకు నీకు మొదటి పెళ్ళి వాడు త్వరగా వస్తాడని గ్యారంటీ ఏమిటి! చదువు సంస్కారం పెద్ద కుటుంబం ఇన్ని అమరిన వాళ్ళు కట్నాలు అడుగుతారు. రాధ అదృష్టం కొద్దీ ప్రసాదం తల్లి పీనాసి తనంవల్ల కట్నాల రేటు పెరిగేదాకా ఆగేడు కనుక ముప్ఫయ్ ఏళ్ళువచ్చినా పెళ్ళి కొడుకులాగ మిగి లాడు. నాన్నగారు ఇంక వెతకలేక తిరగలేక అయిన కాడికి అప్పులుచేసి రాధని ఓ ఇంటి దాన్ని చేసేరు. మీ బావకేమీ లోటులేదు. కంపెనీ వాళ్ళు పెద్ద ఉద్యోగంలోవేసి బంగళా ఇచ్చేరు. రెండు మూడేళ్ళు నిలతొక్కుకున్నాక అక్కడే ఇల్లు కట్టుకుంటారు. కంపెనీ వాళ్ళకి మీ బావ అంటె అభిమానం. చాప చెడ్డా చదర మిగిలినట్లు కొంచెంలో కొంచెం భూవసతి పాతకాలం మేడలో వాటా వస్తుంది. ఇప్పటి రేట్లనిబట్టి చూస్తే మీ బావకూడా పాతికవేల రూపాయల పెళ్ళి కొడుకే! నువ్వుబాగా ఆలో చించుకో! నీ ఇష్టం లేకుండా నేను ఈ ముక్క నాన్నగారి దగ్గర, అమ్మ దగ్గర అనను. వాళ్ళ బాధపడుతారు. నా ఖర్మకు ఎవరేం చేస్తారు!" అంది సావిత్రి.

సుమన మాట్లాడలేదు. సావిత్రి అసత్యం ఏమీ చెప్పలేదు. సావిత్రి రాధలా అసూయా పరురాలుకాదు. తనని చదివించుతున్నారని ఆ విలువ చీరలూ నగలూ కొనేసుకునేది రాధ. ప్రతి చిన్న పనికి, తనతో వంతులు వేసు కునేది. అన్నిట్లోనూ పేచీలు పెట్టేది. రాధ సావిత్రికన్న అందంగా వుంటుంది. సావిత్రిది పసుపువన్నె కలిసిన తెలుపు ఛాయ అయితే, రాధది గులాబీ రంగు కలిసిన తెలుపు ఛాయ. గుండ్రని బుగ్గలు. నవ్వితే లొత్తలు పడేట్లుం టాయి. సాఫీగా పొట్టిగా గుజ్జుగావుండే జుట్టు. సుమనకన్నా ఏడాదిన్నర పెద్దదయినా సుమన కన్నా చిన్న దానిలా కనుపించుతుంది. సుమన దీర్ఘంగా ఆలోచనలో పడింది. సుమనకు రాధ పెళ్ళిలో రాజేష్ ప్రవర్తన మాటిమాటికీ గుర్తుకు వస్తూంది. తను ఎక్కడవుంటే అక్కడకు ఏదో వంకన జేరటం. మాట కలపటం. తను

ఇంతదూరం ఆలోచించలేదు. ఇప్పుడు ఒక దానికి ఒకటి అతుక్కని ఆలోచించితే ఇది అక్కను ఒక్కదానికే కలిగిన అభిప్రాయం కాదు. ముందు అతనికి ఈ ఆలోచన వచ్చిన తర్వాతే నాన్నగారి పరిస్థితి అసరాగా తీసుకుని అక్కను ఒకటికి రెండు విధాలగా భయపెట్టి ఇక్కడకు పంపివుంటాడు అనిపించింది సుమనకు. అక్క పరిస్థితికి జాలివుంది. సానుభూతి వుంది. ఆమె అంటే దయవుంది. ప్రేమ వుంది. ఎన్నివున్నా మనిషికి మనస్సుని త్యాగం చేయగల దృఢత్వం వుండాలి!అది సుమనకు లేదు. మనస్సుని త్యాగం చేయగల దృఢత్వం సుమన సంవత్సరం క్రితంవరకూ కలిగి వుండేదేమో! కాని ఇప్పుడు సుమన మనస్సు పారవేసుకుంది. అంచేతే ధైర్యంగా సావిత్రికి రిక్తహస్తం చూపించ కలిగింది. "ఇటీజ్ టూ లేట్ ఐ కాన్ట్ హెల్ప్!" అనుకుంటూ కన్నీరు నించింది.

* * *

సావిత్రి సుమన మనస్సులో ఒక సంచలనం సృష్టించింది. నాలుగు రోజులుండి ఏమీ చెప్పకుండానే రైలెక్కతానన్న కూతుర్ని ఏమీ అడిగలేక పోయారు రామనాధం దంపతులు.

వెళ్ళేప్పుడు గదిలోనికి వచ్చి "నీ గురించి కాక నా గురించిన ఆలోచన వచ్చినప్పుడు ఈ ప్రపోజల్ గుర్తుంచుకో. కోపం పెట్టుకోకు!" అంది సావిత్రి. సుమన మాట్లాడలేదు.

సావిత్రి వెళ్ళిపోయేక రెండు రోజులు తల్లితో మాట్లాడటానికి జంకు కలిగింది. తల్లితో చెప్పిందేమో తల్లి తనని అడుగుతుందేమో, అడిగితే ఏమని చెప్పాలా! వద్దనటానికి తమ కుటుంబ పరిస్థితిల్లో కారణం కనపడదు. పోనీ ఒప్పుకుందామంటే తల్లి తర్వాత కుటుంబానికి పెద్ద అయిన అక్క సంసారంలోనికి ఎల్లాగ వెళ్ళటం!

అక్క తన కిష్టమే అంటుంది. నిజానికి పరాయి ఆడదానితో భర్తని పంచుకోవలసి రావటం భరించలేకే తన సాయం కోరి వుండ వచ్చును! 'పరాయి వాళ్ళకన్న చెల్లెలు నయము' అని ఇప్పుడున్న పరిస్థితిలో అన్పించవచ్చును. తీరా తను బాధపడి ఆ ఇంటిని మెట్టిన తర్వాత తననికూడా భరించలేని పరిస్థితి రావొచ్చును. అయినా అక్క భర్తగానే తప్ప రాజేష్‌పట్ల తనకేమీ అభిప్రాయంలేదు. ఎవర్ని చేసుకుంటే చేసుకోనీ తను వాళ్ళ సంసారం మధ్యకు వెళ్ళదు. తండ్రి నచ్చచెప్పినా తన నిర్ణయం మార్చుకోదు. అమ్మయ్యా! ఈ స్వయం నిర్ణయంతో సుమన మనస్సు తేలిక యింది. తల్లి తండ్రుల మాటకూడా తను వినకూడదు అన్న నిశ్చయంతో వారం రోజులుగా భారమయిన మనస్సు దూదిపింజ మల్లే తేలిక అయింది.

'ఎందుకయినా మంచిది ఒకసారి నళినిని కలుసుకుని నిజంగా ఆమె సమాజం నడుపుతారేమో అడగాలి' అనుకుంది. జ్యేష్ఠమాసం. గాడ్పులు వేసివేసి సాయంకాలం నాలుగు దాటగానే నాలుగు వంకలా బూడిద రంగు మేఘాలు ఆకాశమంతటా మూసుకు రాసాగాయి. పెరట్లో చాలా మల్లెలు కొసాయి. వినత, పొరుగు పిల్లలూ చెండ్లు గుచ్చుతున్నారు. బావి దగ్గర నీళ్ళు చేదుకుని శుభ్రంగా స్నానం చేసింది. లైట్‌గా చందన పరిమళంగల పౌడరు వేసుకుని తలలో వత్తుగా మల్లెచెండు పెట్టుకుంది. గోధుమ రంగు ఫుల్‌వాయిల్ చీర స్నఫ్‌కలర్ కట్‌వర్క్ జాకెట్ వేసుకుని చెప్పులు తొడుక్కుంటూంటె వాసు వచ్చేడు.

"ఎక్కడికి అక్కా" అన్నాడు.

"అడిగావూ!" అంది సుమన.

"ఏం అడిగితే!" అన్నాడు శ్రీనివాసు.

"వెళ్ళిన పని అవ్వదు అంటారు."

"నువ్వు అంత ముఖ్యమైన పని అనుకుంటే వెళ్ళకు! కాస్సేపు కులాసాగా తిరిగొద్దాం అనుకుంటే వెళ్ళు. ఒకొక్కప్పుడు ముఖ్యం అనుకొన్న పని కాకపోయినా అంత కంటె ముఖ్యమయిన పని అవవచ్చును." శ్రీనివాసుకు నమ్మకాలు తక్కువ. ఇంచుమించుగా రాధ పోలికలు ఎక్కువ.

"అదెలాగరోయ్!" అంది సుమన తనకన్న పదేళ్ళు చిన్న అయిన శ్రీనివాసు చెప్పే నిర్వ

చనానికి ఆశ్చర్యపోతూ.

"ఒకసారి నేను భానుమతి పిక్చర్‌కు వెళ్లదామని నాన్నగారి పోతులబండిమీద బయలుదేరాను. పొరుగింటి బామ్మగారు ఎదురయ్యారు. ఎదురవ్వటమే కాక, ఎక్కడికిరా బయలుదేరారూ! బెల్లందిమ్మల్లా వున్నాయే. పేటకు పోతున్నారా! అంది. నా మనస్సు చివుక్కుమంది. అయినా 'అవునండీ' అన్నాను. పేటకు వెళ్ళేటప్పటికి ఆరోజే కొత్త సినిమాకు మార్చాడని తెలిసింది."

"మరి చూసేవా?" అంది సుమన.

"కంగారుపడకు! నేను భానుమతి ఫేవరేట్‌ని అయిన మాట నిజమే! కాని అంతకన్న అద్భుతమయిన పిక్చర్ వచ్చింది. నేను ఇంక జన్మలో చూడలేనేమో అని మధనపడిపోయిన పిక్చర్ మొఘల్ ఇ ఆజామ్ వచ్చింది. అది చూశాను. అంచేత నువ్వు ఒక పనికి అనుకొని బయలుదేరావు. నేను పలకరించాను. నీకు అంతకంటె ముఖ్యమయిన పని కలిసి రావొచ్చును. అంచేత సుఖంగా ప్రయాణించి లాభంగారమ్మ సోదరీ?" అన్నాడు. సుమన నవ్వుకుంటూ బయలుదేరింది.

చల్లని గాలి తిరగటంతో ఆహ్లాదంగా నడచింది. నళిని వాళ్ళ ఇంటికి చేరేసరికి నెమ్మదిగా నడవటంతో అయిదు దాటింది. చల్లని గాలి అల్లా ఈదురు గాలిలా మారింది. ఎక్కడలేని దుమ్ము దూగరా గింగిరాలు తిరుగుతూ ఎగిర సాగాయి. ఎండాకాలం ఇల్లాంటి గాలి దుమ్ములు ఆ ప్రాంతాల మామూలే! గంటో రెండు గంటలో ఇల్లా గాలి వీచివీచి టపటపా నాలుగు చినుకులు రాల్చి ఆగిపోతుంది. అక్కడ్నుంచీ గుమాయింపు గుబులూ మొదలవుతాయి. తడి చినుకూ పొడి దుమ్ముతో నళిని మేడ చేరేసరికి రాజమ్మ హాల్లో ఎదురయ్యింది.

"నువ్వా అమ్మాయి! నళినితో వెళ్ళలేదా నువ్వు!" అంది.

"ఎక్కడికి వెళ్ళారు?" అంది సుమన శ్రీనివాసు శకునం కథ జ్ఞాపకం తెచ్చుకుంటూనూ.

"పట్నం వెళ్ళారు ఉదయమే. రాత్రి ఎంత పొద్దుపోయినా వచ్చేస్తానందిలే. స్నేహితులెవరన్నా కలిసారేమో లేకపోతే ఈసరికి వచ్చేసును" అంది రాజమ్మ.

"అమ్మగారూ పాల చెంబు పడెయ్యండి" అన్నాడు పాలేరు వెంకన్న. రాజమ్మ కబుర్ల కాకరకాయ. మనిషి దొరికితే వదిలిపెట్టదు. ఈవిడ బాతాఖానీ మొదలు పెట్టిందంటె అర్థ రాత్రి అవుతుంది అనుకుంది సుమన.

"నన్ను పిలుద్దామనుకున్నారా!"

"అవునమ్మా! ఇంట్లో ఎవరితోనో కబురు చెప్పారు మిమ్మల్ని పిలుచుకు రమ్మని. అందుకనే మీరు కూడా వెళ్లేరేమో అనుకున్నాను. కూర్చో. పాల చెంబు ఇచ్చి వస్తాను." అంది.

"మేడమీదకు వెళ్ళి పుస్తకాలు తీసుకుంటాను లెండి. చీకటి పడకుండా వెళ్లిపోవాలి. రేపు మళ్ళీ వస్తాను" అంటూ మేడమీదకు వెళ్లింది.

నళిని గదిలో పెద్ద పెద్ద అలమారుల నిండా చాలా మంచి పుస్తకాలున్నాయి. పురాతన కవుల కావ్యాలనించి నేటి ఆధునిక రచయిత్రల రచనలు కూడా సేకరించింది నళిని.

అన్నీ చక్కగా పొందికగా అమర్చుకోవటం నళినికి సరదా! ఏమన్నా రెండు పుస్తకాలు తీసుకుపోదామని వెళ్లింది. సోఫాపై కళ్ళ మీద చేతులుంచుకుని పడుకున్ని వున్నాడు జగన్నాధరావు. అసుర సంధ్య వేళ. దీపం వేయబోయింది. స్విచ్ నొక్కింది కరెంటులేదు కాబోలు దీపం వెలగలేదు. కాస్సేపు కూర్చుంటె అదే వెలుగుతుంది, దీపం వచ్చేక పుస్తకాలు ఏమన్నా తీసుకుని వెళ్ళవచ్చును అనుకుంటూ పరధ్యానంగా సోఫామీద కూర్చోబోయింది. కూర్చుంది కూడా.

'ఎవరది!' అంటూ లేచాడు జగన్నాధం. అప్పటికే సుమన శరీరం చమట పట్టింది. దిగ్గున లేవబోయి తూలింది. జగన్నాధం పట్టుకున్నాడు! ఆ వెచ్చదనం! అహోయి! ఆ గగుర్పాటు! ఆ మైమరపు ఆ పులకింత! ఎవరో చెప్పక్కర్లేకుండానే ఒకళ్ళకి ఒకరు తెలిసిపోయేరు. అక్కడ అప్పుడు వినోద వుంది,

బెదురువుంది. కుతూహలంవుంది. ఆరుబయట ఎవరన్నా చూస్తారేమో చూసారేమో అన్న జంకువుంది. తొలి కలయికలోని మధురిమ మరువలేక బాధపడుతున్న తరుణంలోనే పునః స్సమాగమ మయింది. ఒకళ్ళ నొకళ్ళు ఏమి చేస్తున్నారో తెలియనీయలేనంత గాఢంగా హత్తుకుపోయినారు. జగన్నాథం చొరవకు ఏమీ అభ్యంతరం చెప్పకుండా పాతికేళ్ళ పరువాన్ని నిండు మనస్సుతో సమర్పణ చేసింది. ఆ సమయంలో ఇద్దరికీ తమ తమ గౌరవ స్థానాలు కాని, తమ మధ్య అయోమయావస్థలో నిలబడాల్సిన నళిని అనే వ్యక్తికాని గుర్తు రాలేదు. మామూలు సంసార్లు అల్లాంటి సంయోగాన్ని పవిత్ర ప్రేమగా కొనియాడలేరు. అది నీచమైన కామక్రీడ క్రిందే పరిగణిస్తారు. కాని వాళ్ళకు మటుకు వమ మనస్సులూ శరీరాలూ కలిసిన శుభ సంయోగం క్రిందవస్తుంది. గుమ్మని దీపకాంతితో గది నిండింది. అపూర్వమయిన అనుభవం దాచుకోలేని ముగ్ధలా కాంతి నలుదెసలా ప్రసరించింది.

గుండెలమీద తలపెట్టుకున్న అలసిన సుమనను ప్రేమగా లేవనెత్తాడు జగన్నాధరావు. భుజం చుట్టూ చేతులువేసి దగ్గరగా తీసుకున్నాడు. "సుమనా! నన్ను గౌరవించకలవా!" అన్నాడు.

"అదే ప్రశ్న నేనూ మిమ్మల్ని వేయవచ్చును" అంది అతని షర్టు బొత్తాము తిప్పుతూ తలవంచుకొని.

"నీ మాటకారితనం కాదు. నా హృదయాగ్ని చల్లార్చావు. నీకు నేను ఋణపడి వున్నాను. ఏం చేయాలో చెప్పు."

"నా బ్రతుకు నా యవ్వనం సార్ధకం అయ్యింది. మీలాంటి పురుషుల చేతిలో పడగలనా లేనా అని నేను రోజూ వెయ్యిదేముళ్ళకు మొక్కుకుంటున్నాను. అంతకంటె నేను చెప్పగలదేమిటి!"

"సుమనా! నువ్వు అందకత్తెవు కాకపోవచ్చును. కాని నీ స్పర్శలో విద్యుత్తువుంది. మగవాడ్ని సుఖపెట్ట గలవు. రోజూ ఎవరో ఆ అదృష్టవంతుడు అని మధనపడే వాడ్ని!"

"వెయ్యి జన్మల అనుభవం అందిచ్చారు. నేను నోటితో చెప్పలేని దివ్యానుభూతిని పొందాను. అది ఈ జన్మకు చాల్ను."

"ఎంత మంచి దానివి!" కాలం ఆగి పోయింది. ఇరువురూ ఒకటైనారు. తనివి తీరటంలేదు. మనసు నిండటంలేదు. పదేళ్ళ పిల్ల పుట్టినించీ చూస్తూన్నా ఆమెను ఇవ్వాళే చూస్తూన్నట్లు అన్పించ సాగింది జగన్నాధంకు.

రాత్రి ఇంటికి వచ్చినా పరధ్యానంగానే వుంది సుమన. భోజనాలయినాక మేడ ఎక్కుతూంటె శ్రీనివాసు వచ్చేడు.

"అక్కా! వెళ్లినపని ఏమయింది!" అన్నాడు. గతుక్కుమంది సుమన.

"ఆమె లేనేలేదు." అంది.

"ప్చ్! అయితే నా స్పెక్యులేషన్ లాభించలేదన్నమాట!" అన్నాడు.

సుమన పైకివెళ్ళి మంచంమీద వాలిపడుకుంది. వళ్ళంతా మత్తుగా హాయిగావుంది. శ్రీనివాస్ శకునం మంచిదే అయింది. తన జీవితంలో ఎనలేని హాయి అనుభవించింది. వినోద చెప్పినట్లు అవకాశం జార విడుచుకోలేదు. వినోదకు జాబు వ్రాయాలి అనుకుంటూ నిద్రలోనికి జారుకుంది. ఒక పనిచేయలేకపోతే ఆపని చేయలేకపోయామే అని జన్మంతా బెంగపెట్టుకుంటూ కుమిలి పోవటం కంటె తప్పో ఒప్పో! సబబో! బేసబబో! నీచమో, పాపమో, ఆపని చేసేస్తే మనిషి మనస్సు ప్రశాంతంగా వుంటుంది. వరదపెల్లువ వస్తుంది. ఎక్కడలేని చెత్తాచెదారం కొట్టుకు వస్తుంది. వరదతీసినాక ఏటిలోని నీరు చాలా తేటగా నిర్మలంగా వుంటుంది. అనుభవాలూ అంతే! మంచి అవనీండి, చెడ్డ అవనీండి—మర్యాద కానీండి! అమర్యాద కానీండి - ఒక్కొక్క అనుభవంలో మనిషిలో పరిశీలనాశక్తి పెరుగుతుంది. జీవితం ముందుకు సాగుతుంది. వయస్సులో ప్రేమానుభవం కలగని మనిషి మనస్సులో ఆర్ద్రత చచ్చిపోతుంది. ఏ వయసు వచ్చినా, పండు ముదుసలి అయినా, వయస్సులోని ప్రేమానుభవం స్ఫురణకు వచ్చినప్పు

విపరీతమైన కామోద్రేకాలకు గురైన పురుషులు ఎంతటి దారుణానికైనా వెనుకాడరు. డా॥ మేరీ మెహల్ అనే ఓ మనోతత్వవేత్త వీళ్ళకి చక్కటి మందునొకటి తయారు చేసింది. దీని పేరు "డీపో ప్రోవిరా!" ఈ మందు యిటువంటి పురుషుల్లో ఏర్పడే కామవాంఛను పోగొడుతుంది. ఒక దౌర్భాగ్యుడు తన కూతురునే బలాత్కరించడానికి ప్రయత్నించగా అతడిని పిచ్చాసుపత్రిలో చేర్పించారు. ఈ మందును అతడి మీద ప్రయోగించి అతడిని మామూలు మనిషిగా చేశారు!

(వి)చిత్ర విజ్ఞానం



డల్లా ఆ మనిషి వయస్సు మరిచిపోయి రసార్ద్రిత పొందగలుగుతాడు. అది అతనికి నూతన చైతన్యం కలుగచేస్తుంది. ప్రేమానుభవం లేని మనిషి మనస్సు ఎండు వరడు అయిపోతుంది: కంపు కట్టిన గుండె తీయనిరాగాలకు పల్లవించదు!

* * *

నళిని సుమన కలిసి వనితా మండలి నొకదానిని ఏర్పాటుచేసారు. పట్నంనించి జడ్జీగారి భార్యని ఆహ్వానించి ప్రారంభోత్సవం చేయించారు. సుమన చాలా ఉత్సాహంగా ఇంటింటికీ వెళ్ళి చందాలు పోగుచేసింది. జగన్నాధరావుగారి తోటలోనే ఒక పెంపు ఆస్బెస్టాస్ రేకులతో పెద్ద పెద్ద షెడ్డులు వేయించారు. చుట్టూ పూలతోట! 'సుమన' కార్యదర్శిగా కరపత్రాలు అచ్చువేయించారు. ఎండనక కొండనక ఇళ్ళమ్మట తిరుగుతున్న కూతుర్నిచూస్తే చిరాకు వేసింది శాంతమ్మకు.

"ఏమిటే నువ్వు చేసే గవర్నరుద్యోగం: తిండీ తిప్పలు అక్కర్లేదు! ఎండనీ వాననీ లేదు. ఏమీటా తిరుగుడు!" అని కేకలేసింది.

"అక్కా వాళ్ళు సంఘం ఏదో పెట్టారుట అమ్మా. అక్కా! సావిత్రి అభిమాన సంఘమా! జమున అభిమాన సంఘమా!" అన్నాడు శ్రీనివాసు.

"సినీ అభిమాన సంఘం కాదు, యువతీ మండలి. నాలాంటి వాళ్ళకు చదువులూ చాకిరేవులూ చెప్పుతారుట!" అంది వినత.

"ఓహో! పెట్టగారు కూత వట్టారే! నీకు కూడా వేళాకోళం అయ్యూనా!" అంది సుమన రోషంగా.

"వాళ్ళంటె రోషంఎందుకు! నువ్వుచేస్తున్న పనేమిటో ముందు చెప్పు!"

"నేనేమీ వూరికే బలాదూర్లు తిరగటంలేదు. నళినిగారు సంఘం పెడదామన్నారు. తీరిగ్గా వున్నాను కదా అని కార్యదర్శిగా వేసుకున్నారు. ఆ పనిమీద తిరుగుతున్నాను."

"నువ్వు పక్కర్తివే తిరగటం ఎందుకు! ఆవిడ తిరగలేదా! అసూర్యంపశ్య గాబోల్ను! వున్న జమీచాలలేదు కాబోల్ను వూరిమీద దండుకుంటోంది."

"ఛఛ! ఎందుకమ్మా ఆవిడ్ని అంటావు! ఆవిడ పట్నం వెళ్ళటం కావల్సినవన్ని కొనటం చూస్తోంది. ఇందులో ఆవిడకేమీ లాభం వుండదు. ఏదో వూళ్ళో వాళ్ళకి కొంచెం నాగ

రికత నేర్పుదామని తాపత్రయం ఆవిడకు."

"ఓహో మీ మండలి లేకపోతే మేము జింక చర్మాలు కట్టుకుని పచ్చిమాంసం తినీ బ్రతికే వాళ్ళము కాబోలు! ఆవిడ కేమిటి! పుష్కలంగా డబ్బుంది. పిల్లాజెల్లాలేరు. ఇష్టం వచ్చినట్లు తిరిగినా చెల్లుతుంది. నువ్వు ఒక ఇంటికి వెళ్ళవలసిన దానివి. ఆ పిల్లకు కాలు నిలవదు అన్న పేరువస్తే ఇంక పెళ్ళికావటం కష్టం" అంది శాంత.

"నా పెళ్ళి అయ్యే రోజుకి ఇవన్నీ ఎవరికి జ్ఞాపకం వుంటాయిలే! ఇప్పటిమాట కాదుగా!" అంది సుమన.

శాంతమ్మకు రోషం వచ్చింది.ఒక వయస్సు వచ్చే సరికి పిల్లలు ప్రతీదానికీ సాధింపు ధోరణిలో మాట్లాడుతారు. ఒక రైలు లేటుగా బయలుదేరితే దాని వెనకాతల బయలుదేరాల్సిన రైళ్లు అన్నీ లేటు అవుతాయి. ఈ సంవత్సరం చేద్దాం. ఆ సంవత్సరం చేద్దాం అనుకుంటూ సావిత్రి పెళ్లి ఇరవయి రెండేళ్ళు వచ్చేదాకా చేయలేక పోయారు. దాని తర్వాత సంబంధాలు చూస్తూ చూస్తూండగానే రాధ పెళ్ళి ఆలస్యం అయిపోయింది. పోనీ చదువు కుంటూంది కదా అని చదువు చెప్పించితే ఇల్లు పట్టకుండా తిరగటం. ఏమన్నా అంటే ఎదురు జవాబులు చెప్పటం. పెద్ద వాళ్ళని గౌరవించటం ఎనాడో మర్చిపోయేరు పిల్లలు.

"ఇప్పటి మాట కాకపోయినా మచ్చ వచ్చిందంటే మాసిపోదు. అది గ్రహించుకో. ఇది పల్లెటి ముండా వూరు. ఏ బొంబాయో ఢిల్లీయో అయితే మనల్ని పట్టించుకునే నాధుడుండడు. ఇక్కడ అందరి సంగతులు అందరికీ కావాలి. మా అసమర్థత వల్లే మీరు చెట్లల్లా పెరిగి నెత్తిమీద కూర్చున్నారు. ఇంతమంది ఆడ పడుచులు తిని పోవటమే కాని తమ్ముడు సంసారం ఊసుపట్టించుకునేవారు కాదు. నా మాటకు విలువలేదు.ఆస్తులు ఆస్తులు అంటూ ఈ వెధవ వూళ్ళో మకాం పెట్టారు." అంది శాంతమ్మ.

"మనం వుండటంలో వుంది, వూరిదేమి వుంది! ఎక్కడవుంటె అక్కడే మన వూరు నోరు మంచిదయితే ఊరుమంచి అంటారు. మనం జాగ్రత్త పడక ఎవరో ఏదో చేయలేదే అని బాధపట్టం దేనికి! అత్తయ్యలు తమ్ముడు సంసారం ఊసు పట్టించుకున్నా ఏం చేయ కలరు! వాళ్ళకి మాకు ఈడు జోడు అయిన కొడుకులున్నారు కనుకనా మమ్మల్ని కోడళ్ళుగా చేసుకోలేదు అని దుయ్యపట్టటానికి! నలుగురు పిల్లలున్న వాళ్ళకు ముందు చూపు వుండాలి." అంది సుమన.

"పోనీలే! ఎల్లాగో అల్లా మా రోజులు గడుస్తున్నాయి, మీరు మీ జీవితాలు నిర్దుష్టంగా తీర్చిదిద్దుకోండి. అద్దాలలో పిల్లలు కాని గద్దాలలో పిల్లలు కారు కదా! మీ నాన్నగారు నే చెప్పిన మాట వినరు కనుక మీరంతా ఇంత తాడుబారిపోయేరు." అంది శాంతమ్మ.

"అన్నిటికీ ఆయన్ని ఆడిపోసుకోవటం ఒక్కటే మిగిలింది." అంటూ అక్కడ్నించీ లేచి వెళ్ళింది సుమన. తన గదిలో కూర్చుని వినోదకు జాబువ్రాయ సాగింది.

"వినో! చిన్న దానివయినా గురుతుల్యురాలివి. నీకు గురుదక్షిణ ఏమియ్యాలా అని ఆలోచిస్తున్నా! నీ ఆర్ట్ ఎంతవరకు వచ్చింది! జనక్‌రాం కలుస్తున్నాడా! అడిగానని చెప్పు! ఈ ఉత్తుత్క్రమం పూర్తి అయ్యేసరికి మళ్ళీ ఎండాకాలం వస్తుంది. తప్పక నువ్వు రావాలి! నా ముఖంలోని తృప్తిని నీవు బాగా పట్టిస్తావు. ఎంతయినా కళా హృదయినివి కదా! వన్‌సైడ్ అయిపోతానేమో అని చాలా మధనపడ్డాను. ఎదురు చూడని ఆహ్వానం, ఆప్యాయత అంది పుచ్చుకున్నాను. మంచి నీటితో దప్పిక తీర్చుకుందా మనుకున్న నిరుపేదకు సరస్సు నిండా అమృతమే లభించినట్లు వుంది. రాధక్క పెళ్ళితో నాకు ఇంట్లో వుండాలంటే ముళ్ళమీద వున్నట్లు వుంటోంది. ముందు అనుకున్నట్లు మామయ్యగారి వూరుకు వెళ్లి ఉద్యోగ ప్రయత్నం చేద్దామంటే అతనికి దూరమవుతానని



భయంగా వుంది. నళినిగారి ప్రోత్సాహంతో వనితా మండలిని లాంఛనంగా ప్రారంభోత్సవం చేసాము. ఆవిడ పట్టు మిషన్స్ కొంటా నన్నారు. కొంతమంది అమ్మాయిలు, నడి వయస్సు స్త్రీలు మెంబర్సుగా చేరారు. చాలా మందికి చదువుకోవాలన్న ఉత్సాహం వుంది. మెల్లగా గేదర్ చేస్తున్నాము! ఊరికే మటుకు కూర్చోపటంలేదు. నువ్వు వచ్చేప్పుడు జనక్ రాంని కూడా తీసుకురా! అతనిచేత మా మండలిలో పాట కచ్చేరి చేయిస్తాను. గ్రేస్‌ఫుల్ లేడీకి నా వందన సహస్రాలు. తప్పక వస్తావు కదూ!"—నీ సుమన.

* * *

"నీవు ఎక్కదలచిన రైలు ఎప్పుడూ ఒక్క జీవితకాలం లేటు అని ఎందుకు వ్రాసారా అనిపించుతోంది. సుమనా! ఇద్దరం ఒక వూరి వాళ్ళం. రెండు కుటుంబాలకీ స్నేహ బాంధవ్యాలున్నాయి. నా చిన్నప్పుడు మీ అక్క సావిత్రితో పెళ్ళి ప్రస్తావన కూడా తెచ్చారు బంధువులు. అప్పుడు నా వయస్సు పెద్దదయినా మనోనిశ్చయం కలగలేదు. ఇప్పుడు నాకు నువ్వు కావాలనిపించుతోంది. ఇది ఎంత సంఘ విరుద్ధమైన పనో మనిద్దరికీ తెలుసును. ఇద్దరం చదువుకున్నాం. సంస్కార వంతుల కోవలోకి చెందిన వాళ్ళం. సంపన్న కుటుంబీకులం. ఏ పరిస్థితులలోనూ నిన్ను దూరం చేసుకోలేని బలహీనతకు లోనయినాను." అన్నాడు జగన్నాధరావు ఒకసారి.

"వియ్యం అయిపోతాయని భయపడిఅన్నం వండుకోవటం మానరు. చీకటి వస్తుందని వెలుగులో కూడా చేతులు ముడుచుకుని కూర్చుంటారా! లెట్ మి ఎంజాయ్ మై లైఫ్! ఈ పిల్ల ఇంత ఈజీగోయింగ్ ఏమిటా అని ఆలోచించకండి. ఆడవాళ్ళకి చాలా విషయాల్లో స్వార్థం వుంటుంది. చేజారిన క్షణం తిరిగి చేతిలోకి రాదు. వృధా ప్రసంగాలతో మనస్సుని కలవర పెట్టుకుని ఆనందంగా గడపాల్సిన క్షణాల్ని పాడు చేయకండి" అంది సుమన జవాబుగా.

సుమన ఏ ధైర్యంతో ఇంత నిస్సంకోచంగా తనని తాను అర్పణ చేసుకుందో అర్థం కాలేదు జగన్నాధానికి. అది వక పజిల్ అయ్యింది అతనికి.

జనవరినెలలో వనితా మండలిలో స్కూలు కూడా పెట్టారు. నడి వయస్సు స్త్రీలు పెళ్ళి కాకుండావున్న అమ్మాయిలు మధ్యాహ్నం పూట వచ్చి చదువుకుంటున్నారు, కొంచెం స్టాండర్డువుండి ఉత్సాహంగావున్న అమ్మాయిలకు పెద్ద క్లాసు పుస్తకాలు నేర్పుతున్నారు. కొంతమంది హిందీ, కొంతమంది కుట్లు, అల్లికలు, నేర్చుకొంటున్నారు. కొంతమంది వచ్చి వారపత్రికలు మాసపత్రికలు చదువుకుని వెళుతూవుంటారు,

"చూడు సుమన రెగ్యులర్‌గా స్కూల్‌లో పాఠాలు చెబుతూన్నట్లుంది కదూ!" అన్నాడు ఒకరోజు జగన్నాధం.

"మనకు విద్యాగంధంవున్న అమ్మాయి తను ఒకర్తె! తను చెప్పకపోతే ఇంకెవరు చెప్తారు" అంది నళిని.

"వాళ్ళ పొలాలన్నీ గివర్నమెంటు వాళ్ళకు సరెండర్ చేయాల్సి వచ్చింది. రాధ పెళ్ళికి నలభయివేలదాకా అప్పుచేసారుట! అప్పు తీర్చాలంటె పొలం అమ్మాలి. గవర్నమెంట్ డిక్లరేషన్ ఇస్తే కాని పొలం అమ్ముకుందుకు వీలుండదు. రామనాధానికి ఇంచుమించు పిచ్చి ఎక్కేలావుంది. ఎల్లాగూ స్కూలు అంటూ ఒకటి పెట్టాము కనుక నెలకి ఇంత అని ఆ అమ్మాయికి ఇస్తే బాగుండదూ!" అన్నాడు.

"నేనూ అదే అనుకుంటున్నాను. తను ట్రయినింగ్ అవలేదు. వూళ్ళో ఆడవాళ్ళందర్నీ కలుసుకుని తమ పిల్లలకు రెగ్యులర్‌గా చదువులు చెప్పించే మాటయితే స్కూల్‌ని రికగ్నయిజ్ చేయించటానికి ప్రయత్నించుతాను అని చెప్పుతాను. ఇద్దరు ముగ్గురు ట్రయిన్డ్ టీచర్స్‌ని అప్పాయింటు చేయొచ్చును. తోట వెనకాల చిన్నచిన్న పెంకుటిళ్లు కట్టామంటె ఫ్రీ క్వార్టర్స్‌కూడా ఇవ్వవచ్చును." అంది నళిని.

"అది సరే! మరి సుమన సంగతి?" అన్నాడు జగన్నాధం. సుమనకు ఏదోవిధంగా తమ కుటుంబంతో ఎక్కువ టచ్ వుండేట్లు చేయాలి. నళినికీ సుమనకు మధ్య మామూలు స్నేహంవుంది. అయితే మామూలు స్నేహం నూలుదారం లాంటిది. దానిని చాంతాడులా తయారు చేయాలి. స్నేహం ఎంతో పటిష్ఠమయితే తప్పు తప్పులని క్షమించే సహృదయత వుండదు. ఇదివరకు 'జగన్నాధరావుగారు'లా దూరదూరంగా వుండే వ్యక్తి, ఇప్పుడు భార్యకు కూడా 'జగన్నాధం'లా చనువు ఇయ్యగలిగిన మనిషి అయినాడు. భర్త తన కార్యక్రమాల పట్ల ఆసక్తి చూపటంతో నళిని కింకా ఉత్సాహం ఉప్పొంగింది.

"సుమన అందాకా టీచింగ్ చేస్తుంది. కాని తను స్కూల్‌కి కరస్పాండెంట్‌గా వుంటుంది. వనితా మండలికి సెక్రటరీగా వుంటుంది. తనకి మంచి కమాండింగ్ పవర్ వున్నది. జీతమంటారా ఎంత ఇస్తే బాగుంటుందో మీరే ఆలోచించండి. అభిజాత్యంగల పిల్ల. ఆత్మాభిమానం దెబ్బతీయకుండా వుండాలి," అంది నళిని.

"రెండు వందలు ఇస్తే బాగుండదూ!" అన్నాడు, మరీ పెద్ద అంకె చెప్పితే నళిని ఏమన్నా అనుకుంటుందేమో అని భయంతో.

"ఛ ఎంతయినా గ్రాడ్యుయేటు! రెండు వందలేమిటీ నాలుగు వందలియ్యాలి. అటు మండలి పనీ ఇటు స్కూల్ పనీ అన్నీ చూసుకుంటోంది కదా!" అంది నళిని. ఇంకా మాట్లాడుకుంటున్నంతలో సుమన వచ్చింది,

"రా! రా! నీ గురించే అనుకుంటున్నాము. నిండా నూరేళ్ళ ఆయుష్షు" అంది నళిని. సుమన గతుక్కుమంది. 'జగన్నాధం మెతక మనిషి! కొంపతీసి నళిని ముందు తమ సంబంధంగురించి నోరుజారలేదు కదా! ఎంతయినా పదేళ్ళనించీ సంసారం చేస్తున్న భార్య. వాళ్ళూ వాళ్ళూ బాగానే వుంటారు. తన బ్రతుకుబాట ముళ్ళ దొంకలోకి లాగుతారు.' సుమన అనుకుంది, పైకి మామూలుగా వుండటానికి ప్రయత్నించుతూ.

(ఇంకా వుంది)



# గోటను ముక్కలు

## —పైడిపాల

(అనాదినుంచీ కథలూ కన్నీళ్ళూ ఆడజాతి ఆస్తి)

బ్రాహ్మలూ—బ్రాహ్మణేతరులూ కాదు.

ఫార్వర్డ్ కేష్టు—షెడ్యూల్డు కేష్టుకాదు.

సంసారులూ—సానులూ.

పొరపాటయింది—ఇప్పుడు పై దానికి కులభేదం లేదు.

భోగంవాళ్ళూ—భోగంవాళ్ళు కాని వాళ్ళూ.

అందరూ ఆడది నెల తప్పగానే కొడుకు పుట్టాలని కోటి దేవుళ్ళకు మొక్కుకుంటారు.

కాని భోగం జాతిలో మాత్రం కూతురు పుట్టాలనే కోరుకుంటారట!

పశువులు రెండు రకాలు.

ఆడా మగా తేడా కాదు.

ఆడ జాతిలోనే ఆవు—గేదె అని.

ఆవుకి గిత్తపుడితేఆనందిస్తాం.

గేదె పెయ్యని పెడితే సంతోషిస్తాం.

మనుషుల్లోనూ రెండు రకాలు—

అవును, ఆడాళ్ళలోనే—అదికూడా చెప్పాలా?

భోగం కులంలో పుట్టిన సరోజ మాత్రం తన కడుపు పంట 'మగాడు' కావాలని పూజలూ వ్రతాలూ చేస్తోంది.

వేశ్య ప్రార్థనలకి భగవంతుడు ప్రసన్నుడౌతాడా? దేవుడు కూడా మగవాడే మరి!

తెలిసిన మగాళ్ళందరికీ సరోజ తల్లి కావడమే ఇష్టంలేదు!

స్వజాతీయులంతా సరోజ తల్లయినా 'పిల్లతల్లి' కావాలని ఉవ్విళ్ళూరుతున్నారు.

వెరసి, సరోజనందరూ వెర్రిబాగుల పిల్ల అంటున్నారు.

సరోజ కోరిక అసభ్యం, అసహజం అంటున్నారు.

మరి సరోజ మొగుడేమంటున్నట్టు?

భోగం పిల్లకి మొగుడుంటాడా?

మొగుడు లేనిదే సంతాన ప్రాప్తి ఎలా?

సతీసావిత్రి యముణ్ని అడిగిన ప్రశ్నలా వుంది.

(అపరాధం—పతివ్రతల ప్రసక్తి ఇక్కడ పనికిరాదు.)

ఈ ప్రశ్నలోనే అసలు కథంతావుంది.

చిక్కుముడి విప్పుద్దాం—

♦ ♦ ♦

సరోజ ఎంకయ్యమ్మ కూతురు.

సొంత కూతురు కాదు—పెంచుకొన్నది.

ఎంకయ్యమ్మకి సొంత కూతుళ్ళులేరు.

ఎంకయ్యమ్మ తెలివైంది, వలపుకీ మదుపుకీ చెడుపని పిల్లాజెల్లా లేకుండా జాగ్రత్త పడింది.

సరోజ తల్లి సుఖరోగాలతో చచ్చిపోయింది. పోతూపోతూ మూడేళ్ళ పసికందుని ఎంకయ్యమ్మ చేతుల్లో పెట్టింది.

ఆడపిల్ల కదా. కాలూ చెయ్యి వంగిన తర్వాత అక్కర కొస్తుందని వెంకయ్యమ్మ సరోజని ఆదుకొంది.

వేశ్యావృత్తిలో ఎంత జాగ్రత్తపడినా గొర్రె తోక సామెతేనన్న సంగతి ఎంకయ్యమ్మ అనుభవంమీద గ్రహించింది.

అందుకే తన కూతురు సినిమా నటి కావాలని ఆశ. ఆ ఆశతోనే చిన్నప్పటినుంచి మేళాలకీ తాళాలకీ తీసుకెళ్ళకుండా సరోజను చదివిస్తోంది.

ఎనిమిదో తరగతిలో కొచ్చేసరికి సరోజ అరటి మొక్కలా ఎదిగిపోయింది. చదువు మాత్రం అంతంత మాత్రంగానేవుంది.

భోగంపిల్ల స్కూలు కొస్తుందనేసరికి పాంటు తొడుక్కోవడం ప్రారంభించిన ప్రతి కుర్రాడికీ ఆ అమ్మడిమీదే దృష్టి.

కాగితం రాకెట్లూ, లవ్‌లెటర్లూ, కోర చూపులూ, హీరో పోజులూ — స్కూల్లో ఈ బాధ సరోజ కెక్కువై పోయింది.

ఎంకయ్యమ్మ యింట్లో పైచేసిన 'ఒప్పుల కుప్ప', అర విరిసిన మందారం వుందనేసరికి తల నెరిసిన రసికుల కందరికీ పునర్యవ్వనం వచ్చింది.

కన్నెరికం చేస్తామనీ, ఉంచుకుంటామనీ, ఇల్లు రాస్తామనీ, పొలం పిల్లపేర పెడతామనీ-ఎంకయ్యమ్మను వేధించుకు తింటున్నారు.

అలా ముసురుతున్న ముసలి ఈగల మొహాలమీద ఉమ్మేసింది ఎంకయ్యమ్మ.

వాళ్ళలో ఎక్కువమంది ఎంకయ్యమ్మ కాతాదారులే. అయితేనేం—వయస్సు వలపు కడ్డం రాదన్నారు—వరసలేదన్నారు.

సరోజ మరో రెండు క్లాసులు గట్టెక్కింది.

సరోజంటే మాష్టర్లకికూడా విపరీతమైన అభిమానమట! ఆ మాట చెప్పినప్పుడు ఎంకయ్యమ్మ వేదాంతిలా నవ్వుకుంది.

దానికాకారణం—'ఓపెన్ డోర్ టెమ్ట్స్ ఎ సైంట్' అనే ఆంగ్లసూక్తి తెలియికపోయినా మగాళ్ళ బలహీనతలు ఎంకయ్యమ్మకు బాగా తెలుసు.

సరోజకి క్లాసు పుస్తకాలకి సంబంధించిన పరిజ్ఞానం ఎలావున్నా వారపత్రికలూ, సినిమా పత్రికలూ చదివి అర్థం చేసుకొనే జ్ఞానం వచ్చింది.

చిన్నప్పటినుంచీ ఎంకయ్యమ్మ సినిమా పిచ్చిని రగిల్చింది గనుక సరోజకి సినిమా నటి కావాలనే తాపత్రయం పెరిగింది.

సినిమా బొమ్మల్లో హీరోయిన్ల స్థానంలో తనని ఊహించుకొనేది. అద్దంలో తన ప్రతిబింబాన్ని వివిధ భంగిమల్లో చూసుకొని మురిసిపోయేది.

ఇలా తల్లీ కూతుళ్ళు కలల పట్టుదారాల తెరల్లోంచి సినిమా ప్రపంచాన్ని చూస్తూ పరవశించిపోతున్న తరుణంలో ఆ యింట్లో ఆనందరావు అడుగుపెట్టాడు.

ఆనందరావు ఆ ప్రాంతంలో పేరున్న సాంఘిక నాటకాల దర్శకుడు. నాటకాల దురదతోబాటు డొక్కశుద్ధీ ఆర్థిక పుష్టీ ఉన్నవాడు.

నలభయ్యో పడి దాటుతున్నా ఇంటి

బాధ్యతలేని ఇల్లరికపుటల్లుడు. అతనికి బాంకులో వుద్యోగమే కాదు—పెద్ద మొత్తం బాంక అకౌంటూ వుంది.

ప్రస్తుతం ఆ ప్రాంతంలో దారుణమైన కరువు—అదే నటీమణుల కొఱత. తన చేతి మీదుగా ఓ నూతన నటిని కళాక్షేత్రానికి కానుకగా సమర్పించాలని అతడి అన్వేషణ.

ఈ ప్రయత్నంలో వున్న ఆనందరావు కన్ను సరోజమీద పడింది—సొగసైన కను ముక్కు తీరు అతణ్ని అమితంగా ఆకర్షించింది.

ఆనందరావు తన గుమ్మం దగ్గర తచ్చాడ్డం చూసిన ఎంకయ్యమ్మ పనిపిల్లచేత తలుపు తెరిపించి అయిదు నిముషాల్లో కొత్త పెళ్ళి కూతురిలా ముస్తాబైవచ్చి వగ లొలికించింది.

తీరా ఆనందరావు కూతురు ప్రసక్తి తెచ్చే సరికి కించిత్ నిరాశపడింది — ఆ తర్వాత సరోజని చూపించమని అడిగితే కోప్పడింది కూడా.

అసలు విషయం చెప్పేసరికి కొంత శాంతించి సినిమాల్లో చిప్ప నాటకాల్లో వేషం వేయించనంది.

'సినిమా రంగంలో తారాపథంలో విహరిస్తున్న తారల్లో చాలామంది నాటకాలువేసి పైకి వచ్చిన వాళ్ళే. వెండి 'తెరకి నాటకరంగం నిచ్చెన' అని చెప్పి ఒప్పించేసరికి ఆనందరావు పెలప్రాణం తోకకి వచ్చింది.

ఎంకయ్యమ్మ మెత్తబడి సరోజని ఎదుట పెట్టింది.

ఆనందరావు సరోజని నఖశిఖ పర్యంతం చూసి ఇంటర్వ్యూచేసి పెళ్ళిచూపుల అనుభూతి పొందాడు. చివరికో డైలాగ్ చెప్పించి 'స్వీట్ వాయిస్' అని మెచ్చుకున్నాడు. తన చెప్పు చేతల్లోవుంటే సినీనటిని చేస్తానని హామీ ఇచ్చాడు.

ఎంకయ్యమ్మ ఖరీదైన కోరికలకీ షరతు లకీ ఆనందరావు అంగీకరించాడు.

మొదటి రెండు నాటకాలకీ రిహార్సల్సుకి వచ్చినపుడల్లా సరోజకి ఎంకయ్యమ్మ 'ఎస్కార్ట్'గా వచ్చేది. ఆ తర్వాత దీనివల్ల తన బిజినెస్ దెబ్బతింటుందనే అభిప్రాయంతో ఆనందరావుకి సరోజ బాధ్యత అప్పజెప్పింది.

ఆనందరావు దర్శకత్వమూ, క్రమశిక్షణా ఎంకయ్యమ్మకి నచ్చాయి—కాని ఇన్ని రిహార్సల్స్‌కి తిప్పి అతనిచ్చే పారితోషికం మాత్రం నచ్చలేదు.

ఒక నాటకాని కొచ్చే సొమ్ము వయస్సులో ఉన్నప్పుడు తనో రాత్రి సంపాయించే దానిలో సగం కూడా లేదనేది.

'బ్రాకెట్టు' సంపాదన కలవాటుపడిన దానికి మేళంలో అయిదు రూపాయల తాంబూలం ఎంత తేలిగ్గా కన్పిస్తుందో అంత చులకనగా వుందీ నాటకం కిరాయి.

అయితే మొదటిసారి నాటకకళాపరిషత్‌లో సరోజ ఉత్తమనటిగా బహుమతి నందుకున్నప్పుడు ఎంకయ్యమ్మ సంతోషానికవధి లేక పోయింది.

సినిమా ఛాన్సు ఇంకెంతో దూరంలో లేదనుకొంది—వెండి కప్పుని వీధి వీధంతా తిప్పి తీసుకొచ్చింది. ఆనందరావుమీద ఆమెకి నమ్మకం, కృతజ్ఞత పెరిగిపోయాయి.

అతనుకూడా అడిగినప్పుడల్లా చేతి చమురు వదిలించుకొని ఆ యింట్లో మంచిని పెంచు కుంటున్నాడు.

సరోజ ఆనందరావు అంగీకారంతో ఇతర సమాజాల్లోకూడా వేషాలు వేస్తుంది.

సమాజాల సభ్యులుకూడా సరోజనిచూసి రకరకాల వేషాలేస్తున్నారు—

ఆమె స్పర్శకోసం 'హీరో' వేషంవేసి నాటక ప్రదర్శన ఖర్చుల నన్నిటినీ భరించే వీరేశ్వర్రావులూ

బస్సుల్లో రిక్షాల్లో ఆమె పక్కనే కూర్చోవాలని పోటీపడే 'ఇలన్' పాత్రధారులూ

రిహార్సల్సులో హీరోయిన్‌తో గంటల తరబడి కబుర్లు చెపుతూ ఆమె తమ 'సెంటు' వాసనకే లోబడి పోతుందని భ్రమపడే గేలంగాళ్ళు.

సినిమా రంగంలో మేకప్‌మేన్ మొదలు

నిర్మాతవరకు ఎవరో ఒకరు తెలుసునని, సినిమా ఛాన్సు ఇప్పిస్తానని డాబులుకొట్టే డబ్బారాయుళ్ళూ—

హీరోయిన్ మోజుపడే చిన్నచిన్న వస్తువులు కొనిపెట్టి మోతుబరుల్లా పోజుపెట్టే మోజుబరులూ—

సరోజ స్పర్శకోసం, చూపుకోసం, మాట కోసం, చిరునగవుకోసం పలవరిస్తున్నారు— కలవరిస్తున్నారు—'కల' వరిస్తున్నారు.

పిచ్చెక్కిపోతున్నారు-మత్తెక్కిపోతున్నారు సరోజ పిలుపుకోసం-వలపుకోసం

సరోజ అంటీ అంటనట్టుగా, అందీ అందనట్టుగా జనాన్ని వెర్రెక్కిస్తోంది.

రంగస్థలంమీద నటిస్తోంది జనం మధ్య నటిస్తోంది బహుమతులు అందుకొంటోంది. 'బహు'మతులు పోగొడుతోంది.

ఆనందరావు రిహార్సల్సులో సరోజతో ఎంత 'స్ట్రిక్టు'గా వుంటాడో బయట అంత 'క్లోజు'గా వుంటాడు.

సరోజ ఆ ప్రాంతంలో అగ్రనటిగా చెలామణీ అవుతున్నా ఆర్థికంగా స్థిరపడలేదు—అంచేత రేడియో, ఫాను, కుర్చీలు మొదలైన ఫర్నిచర్ ఆనందరావే కొనిపెట్టాడు.

దీంతో ఆనందరావు సరోజని ఉంచుకున్నాడనే వదంతి అన్ని సమాజాల్లోనూ పాకిపోయింది. సరోజమీద జోక్స్, వెటకారాలు ఎక్కువయ్యాయి.

ఆనందరావు ఎంకయ్యమ్మ ముందు తల వంచుకున్నాడు. 'అంతగాడు తమకోసం చేస్తున్న ఖర్చునిచూసి కరిగిపోయిన ఎంకయ్యమ్మ ఉంచుకొంటే తప్పా?' అని ఎదురు ప్రశ్న వేసింది.

ఎంకయ్యమ్మ ప్రోత్సాహం ఆనందరావు రక్తాన్ని రగిల్చింది. ఆనందరావు డబ్బు ఎంకయ్యమ్మ ఆశని రెచ్చగొట్టింది.

ఎంకయ్యమ్మ పారం సరోజని దిగ్భ్రాంతురాల్ని చేసింది. ఎదురు తిరిగింది. కాని ఎంకయ్యమ్మ మాటల్లో మంత్రం వుంది.

ఎంకయ్యమ్మ అనుకూలమైన వాతావరణాన్ని కల్పించింది. ఆ అవకాశాన్ని ఆనందరావు జారవిడుచుకోలేదు పదిహేనేళ్ళ కాలాన్ని వెనక్కి తరిమేసి సరోజని వెర్రిదాన్ని చేశాడు

ఆనందరావు సరోజని ఉంచుకున్నట్టు బహిరంగ ప్రకటన చేసెయ్యడంతో ఊహాగానాలకీ, కథలకీ కాలం చెల్లిపోయింది.

ఈ విషయం తెలిసి మొదట్లో ఆనందరావు భార్య బాధపడింది—ఆనందరావు మనస్సుని బాధపెట్టింది కాని కాలం గడిచే కొద్దీ గాయం మానిపోయింది.

ఇప్పుడు ఆనందరావు ఎక్కువగా సరోజ ఇంట్లోనే వుంటున్నాడు సరోజ ఎంతదూరం నాటకాలకి వెళ్ళినా ఎస్కార్టు ఆనందరావే.

ఒకో వసంతం గడిచిపోతున్న కొద్దీ ఎంకయ్యమ్మ ఆత్రుత పెరిగిపోతోంది. 'సరోజ ఇంకా సినీనటి కావడంలేదే' అని.

ఎంకయ్యమ్మ కిచ్చినమాట నిలుపుకోవడం కోసం ఆనందరావూ సరోజకి వేషాలకోసం శక్తివంచన లేకుండా ప్రయత్నిస్తున్నాడు.

సరోజ ఆనందరావుకి తాళికట్టని భార్యయి ఆరు సంవత్సరాలయింది. సరోజ జీవితంలో ఏదో వెలితి అసంతృప్తి అశాంతి.

సరోజకి తల్లి కావాలనే కోరిక సినిమా ఛాన్సుకంటే అదే ఎక్కువయిన వరం !

కాని తను శాపగ్రస్త. ఆనందరావు తనని ఉంచుకోడానికి ముందే ఆపరేషను చేయించుకున్నాడట తల్లికి తెలిసికూడా చెప్పలేదు. అయితే, తనింక తల్లయే అవకాశంలేదు!

ఆనందరావు ఉంచుకున్నాడని తెలిసినా సరోజ అందంకోసం ఎగబడేవాళ్ళు తెగబడే వాళ్ళు అనేకమంది ఎంత ప్రలోభపెడుతున్నా ఎంకయ్యమ్మ గురి చెదరడంలేదు.

ఇంతమందిలో మందలో ఇన్నాళ్ళకి సరోజ చూపునీ వలపునీ ఆకట్టుకున్నవాడు మధు !

మధు ఆస్తిపరుడు కాదు. అందగాడు! ఉద్యోగస్థుడుకాదు 'ఎమ్మే' చదువుతున్న విద్యార్థి! వేషంవేసే అలవాటులేదు. హీరోయిన్




దగ్గరకూడా వెకిలి వేషాలు వెయ్యడు!

అతడు ఆనందరావు సమాజానికి ఈ మధ్య కొత్తగా వచ్చిన ప్రాంప్టరు.

తూచి తూచి మాట్లాడే మధు అంటే సరోజకి గౌరవం. అతను ఆడగాలి పడని ప్రవరాఖ్యుడట! అతని నిగ్రహం ఏ నెఱజాణకయినా సవాలట!

అతను అప్పుడప్పుడు..కథలూ, కవితలూ పత్రికల్లో ప్రచురిస్తుంటాడు.

అందర్లా సరోజని ఏకవచన ప్రయోగం చెయ్యడు. ఒకటి రెండుసార్లు సరోజ పలికిస్తే మాత్రం సలహాయిచ్చాడు. సినీనటి అయితే సరోజని 'సౌందర్య' అని కాని 'స్వప్న' అని కాని పేరు మార్చుకోమన్నాడు- ఆమె అందానికా పేర్లు సరిపడతాయట!

మధు ప్రశంస సరోజ హృదయాన్ని స్పందింపజేసింది. మనస్సు 'మధు' రానుభూతులతో నిండిపోయింది.

అయితే అంత ప్రవరాఖ్యుడూ తన అందం ముందు కదిలిపోయాడన్నమాట. తనంటే ఎంత ఇష్టం లేకపోతే అలా మెచ్చుకుంటాడు?

ఆ తర్వాత అవకాశం దొరికినప్పుడల్లా సరోజ 'సౌందర్య'యై మధుని నవ్వించింది. కవ్వించింది.

'ఇనుప కచ్చడాల్ కట్టిన మునిముచ్చులెల్ల

పడుచుదనం పడగవిప్పింది. కోరికలు బుసకొట్టాయి.

ఆ తర్వాత అవకాశాల పొదరిళ్ళలో ఒదిగిపోయారు. అమృత కలశాల్ని ఆస్వాదించారు

ఇప్పుడు సరోజ వసంత కోకిలలా—పురి విప్పిన వనమయూరంలా—వెన్నెలలో చకోరంలా అందాన్ని ఆనందాన్ని దోసిలితో తాగుతోంది!

సరోజ మధుల ప్రణయం సంగతి మళ్ళీ లోకానికి పని చెప్పింది. అంతా చెవులు కొరుక్కున్నారు.

పుకారు తెలిసినా ఆనందరావు మధుని అనుమానించలేదు. ఎంకయ్యమ్మ మాత్రం సరోజని హెచ్చరించింది.

ఆ రోజు ఆనందరావు ఓ శుభవార్త మోసుకొచ్చాడు. ఆ వార్త విన్న ఎంకయ్యమ్మలో 'ఆనందం' కట్టలు తెంచుకొంది. అతని మిత్రుడు తీస్తున్న ధారీవర్ణ చిత్రంలో 'సరోజ'కి ఉప కథానాయిక వేషం ఇవ్వడానికి అంగీ

కరించాడు—వచ్చే నెలలో షూటింగు ప్రారంభ మవుతుంది.

అంత మంచివార్త విన్నా సరోజ ఎగిరి గంతెయ్యలేదు. సరోజకి నీరసంగా వుంది. అవసరంలేదని మొత్తుకుంటున్నా డాక్టర్ని తీసు కొచ్చాడు ఆనందరావు.

డాక్టరు చెప్పిన వార్త విని ఆనందరావూ, ఎంకయ్యమ్మ నిశ్చేష్టులయారు—సరోజ నెల తప్పింది!

ఆనందరావు తోక తొక్కిన త్రాచులా లేచాడు. రేచులా రెచ్చిపోయాడు. గ్రీష్మకాలపు సూర్యుడిలా నిప్పులు కక్కాడు

చాలసేపటికి తేరుకున్న ఎంకయ్యమ్మ అతన్ని శాంతింపజెయ్యడానికి విఫలయత్నం చేసింది!

సరోజ మొగం వర్షర్తు మేఘమయింది. ఆనందరావు ఎన్నిబూతులు తిట్టినా ఆమె బదులు చెప్పలేదు.

ఆనందరావు బాధపడుతున్నది సరోజ రంకుతనం చేసినందుకు కాదట. తనకు అప్రతిష్ఠ వస్తుందనట!

'అయితే పెళ్ళాం వుండగా మరొకర్ని ఉంచుకోవడం మాత్రం ప్రతిష్ఠా?' అని సరోజ అడగలేక పోయింది.

సరోజని నిజం చెప్పమని నిలదీశాడు—ఆమె మధుపేరు బయట పెట్టింది.

'ఇంత డబ్బుపోసి నిన్ను పోషిస్తున్నప్పుడు కృతజ్ఞత వుండొద్దూ! కుక్కకంటె హీనం' చెడదిట్టాడు ఆనందరావు.

'నీ పెళ్ళాం నిన్నంత డబ్బుపోసి కొనుక్కున్నప్పుడు నీకు మాత్రం కృతజ్ఞత వుందా?. నువ్వు చిత్తకార్తె కుక్కకంటె అన్యాయం కాదా? విలాసం మగాడి హక్కయితే ఆడదానికి కనీసకోరిక ఉండకూడదూ?' అని ఎదురు ప్రశ్న వెయ్యలేకపోయింది సరోజ! నీళ్ళు నమిలింది.

కోపంతో ఒళ్ళు తెలియని ఆనందరావు సరోజని చెంపపెట్టు పెట్టి నీకూ నాకూ 'చెల్ల'ని చెప్పి వెళ్ళిపోయాడు.

ఆ తర్వాత 'ఇంత తెలివి తక్కువ పీనుగ వనుకోలేదు' అని సరోజని చివాట్లుపెట్టి ఇంకా ఉక్రోషం ఆగక ఒళ్ళుహూనం చేసింది ఎంకయ్యమ్మ.

మర్నాడు సరోజ మధును కలుసుకొంది. జరిగిన సంగతి చెప్పింది. పెళ్ళి చేసుకోమని బ్రతిమలాడింది. 'నువ్వు పతితవి. నేను పేద వాడినయినా నాకు వంశం మర్యాద ఉన్నాయి' అన్నాడు.

పోనీ ఎక్కడి కయినా లేచిపోదామంది. ఆ వార్త తెలిస్తే బి. పి. రోవున్న తన తండ్రి చచ్చిపోతాడన్నాడు.

కనీసం జీవితాంతం తనని ఉంచుకోమంది. రెండు సంసారాల్ని పోషించడం తన వల్ల కాదన్నాడు. 'ఎబార్షన్' చేయించుకోవడం మంచిదని సలహా ఇచ్చాడు.

సరోజ మస్తిష్కం మొద్దుబారిపోయింది. తను మనస్ఫూర్తిగా ప్రేమించినవాడు ఇంత అవకాశవాది, పిరికివాడు అనుకోలేదు.

మధు మళ్ళీ కనిపించకుండా సరోజకి దూర మైపోయాడు.

వారం పదిరోజులకే ఆనందరావుకి మాత్రం సరోజమీద గాలి మళ్ళింది. సరోజ గర్భస్రావం చేయించుకొంటే తమ పాపసంబంధం తెగి పోదన్నాడు. ఆమె తల్లి కాకూడదనే అతని ఆంక్ష.

సరోజ వినిపించుకోలేదు, ఆనందరావుమీద పురుషజాతిమీద విరక్తి పెంచుకొంది. ఎంకయ్యమ్మచేత చెప్పించి చూశాడు అయినా ఆమె నిర్ణయం మారలేదు.

సరోజ ఆశ పుట్టబోయే 'బాబు' మీద తనకి 'బాబు' పుట్టి ఈ రొచ్చు బ్రతుకునుంచి విముక్తి కలిగించాలి. బాబుకి తల్లీ తండ్రీనే అయిపెంచుతుంది బాబు తమజాతికే మణి దీపం కావాలి.

మాతృత్వంలేని మగువకీ, పూలు పుయ్యని మొక్కకీ అర్థం అందంలేదు ఈవరంకోసమే తను సాహసించింది. అందుకే తన శరీరాన్ని

కామించిన వాళ్ళిద్దరూ దగాచేసి వెళ్ళిపోయినా తొందరపడి 'ఆత్మహత్య' లాంటి నిర్ణయం తీసుకోలేదు!

* * *

సరోజ ఆత్మహత్య చేసుకోలేదు.

ఆనందరావు మళ్ళీ యింకోరోజు పాత పాటే అందుకున్నాడు. "నువ్వు అబార్షన్ చేసుకోక తప్పదు." అన్నాడు.

తనలో పెరిగే తన 'బాబూ' తన 'ప్రాణమూ' రెండూ ఒకటే అన్నట్టు, తన ప్రాణం వదులుకోవడం ఇష్టంలేనట్టు సరోజ మొండిగా నిలబడింది.

"నువ్విట్టాగే బతికి బట్టకట్టడం చానాకష్టం" ఆనందరావు, ఎంకయ్యమ్మ కోరస్‌లాగా అన్నారు.

"ఇప్పుడు ఎంగిలికూడు తిని కడుపుతెచ్చుకున్నావు. మమ్మల్ని కాదంటే రేప్పొద్దున వీధుల్లో "

'ఛూ' సరోజ ఓర్చుకోలేక ఉమ్మేసింది. ఉమ్మి మీదబడ్డ ఆనందరావు ముఖం తెల్లబోయింది. వెంటనే సరోజ జుట్టుపట్టిలాగి నాలుగు తందామనుకున్నాడు గాని ఆమెముఖం లోని తీవ్రత్వాన్ని చూసి జంకాడు.

"మీ బెదిరింపు ఏమిటి? మిమ్మల్ని వదిలిపెడితే నా బ్రతుకు నేను బ్రతుకలేను అనేగా? మీరన్నట్టు వీధుల్లో అడుక్కుని ఎంగిలికూడు తినే బతుకుతాను. అంతేగాని ఆ కూటికోసం నా కడుపులో పెరిగే నా 'బాబు'ను మాత్రం చంపుకోను. వాడు పుట్టి పెరిగిం తర్వాతయినా నన్ను వీధుల్లోనుండి ఏదో ఇంట్లోకి తీసుకు వెళతాడు. నా ఆశ వృధాకాదు!" సరోజ ఈ మాటలు అంటూ చరచరా నడిచి అవతలికి వెళ్ళిపోయింది.

స్థాణువుల్లా నిలబడిపోయిన ఆనందరావు, ఎంకయ్యమ్మ తేరుకోవడానికి కొన్ని నిమిషాలు పట్టింది.

తేరుకున్న తర్వాత ఆనందరావు మనస్సు ఘోషిస్తూ ఇలా అనుకుంది—

"మొక్కలు రెండురకాలు—

పూలుపూసేవి—పుష్పించనివీ.

పెరట్లో అందం కోసమే క్రోటనుమొక్కలు

వాటికి పువ్వులూ కాయలూ వుండవు. ఉండకూడదు.

వాటిని నాలాంటి సౌందర్యారాధకులు యెత్తుగా యెదగనివ్వరు కూడా.

సాని బ్రతుకులుకూడా ఇంతే అనుకున్నాడు.

మరి దీని సంగతేమిటి?

ఈ క్రోటను మొక్క పూలు పూస్తాను, కాయలుకాస్తాను అంటోందేమిటి విడ్డూరంగా!"

ఆనందరావు మనస్సు ఇలా అనుకున్నదని సరోజ తెలుసుకునివుంటే, "హోరి అమాయకుడా! కాలం వెనక్కి నడవడం లేదు. అది ఎప్పుడూ ముందుకే వెళ్తుంది. సైన్సు ఎంతో పురోగమించింది. మేధావులు కష్టపడితే క్రోటన్ మొక్కలచేత పూలో కాయలో కాయిస్తారు" అని సమాధానం ఇచ్చివుండేది. □

---

(వి) చిత్ర విజ్ఞానం



## ప్రేమమందు

ఈ మందుకు చాలా పేర్లున్నాయి. అవి క్వాలూడ్, సోపార్, పారెస్ట్, ఆప్టిమిల్, సోమ్నాఫాక్!! ఇవి అమెరికాలోని ప్రతి మెడికల్ షాపులోనూ దొరుకుతాయి. ఈ మందులోని ముఖ్యమైన రసాయన పదార్థం "మెతాక్వాలోన్." ఒక విధమైన మత్తునీ,ఆనందాన్నీ కలిగిస్తుంది. ప్రేమికులు వాడితే వారి స్వర్గసుఖాలకు అంతే వుండదు. అమెరికాలోని ప్రతిస్కూలూ, ప్రతి కాలేజీ విద్యార్థీ విద్యార్థినులు దీన్ని యీ మధ్య విరివిగా వాడుతూ చదువులు మానేస్తున్నందువల్ల అమెరికన్ మెడికల్ సంఘం **(AMA)** యీ మందు వినియోగాన్ని తగ్గించడానికి తగిన చర్యలను తీసుకుంటున్నదిప్పుడు!!

# అసూర్యంపశ్య

## రుద్రభట్ల నరసింగరావు

ఒకచోట అవధానం జరుగుతోంది. ప్రశ్నలు వేస్తున్నప్పుడూ జవాబులు చెబుతున్నప్పుడూ తప్ప మిగతా అంతసేపూ చీమ చిటుక్కుమంటే వినబడేటంత నిశ్శబ్దంగావుంది.

వేసవి కాలపు రాత్రి. చల్లగావుంది. గాలికి వేదికమీది షామియానా అందంగా కదులుతోంది. పృచ్ఛకులు వేదికమీద అవధానికి ఇరుప్రక్కలా కూర్చున్నారు. ఆహూతులంతా దిగువ కూర్చున్నారు. అది ఒక కాలేజీ ఆవరణ.

పైన నక్షత్రాలుకూడా కొంచెం తొంగి చూస్తూ ఈ అవధాన కార్యక్రమాన్ని వింటున్నాయి.

అవధానం చేస్తున్నాయన ఒక కథా రచయితకూడా. పేరేదో రావుగారని వుంది.

'అసూర్యంపశ్య అన్నపేరుతో ఒక ఆధునిక కథానికని చెప్పగలరా? కథలో ఈ పేరు రాకూడదు'. అని ఒక పృచ్ఛకుడు లేచి అడిగేడు.

అప్పటికే అవధాని చేతిలో.

'1928 అక్టోబరు తొమ్మిదో తారీఖు ఏవారం అయిందో సెలవీయండి.'

'అమ్మనుగూడి ఆనందించె నమ్మను జేంద్ర నందనుండు—అన్న సమస్యని పూరించండి'

లాటివేవో ఉన్నాయి.

ఆయన వేళ్ళు లెక్కపెట్టుకుంటూ, రెండో వారి వైపు తిరిగి సింహపు పిల్లతో ఆడుకుంటున్న భరతుణ్ణి శకుంతల కేకేస్తే అతను తల్లి దగ్గిరకి రావడపు వృత్తాంతం చెబుతున్నానని పరిచయం చేసేడు. మరొకరివైపూ మరొకరి వైపూ చూసి మరేవో చెబుతున్నాడు.

మొదటి అతనికి ఏదో వారం పేరుచెప్పేడు. ఆయన ఒప్పుకున్నాడు తప్పు ఒప్పుకున్నవాడిలాగ.

అసూర్యంపశ్య అవధాని బుర్రలో తయారవుతోంది.

ఇంకొకతను 'ఆధునిక కథ గురించి మీ అభిప్రాయాన్ని రుచ్యంగా మూడు ముక్కల్లో చెబుతారా?' అని అడిగేడు రావుగారుపలూపేడు.

* * *

'మీరడిగిన కథానిక చెబుతున్నాను వినండి' అన్నాడు కొంతసేపటికి. ఒకతను మైకులో చెప్పేడు.

* * *

ఆ అమ్మాయిపేరు నర్మద. ఇరవయి నాలుగేళ్ళుంటాయి. ఇంకా వివాహం కాలేదు. నర్మద అన్నది ఉత్తరాది వాళ్ళపేరు.

ఆమె తండ్రి తెలుగువాడే కాని తెలుగు రాదతనికి. ఎప్పుడో ఆయన తల్లిదండ్రులు నాగపూరులో స్థిరపడడంవల్ల ఆయన చిన్నప్పట్నుంచీ హిందీలోనే మాట్లాడడం నేర్చుకున్నాడు. ఇప్పటికీ బంధువుల నెవరినయినా సంబోధించి బాగున్నారా అని అడగడం తప్ప

ఆయనకి మరో ముక్క రాదు. ఇలా ఎక్కడో జరుగుతుంది.

ఆయన నాగపూరులో కాస్త గొప్ప స్థితి లోనే ఉన్నాడు.

ఆయనకి ఆంధ్రలో బంధువులు ఎందరో ఉన్నారు. వారిలో ఒక మేనమామ కొడుకు పరిస్థితులు అంతగా బాగులేనివాడు. అతను నర్మద తండ్రికి కష్టసుఖాలు రాసుకుని ఎప్పుడైనా సహాయం పొందుతూ ఉండేవాడు. ఎన్నోసార్లు కాదులెండి. ఇరవయ్యారేళ్ళలో రెండుసార్లు.

ఇలా వుండగా అతను పోయేడు. అతను బతికినది నలభై నాలుగేళ్ళు.

అతను పోయిన కబురు నర్మద తండ్రికి తెలియదు.

పోయిన నాలుగేళ్ళకి అతని ఆఫీసు చిరునామాకి అతని పేర ఒక ఉత్తరం వొస్తుంది. ఇన్‌లాండ్ కవరు.

ఉత్తరం అంతా చక్కని ఇంగ్లీషులో మంచి దస్తూరీలో టైపుచేసినట్టువుంది. అడుగున తనకి వరసకి చెల్లెలయే ఆ మేనమామ కొడుకు భార్య సంతకం—లేక ఈమె తెలుగులో తీరుబడిగా రాసుకున్న పేరువుంది. దానికింద మళ్ళీ ఆవిడి పేరు ఇంగ్లీషులో వుంది.

లేఖకుడెవరోగాని దేవుడులాటివాడు. ఆవిడ చెప్పుకొన్నదంతా శ్రద్ధగా విని మరింత శ్రద్ధగా రాసేడు.

ఆ ఉత్తరానికి జవాబు రాయమని కూతురి కిచ్చేడు ఆయన.

నర్మద ఆ ఉత్తరాన్ని చదివింది. మనం రచయితల లేఖలని చదివేటట్టు మళ్ళీ మళ్ళీ చదివింది. సాహితీపరుల అమెరికన్ ఇంగ్లీ



షగా అందులోని భాషని గుర్తించింది.

అమెరికన్ ఇంగ్లీషు రాసే వాళ్ళకి హృదయం సున్నితమైనది అయివుంటుంది. అత్మనిబద్ధ శైలి అన్నమాటలో నిజంవుంటే సుతిమెత్తని అమెరికన్ ఇంగ్లీషు రాసే వ్యక్తి అతిమెత్తని మనసున్న వాడనడంలో సందేహంలేదు. లలిత సంగీతాన్ని ఇష్టపడినట్టే, సలిల్ చౌదరి, రాజేశ్వరరావు, ఆశాలతలని అభిమానించినట్టే, అమెరికన్ ఇంగ్లీషుని మనం ప్రేమిస్తాం.

ఇలాటి ఊహలతో వున్న నర్మద చదివింది ఆ ఉత్తరాన్ని.

అది టి.బి. హాస్పిటల్ సర్జికల్ వార్డునించి వొచ్చింది. అక్కడ ఈ అత్తయ్యకి ఎవరు దొరుకుతారు చెప్మా? ఏ సర్జనో అసిస్టెంటు సర్జనో రాసేడనుకుంది. వాళ్ళకి మాట వినడానికే తీరుబడి వుండదని తెలియని పసితనం ఆ అమ్మాయికి. అదీగాక గొప్పగా చదువుకున్న వాళ్ళని రోగులుగా. ఆసుపత్రులలో మకాంచేసిన వారిలా ఊహించడం ఎవరికయినా కష్టమైన సంగతి, ఇహ ఆ పిల్లకయితే ఆ ఉత్తరం ఒక రోగి రాసివుండవొచ్చునని తోచనేలేదు.

ఉత్తరాన్ని హిందీలో ఊహించుకుంటే అత్తయ్య తెలుగులో ఇలా చెప్పుకున్నట్టు వుంది.

'పూజ్యులయిన అన్నగారికి అనేక నమస్కారాలు.

. మీ మామయ్య కొడుకు స్వర్గస్థులయేరని మీకు తెలియజెయ్యలేకపోయేను. అప్పట్లో మీకు రాసేవాళ్ళు దొరకక అలా జరిగిపోయింది

'ఆ విధంగా దిక్కుమాలిన దాన్నిగా బతుకుతున్నప్పటికీ ఎలాగో ధైర్యం తెచ్చుకుని గడుపుతూండే దాన్ని. కాని పిల్ల దానికి క్షయ అంకురించేటప్పటికి నా ఆశలన్నీ అడియాసలయేయి. ఏవో మందు లిప్పించేం. కాని తగ్గలేదు. ఇక్కడికి తీసుకొస్తే పెద్దాపరేషను చేస్తేగాని నయం కాదని డాక్టరుగారు చెప్పేరు. ఆయన ధర్మాత్ముడు. ఆ ఆపరేషను చేస్తానని చెప్పి చేర్చుకున్నారు. పెళ్ళిచేసి పంపించవలసిన పిల్లని సర్జికల్ వార్డులో చేర్పించవలసి వొచ్చింది. ఆ వొచ్చే అల్లుడు కాస్త మంచివాడైతే అతని నీడని నా జీవితం వెళ్ళిపోదా అనుకున్నాను. అంత యోగ్యతకూడానా నాకు? అయినా వీటన్నిటికీకాదు. ఇంకా పిల్లకి బలం రావాలిట, వాళ్ళ ఇచ్చేవి ఇస్తూనేవున్నా అని ఏ మూలకీ చాలవు. మరిన్ని పాలూ పళ్ళూ పడాలి. నా దగ్గిర డబ్బేదీ ఈ పిల్లకి తోడు నేనుకూడా ఐసుపత్రిలో వుండడం.. ఖర్చు...?

*  *  *

అయ్యా ఆధునిక కథమీద నా అభిప్రాయాన్ని రుచ్యంగా చెప్పమన్నవారు అవధరించండి.

అది బిరాణీల లాటిదైనా కావొచ్చు. సమీకృతాహారం లాటిదైనా కావొచ్చు, విందు భోజనం కూడా కావొచ్చు,

మళ్ళీ మన కథకి వొస్తున్నాం.

*  *  *

ఆ ఉత్తరానికి తండ్రి రాసినట్టు జవాబు రాసి తండ్రి ఇచ్చిన వంద రూపాయలూ మనిఆర్డరు చేసింది నర్మద. తండ్రి రాసినట్టు ఉత్తరం రాయడం ఆ అమ్మాయికి కొంచెం కష్టం అయింది. మేం ముగ్గురం పిల్లలం అని రాసి కొట్టేసి నాకు ముగ్గురు సంతానం పెద్దది ఆడపిల్ల కడను ఇద్దరూ మొగపిల్లలు .అంటూ అలా చక్కగా కుదిర్చింది చివరికి.

*  *  *

ఇక్కడ అవధాని కొంచెం ఆలోచిస్తున్నట్టూ పృచ్ఛకులు ఏమైనా అడగ దలుచుకుంటే తను సావధానంగా ఉన్నట్టూ నలుగురి వైపు చూసేడు.

'విందు భోజనానికి ఒక ఉదాహరణ రచయిత పేరుతో సహా కావాలండి.' అన్నాడు ఒకతను.

'యజ్ఞం — శ్రీ కాళీపట్నపు రామారావు గారు' అని అప్పటికప్పుడే జవాబిచ్చేడు రావుగారు.




మరొకతను లేచి 'యజ్ఞం చేసినంత పనయింది అన్న నుడికారాన్ని సాహితీపరులంటే అభిమానం ఉన్న నాబోటివాడు యజ్ఞం రాసినంత పనయింది అని మారిస్తే మీరు సమర్థిస్తారా రావుగారూ? కథకులుగా మీ అనుభవం ఏమిటండి?' అని అడిగేడు.

'సమర్థించడానికేంగాని మీ ప్రశ్నని ఈసారి నేను శ్రీ కాళీపట్నపు వారిని కలుసుకున్నప్పుడు ఆయనకే నివేదించి జవాబివ్వమని అ--ర్థి--స్తా--ను.' అన్నాడాయన దాటేసి కథలోకివొస్తూ.

* * *

మరొక ఉత్తరం వొచ్చింది. కేవలం కృతజ్ఞత తెలియ జెయ్యడానికి ఆ బీదరాలు రాయించినది అది.

మళ్ళీ మరికొంత సొమ్ము పంపించేడు నర్మద తండ్రి.

ఈ జబ్బుకి సర్జికల్ వార్డులో చాలా కాలం ఉంచుతారు. ఆడవాళ్ళ విషయంలో మరింత వ్యవధి ఇస్తారు. వాళ్ళకి ఈ ఆపరేషనంటే తగని భయం. ఈ వార్డులలో రోగులు క్షేమ ప్రాంతంలో ప్రజలలా, యుద్ధం చెలరేగుతున్నప్పటి ప్రజలలా భయంతో రోజులు గడుపుతారు.

ఆయా సంగతులన్నీ నర్మదకి తెలుస్తూ ఉండేవి. ఆమె తండ్రి చూపించిన దయనిబట్టి ప్రతీ సంగతీ ఆయనకి తెలియ జెయ్యడం తన అవసరం కన్న ఎక్కువగా విధి అనుకున్నంత శ్రద్ధగా ఉత్తరాలు రాయించింది ఆ అత్తయ్య.

ఇలా కొంతకాలం జరిగింది. ఎనిమిది నెలలు. అప్పుడు ఎంచేతో ఒకసారి ఉత్తరం రావడం కొంచెం ఆలస్యం అయితే నర్మద కంగారు పడింది. తండ్రికూడా కూతురు మీద ఉన్న అభిమానం కొద్దీ ఆతృతపడ్డాడు.

* * *

సభ్యులలో ఒకరు 'అడ్డొస్తున్నాను మన్నించండి. మీ కథలలో ఏదైనా ఇజంలాటిది ఉందా? వుంటే దానికి మీరు పెట్టే ప్రత్యేకమైన పేరేదయినా వుందా?' అన్నాడు.

అవధాని సంతోషిస్తూ నవ్వేడు.

'వస్తా. బజారులో రావలసిన చోటుకి వొచ్చేక కారుని ఎక్కడ నిలబెట్టాలో డ్రైవరు చూసుకోవలసి వున్నట్టు మనం కూడా ఈ కథని ఎక్కడ ఆపాలో చూసుకోవాలి. కొంచెం ముందుకి వెళ్ళనియ్యండి.

* * *

అవిడకి ఈసారి ఉత్తరం రాకుండానే డబ్బు పంపించెయ్యమన్నాడు నర్మద తండ్రి. 'కావలిస్తే నువ్వేరాయి.' అన్నాడు.

డబ్బు మాత్రం పంపించి పోనీ చూద్దాం అని వూరుకుని ఎదురు చూడసాగింది నర్మద.

కొన్నాళ్ళకి ఉత్తరం వొచ్చింది. ఈసారి ఒకటి కాదు; ఒకటే కవరులో రెండున్నాయి ఉత్తరాలు. రెండోది ప్రియమైన అయ్యాతో మొదలయి కె. సూర్యం అన్న సంతకంతో పూర్తయింది.

* * *

'ఆఁ. అయ్యా నా కథలలో వాస్తవికత ఉంటుంది. అది ముఖ్యంగా మనస్తత్వాలకి సంబంధించినది. వాటి విషయంలో మనిషిగా ఎంతో స్పందించి రాస్తాను.

'ఇలాటి దాన్ని నేను **Humanitarian Psychological Realism** అనదలిచేను. శరత్‌బాబులో ఉన్నది కూడా ఇదేనని నాకనిపిస్తుంది.

సభ్యులంతా ఆయనతో పూర్తిగా ఏకీభవిస్తున్నట్టు తలలు ఊపుతూ చిరునవ్వులు నవ్వేరు,

మళ్ళీ మన అసూర్యంపశ్యకి వొస్తున్నాను.

* * *

రెండో ఉత్తరంలో ఇలావుంది.

'నేను మీకు ఈ ఎనిమిది నెలల కాలంగా ఉత్తరాలు రాస్తున్నప్పటికీ ఎప్పుడూ పరిచయం చేసుకోలేదు. అవసరంలేదు కదా అని వూరుకున్నాను. మరొకలా భావించరు గదా,

'నేను పురుషుల సర్జికల్ వార్డులో ఒక రోగిని. నేనిక్కడ అనేక మందికి లేఖరిని. అంచేత మీ చెల్లెలిగారికి సులభంగా పరిచయం అయేను. ఆవిడ కోరినట్టు మీకు రాసేను. మీరు ఆవిడపట్ల చూపించిన అభిమానం చూసి మళ్ళీ మళ్ళీ ఆవిడ కోరినప్పుడల్లా రాసేను. నేను పడే స్వల్పశ్రమవల్ల ఆవిడకి ఎంతో ఉపకారం జరుగుతూ వుంటే అది మీరు ఈ అజ్ఞాత వ్యక్తిపట్ల చూపించే దయగా కూడా భావించుకున్నాను.

'నా గురించి ఇంతకన్న రాయడం అప్రస్తుతం అవుతుంది.

'మీ మేనగోడలికి త్వరలో ఆపరేషన్ చేస్తారనీ ఈ లోపున మీకు వీలయితే ఒకసారి రావలసిందనీ, మీరే స్వయంగా రాలేకపోతే మీ అమ్మాయినిగాని అబ్బాయినిగాని పంపించ వలసిందనీ కోరుతూ దీనితో జతచేసిన జాబులో వివరంగా రాసేను గదా.

'నాకు ఆపరేషన్ అయిపోయింది. త్వరలో అంటే సుమారు పదిరోజుల్లో ఇంటికి పంపిం చేస్తారు. నేనుండగా మీకొస్తే మాట్లాడు కోవ డానికి ఇబ్బంది వుండదు. ఒకవేళ నేను లేక పోతే నర్సు లెవరయినా ద్విభాషిగా వ్యవహ రించగలరుగాని నేనున్నప్పుడయితే బాగుండు నని మీవారి ఆశ. ఈ కోరికనే మరీమరీ చెబుతూ మీకు పదివేల నమస్కారాలని చెప్ప మన్నారు, ఆ అమ్మాయీ తల్లీ ఇద్దరూ.'

ఈ ఉత్తరం చదివేటప్పటికి నర్మదకి కళ్ళంట నీళ్ళొచ్చేయి. తన అత్తా కూతురూ తమని ఎవరినో చూడాలని అవస్థ పడుతున్నం దుకు జాలివేసే తను ఏ డాక్టరో అనుకున్న వ్యక్తి చివరికి పాపం ఒక రోగి కదా అని బాధ కలిగి.

అయితే ఎందుకింతలా రాసేరో అర్థం కాలేదు నర్మదకి.

తండ్రి చెప్పేడు. 'పెద్ద ఆపరేషను కదా అమ్మాయి. ఇటో అటో చెప్పడం కష్టం, ఇన్నాళ్ళూ ఏదో కాస్త సాయం చేశామూ ఇలా టప్పుడు మన్నెవరినో చూడకపోతే బెంగగా ఉంటుంది. నాకు తీరికలేదు. ఆలోచిస్తున్నాను.'

అంతలో వాళ్ళకి ఏవో అవాంతరాలు వొచ్చేయి. చివరికి పదిహేను రోజుల తర్వాత నర్మదని పంపుదాం అని నిశ్చయించుకున్నారు.

ఆమె కొంత డబ్బూ బట్టలూ కంది పొడి లాటివీ తీసుకుని పెద్దరికంలోని సంతోషంతో బయలుదేరి వొచ్చింది.

ఒక నర్సు ఆ బంధువులని చూపించింది.

'అత్తయ్యా బాగున్నారా?' అని అడిగింది నర్మద తెలుగులో.

'ఇక్కడ సూర్యం అనే ఆయన ఉండాలి?' అంది నర్సుతో.

నర్సు కలుపుగోలుగా నవ్వింది. 'ఆయనా? ఆయనగారికి నయం అయిపోయింది. డిశ్చార్జి చేసేశారు, అందరికీ ఆయనే కావాలి. ఆయన వెళ్ళిం దగ్గిర్నుంచీ మా పని పెరిగిపోయింది. పాపం చాలా మంచివాడు' అంది

* * *

అవధాని రావు ఆగేడు.

కథ అయిపోయిందని ధాటిగా ఒక సభ్యుడు మిగతా వారితో అన్నాడు.

వేదికమీద అందరికీ కూల్ డ్రింకులు వొచ్చేయి.

అవధానం అయిపోలేదని ఒకతను మైకులో చెప్పేడు.

అవి తాగిన తర్వాత ఎవరో ఇంతవరకూ ఏమీ అడగనివారు "మన అసూర్యంపశ్య మీరు చెప్పిన దుచ్య పదార్థాలలో ఏ కోవకి చెందు తుందండీ?" అని అడిగేరు.

'ప్లేట్ మీల్‌గా భావించండి. నాకు అదంటే అదో రకమైన ఇష్టం.' అన్నాడు రావు గడుసు తనంగా.

నవ్వులు.

అంతలో ఎవరో అమితాబ్‌బచ్చన్ మీద నిరోష్ఠ్యంగా పద్యం చెప్పమన్నారు.

ఆయన చెప్పినది రాయడం నావల్ల కాదు.

అవధానం అలా కొనసాగుతూండగానే, మన కథగారు కంచికి వెళ్ళవలసిన ప్లేను బయలుదేరే టైమయింది. □

---

ఇన్కంటాక్సు ఆఫీసరు :—"మీ వద్దనున్న 'ఇమ్మూవబుల్ ప్రాపర్టీ' ఏమిటీ?"

ఖాతాదారుడు :—"అహా పోయిన దీపావళికి వచ్చి మా యింట్లోనే తిష్టవేసుక్కూచున్న అల్లుడు!"

* * *

"మా మేనేజరు గొప్ప అదృష్టవంతుడు!"

"ఎలా?"

"అతని పెళ్ళాం పేరు కమల, ఆఫీసులో అతని సెక్రటరీ పేరూ కమల! అంచేత నిద్రలో ఏం గొణిగినా ఫర్వాలేదు!"

—ఆర్. శివరాజన్

జ్యోతి కథల పోటీలో ప్రత్యేక ప్రశంసపొందిన కథ!

వి. రాజారామమోహనరావు

# ఆడమనసు

చెట్ల ఆకులు చివరివరకు నెమ్మదిగా నడచి గబుక్కుని కిందకి దూకుతున్నాయి వర్షం చినుకులు. సాయంత్రం మరీ పూర్తిగా చీకటయిపోలేదు. వరండా చివరి దాకా వచ్చి తలెత్తి ఆకాశాన్ని చూసింది సావిత్రి.

మబ్బుల్ని చూస్తూ "రాత్రికి బాగా వానొస్తుందన్నమాట." అనుకుంది. లోపల గదిలోకొచ్చి కిటికీ దగ్గర నిలబడింది.

మబ్బుపట్టి మసకమసగ్గా వుండే సాయంత్రాలన్నా, వర్షం కురిసే రాత్రులన్నా చిరాగ్గా వుంటోంది ముప్ఫయి రెండేళ్ళ సావిత్రికి. ఇదే కాదు ఏ విషయంలో చిరాకు కలిగినా దాన్నించి తప్పించుకోవాలని, ఏదో రకంగా జీవితాన్ని అందంగా, ఆనందంగా మార్చుకోవాలని తెగ తాపత్రయ పడుతోంది.

చీకటి మింగేస్తున్న సాయంత్రంలోనూ. మబ్బులుపట్టి ముంచుకొస్తున్న వర్షానికి తల లొంచుకుని నెమ్మదిగా అటూ ఇటూ వూగుతున్న చెట్లలోనూ ఎంత ప్రయత్నించినా ఏ అందం, ఆనందం కన్పించలేదు సావిత్రికి.

చినుకులకి గాలి తోడయింది. కిటికీ వేసేద్దామా అనుకుంది. కానీ అంత తొందరగా తలుపులు మూసేసుకుని, ఆ వంటరి ఇంట్లో తనని తను అప్పుడే బంధించుకోవాలనిపించ లేదు.

తిరిగి వీధివేపువచ్చి గుమ్మం దగ్గర కూర్చుంది. ఆ వీధి అసలే చిన్నది. అందులో వూరికి ఓ మూలగావుంది. వీధిలో ఇళ్ళన్నీ ఒకవేపే వున్నాయి. ఎదురుగా చెట్టూచేమా తప్ప ఇంకేంలేవు. కాసేపు వాటినే చూసింది, చూసిచూసి కాస్త మనుషులు తిరిగే వీధయినా బాగుణ్ణు అనుకుంది.

కొన్నాళ్ళ క్రితంవరకు ఎవరైనా తన ఇంటికి వచ్చారంటే భయపడేది సావిత్రి. వాళ్ళుతీసే ఆరాలు, ఎదుటి వాళ్ళను బాధపెట్టడానికే పని కొచ్చేవాళ్ళ ప్రశ్నలు, వెటకారాలు చాలా ఇబ్బందిగా వుండేవి.

నాలుగైదేళ్ళగా ఎవరొచ్చి ఏదడిగినా ఒకేలా వుంటోంది సావిత్రికి. వాళ్ళడిగేవి అలాగే వుంటున్నాయి.

'మీ ఆయన ఎక్కడున్నాడు? ఏం చేస్తున్నాడు? ఎప్పుడొస్తారు? ఒంటరిగా ఒక్కదానివి ఈ పల్లెటూళ్లో, ఈ వంతులమ్మ ఉద్యోగం చెయ్యకపోతేనేం? మీ వాళ్లెవరూలేరా?''

కొత్తలో చాలాచోట్ల నిజం చెప్పింది. భర్త తనను వదిలేశాడనీ—తనకెవరూలేరనీ అందువల్లే ఇలా వంటరిగా ఉద్యోగం చేసుకుంటున్నాననీ కానీ దానివల్ల ప్రయోజనం కన్న ఇబ్బందులే ఎక్కువయ్యాయి.

మొగుడిని వదిలేసి వంటరిగా కులుకుతోందని కొందరు.. వంటరిగా వున్న ఆడదానివి నిన్నుద్ధరిస్తాం మాతో కులకమని కొందరూ ఇలా రకరకాల మనుషులు పీక్కు తింటం ఎక్కువయింది.

అందుకే ఈ ఊరువస్తూనే కొన్ని అందమైన అబద్ధాలు కూడా తెచ్చుకుంది. ముఖానికీ, మనసుకీ, మాటతీరుకీ కొన్ని నకిలీ రంగుల్ని పూసుకొచ్చింది.

ఇదివరకటి ఊళ్ళల్లోకన్నా ఈ ఊళ్ళో బతుకు కొంచెం బాగుంది సావిత్రికి. భర్త విదేశాల్లో ఉన్నాడనీ, తనకు చాలామంది బంధువులున్నా పల్లెటూళ్ళమీదా, పసిపిల్లకి చదువు చెప్పటం మీదున్న ఇష్టంవల్ల ఇలా ఉద్యోగం చేస్తున్నానని చెపుతూ వచ్చింది. తనని గురించి అడిగిన వాళ్ళందరికీ—రకరకాల వివరాలతో పై అబద్ధాన్ని నవ్వుతూ, అందంగా, విసుగు లేకుండా చెప్పటం అలవాటు చేసుకుంది.

దానితో కొన్ని విషయాల్లో నిజంకన్నా అబద్ధాలకే జనం ఎక్కువ విలువిస్తారనీ, పరోక్షంగా వాటిని ప్రోత్సహిస్తారనే తెలిసింది సావిత్రికి.

అబద్ధాలవల్లయినా తన చుట్టూ వాతావరణంలో మార్పువచ్చేటప్పటికి ధైర్యం వచ్చింది సావిత్రికి. ఆ సమానం ఏదో నరకంలో ఏడిపించుకు తినే హెడ్మాస్టరుని డబ్బు, పలుకుబడి గల పల్లె ప్రముఖులు పన్నే వుచ్చుల్ని ధైర్యంగా ఎదిరించ గలుగుతోంది. నిజానికి, ఈ ఉద్యోగమే తన జీవనాధారమైనా, ఉద్యోగమంటే లెక్కలేనట్టు. ఆ ఊర్నుంచి బదిలీ చేస్తే సరదాగా మరో కొత్త ఊరు చూస్తానన్నట్టు ప్రవర్తించటంతో బయటి ఇబ్బందులు చాలావరకు తగ్గాయి.

ఇప్పుడు మనుషులన్నా, ఎవరితోనైనా మాట్లాడాలన్నా చాలావరకు భయం తగ్గింది. అయినా ముభావంగా ఉండే అలవాటుపోలేదు. ఎదుటి వాళ్ళగురించి ఎక్కువ పట్టించుకోకూడదన్న ధోరణి పోలేదు.

ఈ వొంటరి తనంలో ఈ వర్షపు చీకట్లో ఆప్యాయంగా చేరువగా కబుర్లు చేప్పే మనిషి ఎవరన్నా వస్తే బావుండు ననిపించింది సావిత్రికి, ఎవరూ రారని తెలుసు. అయినా ఆ నిజం వొప్పుకుని మనసుని మరింత బాధపెట్టుకోవాలనిపించలేదు. ఇలాగే చాలా నిజాల్ని దూరంగా తోసేస్తూ, అబద్ధాలకి దగ్గిరవుతూ మొండిగా గడుపుతున్నా కొన్ని కొన్ని సావిత్రిని మామూలుగా వుండనివ్వటంలేదు.

సూర్యోదయంలో పూర్తిగా విచ్చుకొని కని

# రచయితను గురించి



పుట్టింది 1946 లో.

ఇప్పటికి పందపైగా కథలు నాలుగు నవలలు వివిధ పత్రికలలో అచ్చు అయ్యాయి. 'వరద' కథల సంపుటిని ఎమెస్కోవారు వెలువరించాయి. కన్నడ, హిందీ, తమిళ, మళయాళ భాషల్లోకి పది పైగా కథలు అనువాదం అయ్యాయి. 1977 స్వాతి కథల పోటీలో రెండవ బహుమతి. నవభారత్ బుక్ హౌస్ వారి నవలా ప్రియదర్శిని బేలట్ పోటీలో 'కొత్త చిగురు' నవలకి బహుమతి, 'జ్యోతి' ప్రత్యేక పారితోషికాల పథకంలో మూడవ బహుమతి వచ్చాయి.

తెలుగులో సాహిత్యానికి వ్యాపారపు రంగు ఎక్కువైపోతున్న సమయంలో "జ్యోతి" కొత్తకొత్త పథకాలతో మంచి కథలకోసం చేస్తున్న కృషికి సంతోషం.

—వి. రాజారామమోహనరావు

పించే పువ్వుల్ని చూసినా, పకపకలాడే పసి పిల్లల్ని చూసినా, దగ్గరగావుండే పక్షుల్ని చూసినా, మంచుకురిసే పుదయాన్ని చూసినా, సావిత్రి మనసు మామూలుగా వుండటంలేదు. దుడుకు వూహలు, పిచ్చి ఆశలు మేమూ వున్నామంటున్నాయి మనసులోంచి.

ఎవరైనా సావిత్రి అనటానికి బదులు 'సావిత్రమ్మా' అని పిలిస్తే వయసు గుర్తొస్తోంది. వొంటరిగా జీవితం ఇంక ఇంతేనా అనిపిస్తోంది. కూచున్న చోటుని, బయటి వాతావరణాన్ని, ఇంటిని చూస్తుంటే సరిగ్గా సావిత్రికి ఇప్పుడలాగే అన్పించింది.

వొదిలేసిన భర్త తిరిగి తన జీవితంలోకి వస్తాడన్న ఆశ చాలా తక్కువే. ఇంకే ఇతర బాధ్యతలు ఎలాగాలేవు పూనుకుని తన జీవితానికి ఏదో దారిచూసే పెద్ద దిక్కులేదు, ఇంకేదేనా చేస్తే తనే చేయాలి.

ఏదేనా చేయాలనే ఉద్దేశ్యం ఆలోచనల్లోనే వుండిపోతోంది. చేతలవరకూ రావటంలేదు. మనసుని నొక్కిపెడుతూ ఏమిటో తెలియని బరువు ఆ బరువునించి బయటపడి స్వేచ్ఛగా వూపిరి పీల్చాలని వుంది సావిత్రికి.

గుమ్మంలో అంత విశాలంగా కూర్చున్నా, చల్లటి గాలేస్తున్నా .ఏదో ఇరుకుగా వున్నట్టు, వూపిరాడకుండా వుక్కిరి బిక్కిరిగా వున్నట్టు అనిపించింది సావిత్రికి. ఇంక అక్కడ కూచోవాలనిపించలేదు.

లేచి వీధి తలుపు వేసేసి వెనక్కి తిరిగింది. ఇల్లంతా ఏదో అడవిలో వుండే గుహలా కనపడింది. కిటికీవేపు తిరిగి మడత మంచంమీద వోరగా పడుకుంది.

బయట పెరిగిన వర్షం చప్పుడు తెలుస్తూనే వుంది.

అలా పడుకుంటే .చిన్నతనంలో చేతులు బార్లా చాపి వర్షంలో తడిసిన రోజులు పెళ్ళయిన కొత్తల్లో భర్తతో కలిసి గడిపిన కొన్ని చలి రాత్రుళ్ళూ . ఒకొక్కటే పాత జీవితపు జ్ఞాపకాలు రావటం మొదలెట్టాయి.

అదొక రకం మత్తని తెలుసు సావిత్రి జ్ఞాపకాల రూపంలో ఆ మత్తు అలా నెమ్మదిగా మెదడంతా పాకి, బలపడి తల దిమ్మెక్కేలా చేస్తుంది. అర్థంకాని దిగులు, నిరాశ, నిరుత్సాహంలోకి అదో విచిత్ర ప్రయాణం.

చాలా సేపు అలాగే మత్తుగా పడుకుని, సావిత్రి తిరిగి లేచేటప్పటికి వర్షం మరింత పెరిగింది. రాత్రి మరింత ముందుకు నడిచింది.

టైము పదవుతుండటం చూసి 'ఇంక అన్నం తినేసి పడుకుంటే సరి' అనుకుంది.

ఆకలిగా లేకపోయినా, అన్నం తినాలని అంతగా అనిపించకపోయినా, నెమ్మదిగాలేచి వంటింటి వేపు నడిచింది. కంచం, గిన్నెలు.. పీట పక్కనే వున్నాయి. పీట కొంచెం వెనక్కి లాక్కుని కూచుంది. కంచంతో అన్నం పెట్టుకోబోతుంటే చప్పుడయింది. రెండో సారిగ్గానీ వీధి తలుపు చప్పుడని నిర్ధారణ చేసుకోలేక పోయింది. సావిత్రి వెళ్ళి తలుపు తీసేలోపల మరో రెండుసార్లు విని పడింది తలుపు చప్పుడు.

తడిసిపోయి నీటి ముద్దలా వున్నాడు. గుమ్మంలో మనిషి తలుపు తీసిన సావిత్రిని చూసి మాట రానట్టు అలానేవుండి పోయాడు.

కాసేపు చూసి సావిత్రే అడిగింది "ఎవరు కావాలండీ?" అని.

ఒకసారి తల తిప్పి వీధిని, ఇంటి వరండానీ పరికించి చూశాడాయన. చూసి "భూషణం లేడాండీ?" అన్నాడు.

"ఏ భూషణం అండీ?" అంది సావిత్రి అర్థంకాక.

"ఇక్కడ జిల్లా పరిషత్తు స్కూల్లో లెక్కల టీచరు నాగభూషణం" అన్నాడాయన కొంచెం తడబడుతూ.

"ఎవరూ లేరండీ! నేను ఒక్కదాన్నే వుంటున్నాను." అందామనుకుంది సావిత్రి.

కురుస్తున్న వర్షంలోంచి పొడి స్థలంలోకి రానటం వల్లేమో గుమ్మంలో ఆయన వణుకుతున్నాడు. దవడలు కొట్టుకుంటున్నాయి.

ఆయన్ని ఆ స్థితిలో చూసి "ముందు లోప



లికి రండి." అంది రెండడుగులు లోపలికి వేస్తూ సావిత్రి.

"అబ్బే పర్వాలేదండీ భూష ణ " అన్నాడాయన తిరిగి.

తనకు ముందు ఆ యింట్లో భూషణం అన్నాయన వుండేవాడని' ఆయన ఖాళీచేసిన వారం రోజులకే తను ఈ వూరు రావటం, ఈ ఇంట్లో దిగటం గుర్తొచ్చింది సావిత్రికి:

గుమ్మంలో ఆయనింకా లోప లికి రాకపోవటం చూసి "ముందు లోపలికి రండి చలి." అంది సావిత్రి తిరిగి.

ఆయన లోపలికొచ్చి గుమ్మం పక్కగా నిలబడ్డాడు! సావిత్రి దండెంమీంచి తువ్వాలు తీసిచ్చింది ముందు తుడుచుకోమన్నట్టు చూస్తూ.

తువ్వాలందుపని తల తుడుచు కుంటూ, గది నాలుగు వేపులా అయోమయంగా చూసా డాయన భూషణం కోసం వెతుకు తున్నట్టు.

"భూషణం గారికి ఈ వూరునించి ట్రాన్స ఫరయిందండీ. ఆయ నెళ్ళాకే నే నీ ఇంట్లోకి వచ్చాను. ఆయన్ని నేను ఎరగక పోవటం వల్ల మీరు అడిగిన వెంటనే గుర్తురాలేదు" అంది సావిత్రి.

"ట్రాన్సఫరయి వెళ్ళిపోయాడా?" అన్నా డాయన ఆశ్చర్యంగా తుడుచుకుంటున్న తువ్వాల్ని ముఖం మీంచి తీస్తూ.

అవునన్నట్టు తలూపింది సావిత్రి.

"ఎ వూరు బదిలీ అయిందో తెలుసా?" అన్నాడాయన.

తెలియదని, తెల్లారి స్కూల్లో అడిగితే తెలియచ్చని చెప్పింది సావిత్రి.

తువ్వాలు తిరిగి యిస్తుంటే చూసిందాయన ముఖం సావిత్రి. కొద్దిగా గడ్డం మాసింది. ముప్ఫయి అయిదు. నలభై వుంటుంది వయసు అనుకుంది? సహజంగా ఆ వయసులో వుండాల్సినంత వెలుగు, మెరుపు ఆ ముఖంలో కన్పించలేదు సావిత్రికి. ఏదో దిగులు ఆవ రించు కున్నట్టున్నాయి ఆయన ముఖం, కళ్లు.

తన మానసిక పరిస్థితినిబట్టి కేవలం అది తన వూహేమో అనుకుంది. లేదా ఆయన ఆ వూరు వచ్చిన పని అవక తవకగా తయార యినందుకు అలా వున్నాడేమో అనుకుంది.

"థాంక్సండీ! ఇంక నేను వెళ్తాను" అన్నా డాయన సావిత్రివేపు చూస్తూ.

"అలాగే" అని తలూపబోతూ బయటికి చూసింది సావిత్రి. విపరీతంగా కురుస్తోంది వర్షం. ఇందాకటంత కాకపోయినా ఆయ నింకా కొద్దిగా వణుకుతూనే వున్నాడు.

"ఈ వర్షంలో ఎలా అసలింతకీ మీరు " అంటూ ఆపేసింది సావిత్రి.

"నేను నాగభూషణం స్నేహితులమండీ! ఇదివరకు తరచుగా వస్తుండే వాడిని. గత ఏడాదిగా నా భార్యకు సుస్తీ చేయటం, వైద్యం కోసం వూళ్ళు తిరగటం, చివరికి ఆవిడ పోవటం వీటివల్ల ఈ మధ్యలో రాలేదు. తిన్నగా ఇంటి పట్టున వుండక పోవటంవల్ల భూషణం బదిలీ గురించి తెలియలేదు . వాడు రానే వుంటాడు" అన్నాడు.

"ఇంతకీ మీరిప్పుడు ఎక్కడికెళ్ళాలి?" అంది సావిత్రి,

"తిరిగి ఏలూరు వెళ్ళిపోవాలండీ? అక్కడ్నించే వచ్చాను" అన్నాడాయన.

ఏలూరు వెళ్ళటానికి తెల్లారితేగానీ బస్సు ల్లేవని తెలుసు సావిత్రికి. ఎలా వెళతారనీ అడగాలని ఆయనవేపు చూసింది.

బయటికి వర్షంలోకిచూస్తూ నిలబడ్డాడాయన.

ఇందాకటికన్నా నీరసంగా కనిపించింది. ఆయన ముఖం సావిత్రికి.

"ఇప్పుడెలా వెళ్తారు? బస్సులేంవుండవు." అంది.

"అదే ఆలోచిస్తున్నాను." అన్నాడాయన చిన్న పిల్లాడిలా ముఖంపెట్టి.

"మరీ అంత దిగులు పడకండి! మీ స్నేహితుణ్ణయితే తీసుకు రాలేను కానీ తెల్లారేవరకు ఆతిథ్యం ఇవ్వగలను." అంది సావిత్రి నెమ్మదిగా నవ్వుతూ.

"అబ్బే దిగులు కాదండీ, వాణ్ణి చూద్దామని ఎంతో ఆశగా వచ్చాను. నా భార్య పోయిన సంగతి వాడితో చెప్పుకోవాలనుకున్నాను. ఏదైనా చెప్పుకోడానికి నాకు మిగిలిన ఆత్మీయుడు వాడొక్కడే!" అన్నాడు.

వెంటనే ఏం మాట్లాడ్లేకపోయింది సావిత్రి.

కనీసం మీకు అతనయినా వున్నాడు! అని అందామని నోటి దాకా వచ్చింది. కానీ మాట నోరు దాటకుండా జాగర్త పడింది.

ఓ క్షణం గడిచాక "వీధి తలుపు దగ్గరగా వేసి లోపలికి రండి!" అంది తువ్వాలు తిరిగి యిస్తూ.

తువ్వాలు తీసుకుని వీధి తలుపు దగ్గరగా వేశాడు తప్ప లోపలికి రాలేదాయన.

"ఏం?" అన్నట్టు చూసింది సావిత్రి.

తలొంచి కాళ్ళవేపు చూశాడు, కింద చిన్న మడుగులా తయారయింది.

అదిచూసి నవ్వుతూ "ఏం పర్వాలేదు రండి!" అంది సావిత్రి ముందుకు నడుస్తూ.

"మీ కెందుకండీ శ్రమ? కొంచెం వర్షం వెలిశాక వెళ్ళిపోతాను. ఏ లారీయేనా దొరుకు తుందేమో చూస్తాను" అన్నాడాయన.

"శ్రమేవుంది! వర్షం వెలిస్తే అలాగే వెళ్దురుగాని! పూరికే మొహమాట పడకండి!" అంది.

తువ్వాలుతో చేతులు తుడుచుకుంటూ ఓ అడుగు ముందుకు వేశాడు.

గది నాలుగు వేపులా చూస్తూ "మీరు వొంటరిగా వుంటున్నట్టున్నారు?" అన్నాడాయన.

నడుస్తున్నదల్లా ఆగిపోయింది సావిత్రి. అంతవరకూ స్వచ్ఛంగావున్న తనలోకి కొంచెం నకిలీ తనం తెచ్చుకుని "మావారు—" అంటూ మొదలెట్టింది.

"అబ్బే వివరాలకోసం కాదండీ! ఇంట్లో మీరు తప్ప మరెవరూ కన్పించకపోతే అలా అన్నాను" అన్నాడాయన.

అనుకోకుండానే సావిత్రి మనసెంతో తేలిక పడింది. ఓసారి ఆయనవేపు తలతిప్పి చూసి మళ్ళీ ముందుకు నడిచింది.

ఆయన తడిబట్టలు మార్చుకోడానికి ఏమివ్వాలో తెలియక కాసేపు తడివిట్లు పడి చివరికి రెండు దుప్పట్లుంటే ఇచ్చింది. ఇచ్చాక ఆయన ఏమేనా అనుకుంటాడేమో అనుకుంది.

కూడా బట్టలు తెచ్చుకునే అలవాటు లేనందుకు, తనను తనే తిట్టుకున్నాడు తప్ప దుప్పట్ల

విషయం ఏం అన్లేదు. ఓ దుప్పటీ చుట్టబెట్టు కుని, రెండోది వొంటి నిండా కప్పుకొన్నాడు. తడి బట్టలు దణ్ణెంమీద ఓ పక్కగా ఆరేశాడు.

"మీరెలా వుంటున్నారో కానీ వొంటరి తనం మాత్రం చాలా భయంకరమైందండీ!" అన్నాడాయన కిటికీలో కూచుంటూ.

తన గురించి తన మనసు చెప్పినట్టనిపించింది ఆమాట సావిత్రికి.

"ఇలా మడత మంచంమీద కూచోండి. స్టౌమీద కొంచెం అన్నం పెట్టివస్తాను," అంది సావిత్రి వంటింటివేపు కదుల్తూ.

"అబ్బే యిప్పుడెందుకండీ యాతన ఏం వద్దులెండీ!" అన్నాడాయన.

"ఇచ్చే ఈ ఒకపూట ఆతిధ్యం పూర్తిగా ఇవ్వనివ్వండి. అయినా నిజం చెప్పండి మీరెప్పుడు భోంచేశారు ఆకలిగా లేదూ——" అంది.

"నిజం చెప్పాల్సొస్తే నిజంగానే చాలా ఆకలిగావుంది. నిన్న సాయంత్రం ఎప్పుడో చేశాను భోజనం." అన్నాడాయన.

"అయితే, ఒక్క నిమిషం వుండండి" అంటూ వంటింట్లోకి నడిచింది సావిత్రి.

సావిత్రి బియ్యం కడిగి స్టౌమీద పెట్టేంత వరకూ ముందు గదిలో అటూ ఇటూ పచార్లు చేస్తూనే వున్నాడాయన. అలా పచార్లు చేస్తూనే గది గుమ్మం దగ్గర్నుంచి, ఒక మనిషి ఇరుగ్గా పడుకోడానికి సరిపోయేలావున్న ఆ వంటింటిని కూడా చూశాడు.

సావిత్రి తిరిగి ముందు గదిలోకి వచ్చి మరోసారి చెప్పాక మంచంమీద కూచున్నాడాయన. ఎదురుగా కుర్చీవేసుకుని కూచుంది సావిత్రి.

అన్నం వుడుకుతున్నంతసేపూ, వుడికాక భోజనాలు అవుతున్నంతసేపూ ఇద్దరూ చాలా కబుర్లు చెప్పుకున్నారు.

వేడివేడి అన్నం తింటూ అలా కబుర్లు చెపుతూ చాలాసేపు భోంచేసినా, చాలా తొందరగా కడుపు నిండిపోయి నట్టనిపించింది సావిత్రికి. చాలా ఏళ్ళ తర్వాత సహజమయిన వాతావరణంలో, మనసులో ఏ ఇరుకూ లేకుండా ఆ రాత్రి గడుస్తున్నట్టనిపిందింది సావిత్రికి.

భోజనాలయిన కాసేపటికి "ఎలాగా ఈ రాత్రికి ఆపేశారు వర్షం అలాగేవుంది. ఓ చాప ఇస్తే బయట వరండాలో తెల్లారేదాకా గడిపేస్తాను" అన్నాడాయన.

"వరండాలో చలండీ అయినా అప్పుడే నిద్రొచ్చేస్తోందా మీకు?" అంది సావిత్రి.

"నిద్రొచ్చేస్తోందని కాదు మీకు నిద్రాభంగం కదా అయినా ఒకసారి పడుకుంటే నన్ను చలిగిలీ ఏం చెయ్యవు ఫరవాలేదు

(వి) చిత్ర విజ్ఞానం



పనామా తూర్పు తీరాన క్యూనా జాతి ఆదిమవాసులు చెరకుపంట ఆధారంగా జీవిస్తారు. చెరకు రసంతో వాళ్ళు "చిచా" అనబడే మద్యపానం తయారు చేసుకుని పండగలు చేసుకుంటారు. చెరకునుండి రసం తీయటానికి వారు కని పెట్టిన పద్ధతి రెండువేల సంవత్సరాల నాటిదని అంటున్నారు. రెండు దూలాలు ఆధారంగా అమర్చబడిన రెండు కర్రలమధ్య చెరకు గడలు పోనిచ్చి రసం తీస్తారు. ఈ రెండుకర్రల్లో పైకర్ర పొడుగుగా వుంటుంది. దీని చివర్న ఒక మనిషి నుంచుని ఎగురుతూ వుంటాడు. పడిపోకుండా వుంటానికి అతని చేతికి ఒక నిలువు కర్ర ఊతగా వుంటుంది. రెండు కర్రలమధ్య చెరకుగడను తోయడానికి మరొక మనిషి వుంటాడు. ఇప్పటి యంత్రం ఈ సాధనం లోనుండి రూపొందించబడిందే!!

లెండీ!" అన్నాడు.

ఆయనింకాసేపు కబుర్లు చెపితే బావుణ్ణని వుంది సావిత్రికి. ఆ విషయం బయటికి చెప్ప లేకపోయింది.

"వుండండి. అయితే పక్కేసి వస్తాను," అంటూ చాప, తలగడా తీసుకొని వీధి తలుపువేపు నడిచింది.

తలుపు తీసీ తీయగానే వర్షం జల్లు ముఖం నిండా పడింది సావిత్రికి. అలాగే తడుస్తూ వరండా మీదికి వొచ్చింది. వర్షం జల్లుకి వరండా అంతా తడిసి తడితడిగా వుంది.

"వరండా అంతా తడిసి పోయింది. మీరలా మడత మంచంమీద పడుకోండి." అంది సావిత్రి లోపలికొచ్చి.

ఆయన వెళ్ళి వరండాఅంతా చూసొచ్చాడు. వచ్చాక సావిత్రినే మంచంమీద పడుకో మన్నాడు .తనే కిటికీ దగ్గరగా పడుకుంటా నన్నాడు. సావిత్రి ఒకటికి రెండుసార్లు చెప్పినా ఆయన వినలేదు.

కాళ్ళు ముడుచుకొని మంచంమీద కూచుని సావిత్రి, గోడవారగా పడుకుని ఆయనా మరి కాసేపు మాట్లాడుకున్నారు.

సావిత్రి చెప్పింది వింటూ ఊఁ కొట్టూ కొడుతూ అలాగే నిద్రపోయాడాయన.

ఆయన పడుకున్నా సావిత్రికి నిద్రపట్టలేదు. జరిగిందంతా తల్చుకుంటుంటే చిత్రంగా తోచింది. ఆయనెవరో, ఎలాంటివాడో తెలియ కుండా వొంటరిగా వున్న తను ఆ రాత్రి ఆయనకు ఆతిధ్యం ఇవ్వటం కొంచెం సాహ సమే అనిపించింది. 'అఁ ఇందులో ఏవుంది లెద్దూ' అని తన మనసుకి తనే నచ్చచెప్పుకుని నిద్రపట్టించుకునే ప్రయత్నం చేసింది.

ఓపట్టాన నిద్రపట్టలేదు సావిత్రికి. చాలా సేపటికి నిద్రపట్టినా రాత్రి మధ్యలో చాలాసార్లు మెళుకువ వచ్చింది. మెళుకువొచ్చి నప్పుడల్లా గోడవారగా పడుకున్న ఆయనవేపు చూసింది. ఓసారి.

అలా చూసినప్పుడే దుప్పటీ చెదిరిపోయి, చలికి చిన్నపిల్లాడిలా ముడుచుకుపోయి పడు కున్న ఆయన కనిపించారు.

లేచి వెళ్ళి దుప్పటీ సరిచేద్దా మనిపించింది సావిత్రికి. మంచంమీంచి లేచి మళ్ళీపడుకుంది. పడుకుని ఆయనవేపు అలాగే చూస్తూంటే ఈయన కూడా కొన్ని వర్షపు రాత్రులు భార్య చేరువలో నిండుగా, వెచ్చగా గడిపిన మనిషే కదా! 'అనిపించింది.'

— ఆ ఆలోచనకి ఒకసారి వులిక్కిపడింది. వెన్ను జలదరించి నట్టనిపిస్తే, దుప్పటీ నిండుగా ముసుగెట్టుకుని పడుకుంది సావిత్రి.

* * *

తెల్లారేక ఆయనకన్నా ముందే లేచింది సావిత్రి. వొళ్ళెరక్కుండా అమాయకంగా నిద్ర పోతూ కన్పించాడు. కాఫీపెట్టి నిద్రలేపింది.

ముఖం కడుక్కుని కాఫీ తాగాడు. దణ్ణెం మీంచి చాలావరకు ఆరిన తన బట్టలు తీసుకుని వేసుకున్నాడు.

వంటింట్లో వుంటే సావిత్రిని పిలిచాడు. సావిత్రి వచ్చాక "ఇంక నేను వస్తానండీ! నా గురించి చాలా శ్రమ తీసుకున్నారు. చాలా థాంక్స్" అన్నాడు.

ఆ మాటలు విన్న సావిత్రి ఆయన ముఖం లోకి తేరిపార చూసింది. నిద్రపోతున్నప్పుడు న్నంత ప్రశాంతంగానూ, తేటగానూ వుంది.

గడిచిన రాత్రి ఆయన ప్రవర్తనంతా గుర్తొ చ్చింది. వర్షపు రాత్రంతా వొంటరిగా వొకే గదిలో తనతో వున్నా ఏ మాత్రం అసభ్యంగా ప్రవర్తించని ఆయన తీరు గుర్తొచ్చింది. ఎంతో దగ్గరగా, ఆత్మీయంగా ఆయన చెప్పిన కబుర్లు గుర్తొచ్చాయి.

సావిత్రి తేరుకునే లోపలే ఆప్యాయంగా సావిత్రివేపు మరోసారి చూసి గుమ్మంవేపు నడిచాడాయన.

ఏమిటో చెయ్యాలని, ఏదేదో చెప్పాలని తబ్బిబ్బు పడింది సావిత్రి మనసు.

అప్పటికే ఆయన వీధిలోకి వెళ్ళిపోయాడు.

ఓ క్షణానికి ఏదో జలపాతం వెనకనుంచి తోస్తున్నట్టు ఒక్కుదుటున వీధిలోకి వొచ్చింది

సావిత్రి. వొచ్చి చెయ్యెత్తి ఏదో అనబోయింది. అప్పటికే ఆయన వీధి మలుపు తిరిగాడు.

కాస్సేపు అలాగే వీధివేపు చూసి నీరసంగా వెనక్కి తిరిగొచ్చి మంచంమీద కూలబడింది. పరుగెత్తు కెడితే ఆయన అంది వుండేవాడు. కానీ అంతసత్తువ తన కాళ్ళకి వున్నట్టనిపించ లేదు సావిత్రికి.

లోలోపలనుంచి సుళ్ళు తిరుగుతూ ఏడుపు రాబోయింది. ఏడుపు నాపుకొంటూ, 'ఏమో ఇల్లు తెలుసుగా ఆయనే తిరిగి రావొచ్చు!! అనుకొంది కొద్దిగా ఆశపడుతూ. అయినా లోలోపల్నుంచి పొర్లి వొస్తున్న ఏడుపు ఆగలేదు.

'సగటు ఆడ మనసు ఇరుకునించి, అన వసరపు పిరికి తనం నుంచి సావిత్రి ఓ అడుగు ముందు కొచ్చుంటే ఎంత బావుణ్ణు!' అను కుంది ఆ గదిలోని వొంటరి తనం తిరిగి సావిత్రి చుట్టూ చేరుతూ. □

---

# ★ నవ్వులజల్లు ★

"ఆ కారు అక్కడెందుకు నిలబడిందో తెలుసా?"

"తెలియదు—ఎందుకు?"

"అది కూర్చోవడం నేర్చుకోలేదు."

* * *

పిచ్చి ఆసుపత్రిలో డాక్టర్ పిచ్చివాళ్ళని 'కుడికాలు' తర్వాత 'ఎడమకాలు' అని గెంత మన్నాడు, సైకిల్ పెడల్ తొక్కినట్టు. అందరూ గెంతుతూవుంటే ఒకడు రక్‌మని ఆపాడు. డాక్టరు కారణం అడిగితే వాడు, "నా సైకిలు ప్రస్తుతం కొండమీంచి కిందికి స్లోపులో దిగుతోంది, అంచేత పెడల్ తొక్కనక్కర్లేదు" అన్నాడు.

* * *

పరిగెత్తుకొని పోలీస్‌స్టేషనొచ్చిన యువకుడు, ఇన్‌స్పెక్టరుగారూ, నన్ను అర్జెంటుగా ఖైదు చెయ్యండి, పూలగోలెంతో నా భార్య తలమీద విసిరి . . "

"చంపేశారా?"

"లేదు, గురి తప్పింది! అందుకే పరిగెత్తుకొస్తున్నా "

* * *

పోలీసు :—కనిపించకపోయిన మీ భార్యని కనిపెట్టేశాము !"

అతడు :—అది ఏం చెప్పింది ?"

పోలీసు :—"ఏమీ చెప్పలేదే "

అతడు :—"అయితే నా భార్యకాదు!"

* * *

ఇన్‌స్పెక్టర్ :—"పెళ్ళయిన పది సంవత్సరాలుగా మీ భార్య చేతి కందిన వస్తువులను మీ మీద గిరాటేస్తోంది కదా, మరి ఇన్నాళ్ళ తర్వాత కంప్లెయింటు యిస్తారెందుకు?"

అతడు :—"గురి తప్పకుండా విసరడం నిన్నటినుంచే దానికి సాధ్యమైది ...అందుకే."

* * *

"నా భార్యని చూసి భయపడి నడిచేవాణ్ణి కాను!"

"మరి . "

"పరిగెత్తేవాడ్ని!"

సేకరణ : ఆర్. శివరాజన్

# పేద వర్గాలకు పెద్ద సహాయం

బలహీన వర్గాలకు చెందిన ప్రజల జీవన పరిస్థితులను మెరుగు పరచడానికి అనేక పథకాలు అమలుజరుపబడుతున్నాయి. ఫలితంగా పేద వర్గాలవారు అన్ని రంగాలలోనూ ముందంజవేస్తున్నారు.

షెడ్యూల్డు కులాలు, షెడ్యూల్డు తెగలు, వెనుకబడ్డ వర్గాల వారికి ఆర్థిక సహాయ పథకాలు ప్రారంభించే నిమిత్తం ఆర్థిక సహాయ సంస్థలను నెలకొల్పిన కొద్ది రాష్ట్రాలలో ఆంధ్రప్రదేశ్ ఒకటి.

గత మూడేళ్లుగా పనిచేస్తున్న షెడ్యూల్డు కులాల సహకార ఆర్థిక సహాయ సంస్థ, వెనుకబడ్డ తరగతుల సహకార ఆర్థిక సంస్థ, షెడ్యూల్డు తెగల సహకార ఆర్థిక సహాయ సంస్థ, బలహీన వర్గాల వారికి ఎన్నో విధాల తోడ్పడుతున్నాయి. 1978-79 వార్షిక ప్రణాళికలో బలహీన వర్గాల సంక్షేమానికి 8.32 కోట్ల రూపాయలు కేటాయించారు.

---

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సమాచార పౌరసంబంధ శాఖ
డైరక్టరుచే ప్రకటితము

6/78-79






## మల్లాది వెంకటకృష్ణమూర్తి

ఎవరి మాటలు వినో తన భార్య ప్రియంవద శీలాన్ని శంకించి విపరీతమైన వేదనకు గురి అయాడు సత్యమూర్తి. ఆ ఆలోచనలలోనే తన మొదటి భార్య శ్రీవల్లి జ్ఞాపకాలతో సతమత మవుతున్నాడు. సత్యమూర్తీ, శ్రీవల్లీ రాజమండ్రి బయలుదేరారు. దారిలో సత్యమూర్తి పొరపాటున మరో బస్సు ఎక్కాడు. ఎంత వెదికినా శ్రీవల్లి కన్పించలేదు. సత్యమూర్తిని మాణిక్యశాస్త్రిగారి దగ్గరకు తీసుకెళ్ళాడు అతని బావ. 'ద్వితీయ కళత్రం ఉంది నీ జాతకంలో ఇక ఆ అమ్మాయిని గురించి మరచిపోవచ్చు' అని చెప్పాడాయన.

"మళ్ళీ పెళ్ళా? నేను చస్తే ఇంకో పెళ్ళిచేసుకోను. ద్వితీయకళత్రం వుందన్న మాట నిజంకాదు."

మాణిక్యశాస్త్రిలు చిరునవ్వు నవ్వి చెప్పాడు సత్యమూర్తి కళ్ళలోని తత్తర పాటుని గుర్తించి.

"నీ భార్య తప్పిపోకుండా ఆపగలిగావా? అలాగే పునర్ వివాహం కూడా ఆపలేవు."

"అది నా చేతిలోలేదు."

"ఏది నీ చేతిలో వుంది? మన చేతుల్లో ఏదీలేదు."

సత్యమూర్తి మాట్లాడలేదు. శ్రీవల్లి ఎప్పటికయినా కనబడవచ్చన్న ఆశ సత్యమూర్తిలో ఎక్కడో మిణుకుమిణుకు మంటోంది. కాని శాస్త్రిలు స్పష్టంగా చెప్పాక అదీ ఆరిపోయింది.

శ్రీవల్లి ఇక తనకి కనబడదనీ,

తామిద్దరికీ రుణం తీరిందన్న నిజం కత్తిలా సత్యమూర్తి గుండెల్ని తొలుస్తోంది.

సత్యమూర్తి మొహంలో ప్రస్ఫుటమయిన బాధని, మనసులోని ఆలోచనలని చదవగలిగాడు మాణిక్యశాస్త్రులు.

సత్యమూర్తి బావ "ఏదయినా శాంతి " అడిగాడు.

"పెద్దగా చేయించాల్సిందేమీ లేదు. బృహస్పతి వ్యయంలో వున్నాడు. ఇప్పుడే ప్రయత్నం చేసినా లాభించదు. అబ్బాయిచేత శెనగలు దానంచేయించండి. ప్రస్తుతానికి అది చాలు."

సత్యమూర్తి వంక కొద్దిసేపు చూస్తూండిపోయాడు మాణిక్యశాస్త్రులు.

"వెళ్ళివస్తాం మరి" అన్నాడు సత్యమూర్తి బావ.

"అబ్బాయిని ఈ పూట యిక్కడి వుంచి వెళ్ళండి. రేపు ఉదయం వస్తాడు."

"అలాగే"

"అబ్బాయ్. రాత్రి నీతో కాసేపు ముచ్చటిస్తాను. నీమీద ప్రత్యేక వాత్సల్యం కలిగింది నాకు."

సత్యమూర్తికి వుండాలనీ లేదు, వెళ్ళాలనీలేదు. జవాబు చెప్పలేదు అందుకే.

ఆ రాత్రి అక్కడే వుండిపోయాడు సత్యమూర్తి. మర్నాడు రమ్మని చెప్పి వెళ్ళిపోయాడు అతని బావ.

ఆకు పచ్చటి లేత అరటి ఆకులో భోజనం వడ్డించింది మాణిక్యశాస్త్రులు భార్య అందరికీ. ఎంతో రుచిగా వుంది సత్యమూర్తికి ఆ వంట. శ్రీవల్లి దూరమయిన రోజునుంచి ఆకలే లేదు సత్యమూర్తిలో.

ఎంతో ఆప్యాయంగా కొసరి కొసరి వడ్డించింది ఆవిడ సత్యమూర్తికి. సత్యమూర్తి గురించి తనకి బెంగగా వుందనీ, మాయో, మంత్రమో వేసయినా సరే తనబావమరిదిని మళ్లా మామూలు మనిషిని చేయమనీ పక్కకి పిలిచి కన్నీళ్ళతో వేడుకున్నాడు అతని బావ మాణిక్యశాస్త్రులుని.

సత్యమూర్తికీ, అతని భార్యకీ, సత్యమూర్తికీ, అతని కూతురికీ మధ్యగల అనుబంధం గురించి చాలా ప్రశ్నలువేసి అడిగి తెలుసుకున్నాడు ఆయన.

"ప్రయత్నిస్తాను" అన్నాడాయన.

అందుకే మాణిక్యశాస్త్రులు భార్యకు ప్రత్యేక అభిమానం ఏర్పడింది సత్యమూర్తంటే. కష్టాలలోవున్న మనుషులంటే ఆవిడకి చాలా జాలి.

భోజనం అయాక మాణిక్యశాస్త్రులు అడిగాడుసత్యమూర్తిని."భోజనానంతరం కొద్దిదూరం నడవటం అభ్యాసం నాకు. నువు కూడా వస్తావా?"

తల వూపాడు సత్యమూర్తి.

ఇద్దరూ బయటకి వచ్చారు.

"కృష్ణాతీరానికి వెళదాం. ప్రశాంతంగా వుంటుంది."

తల వూపాడు సత్యమూర్తి.

దారిలోఅనేకమంది మాణిక్యశాస్త్రులుకి దణ్ణం పెట్టారు. అందరికీ అభివందనం చేసి పేరుపెట్టి పలకరించి యోగక్షేమాలు అడిగారాయన.

ఎండాకాలం కాబట్టి కృష్ణాబేరేజ్‌కి ఇవతలి వైపు నీళ్ల లేవు నదిలో. అక్కడక్కడ మాత్రం నిలచి వున్నాయి.

మాణిక్యశాస్త్రులు నది ఒడ్డున కట్టిన మెట్లు దిగి మెత్తటి ఇసుకలో నడిచారు లోపలికి చాలాదూరం.

సత్యమూర్తి నిశ్శబ్దంగా అనుసరించాడాయన్ని. చల్లటి గాలి వీస్తోంది.

ఓ చోట ఆయన కూర్చొని 'కూర్చో' అన్నాడు సత్యమూర్తితో.

నిశ్శబ్దంగా ప్రశాంతంగా వున్న ఆ వాతావరణంలో ఇద్దరూ కొద్దిసేపు మౌనంగా వుండిపోయారు. చీకటిగా వుండటంవల్ల ఒకరికొకరు స్పష్టంగా కనపడటం లేదు.

"నీకు దేముడంటే నమ్మిక వుందా? జపాలు, శాంతుల మీద నమ్మకం వుందా?" అడిగాడు మాణిక్యశాస్త్రులు ఆ నిశ్శబ్దాన్ని భంగపరుస్తూ.

"ప్రత్యేకంగా నమ్మకం వుందనను. అలా అని లేదని కూడా చెప్పను. అసలా సంగతి గురించి ఆలోచించే అవకాశం, అవసరం కలుగలేదు."

"నీ భార్యంటే నీకు బాగా ఇష్టమా?"

"అసలు శ్రీవల్లి లేకుండా ఎలా బ్రతకగలుగుతున్నానో నాకే తెలియటం లేదు."

"శ్రీవల్లి' అంటే ఎందుకంత ప్రత్యేక అభిమానం నీకు?"

"తెలియదు."

"నే చెప్పనా?"

"తెలుసా మీకు!"

"అణకువ కలిగిన ఏ భార్య అయినా భర్త మనసుని సంగ్రహిస్తుంది."

"నిజమే. మేం ఎన్నడూ పోట్లాడుకుని ఎరగం. ఎప్పుడో కాని ఘర్షణవచ్చేది కాదు. నాకు ఇష్టంలేని పని చేసేదికాదు. నా కోసమే పుట్టింది. నా కోసమే పెరిగింది. నే లేకపోతే బ్రతకలేదు."

"శ్రీవల్లిని నువ్వు మర్చిపోవాలంటే ఇంకొకళ్ళని వివాహం చేసుకోవటం ఉత్తమ మార్గంగా తోస్తోంది నాకు."

"అసంభవం. నాకది ఇష్టం లేదు."

స్థిరంగా చెప్పాడు సత్యమూర్తి దూరంగా కనబడుతున్న రైలు బ్రిడ్జిల వంక చూస్తూ.

చిన్నగా నవ్వాడు మాణిక్యశాస్త్రులు.

"ఒకేఒక వ్యక్తిని ప్రేమిస్తున్నామనీ, ఆ వ్యక్తి లేకపోతే బ్రతకలేమని అనుకోవడం మానసిక దౌర్బల్యం. యిదో బలహీనత. జాడ్యం. అసలు నిజానికి ప్రేమ, మమకారం అనేవి మానసిక బలహీనతలు. మానసికంగా ఒకరికి బానిసగా మారటం ప్రేమంటే. ఒక ప్రదేశం మీదో, ఒక వస్తువుమీదో, ఓ వ్యక్తి మీదో మనిషికి తనకి తెలియకుండానే విపరీతమయిన సఖ్యత, ఇష్టం ఏర్పడతాయి. ఆ ప్రేమ ఓ పంజరంలాంటిది. ఆ గూడులోకి తనకి తెలియకుండానే ప్రవేశించి చిక్కుపడిపోతాడు మనిషి. తర్వాత ఆ గూటిలోంచి బయటపడటానికి గింజుకుంటాడు. కాని అప్పటికే విధాత అనుకున్నది అయిపోతుంది. చేతకాదు. దాంతో మొదలవుతుంది జీవితంలో ఘర్షణ, బాధ, నిస్పృహ. ఒకవేళ ఆ పంజరం తలుపువరకయినా వచ్చితెరచినా అందులోంచి పారిపోవటం దుర్లభం అవుతుంది. అతనికి తెలియకుండానే తన రెక్కలు తానే ఎన్నడో నరికేసుకున్నాడు."

సత్యమూర్తి దూరంగా కనబడే

రైలు బ్రిడ్జిల క్రింద వెలిగే ఎర్రటి మంటని చూస్తూ వింటున్నాడు మాణిక్యశాస్త్రులు చెప్పే మాటలు.

"ఆ బంధన లేకపోతే లోకం ఇలా సాగదు. ఇది మానవుడి తప్పుకాదు. ఆ సర్వేశ్వరుడే మనిషిలో ఈ గుణం కావాలని కల్పించాడు. ఆ మానసిక బంధం లేకపోతే కష్టం వచ్చినప్పుడు ప్రతి మొగాడు పెళ్ళాన్ని, పిల్లల్ని, సంసారాన్ని వదిలేసి సుఖంగా ఎటయినా వెళ్ళిపోవచ్చు. తను సంపాదించే దాంట్లో భాగం ఇస్తున్నాడు తన కుటుంబ సభ్యులకి. ఎందుకు? మమకారం అలా కట్టివేస్తుంది. అనురాగాన్ని మించిన రక్షణ వుండదు స్త్రీకి. అనుకూలపతి అయిన భార్యకి ఆమె భర్తే రక్షణ. తన హృదయంలో అతడిని కట్టేసుకుంటుంది. ఎటూ పారిపోయేందుకు వీలులేకుండా అష్టదిక్బంధం చేస్తుంది మగడిని. నీ విషయంలో అలానే జరిగింది. కాని ఆ పరమేశ్వరుడి లీలాప్రకారం ఇప్పుడు ఆమె దూరమయింది. ఆమె కోసం బిడ్డ కోసం నీ మనసు పరితపిస్తోంది."

"నా కూతురు ఏమయినా ఫర్వాలేదు. శ్రీవల్లి దక్కితే చాలు నాకు."

"నీ బిడ్డమీద అపేక్ష లేదా నీకు?"

"లేదు."

"ఏం?"

సత్యమూర్తి వెంటనే చెప్పాడు.

"నా భార్య ప్రేమతో అదీ భాగం పంచుకుంటోంది కాబట్టి."

"విచిత్రం. లోకంలో ఎక్కడయినా సంతానంమీద ప్రేమ వుంటుంది. భార్య లేకపోయినా వుండగలరు కాని సంతానం దూరమయితే మథన పడతారు."

సత్యమూర్తి మాట్లాడలేదు.

"విత్తంవల్ల, కాంతవల్ల వచ్చే బాధలు రెండూ వేరు. కాని రెండూ దుర్లభమే. ధనం పోయినా తిరిగి అది దక్కితే వుపశమనం కలుగుతుంది. అది తిరిగి గడించేందుకు చేసే యత్నంలో కొంత బాధని మరవవచ్చు. కాని కాంత చేయిదాటినా, చేయిదాటిన కాంత మన పాలబడినా కలిగే బాధకి అంతం వుండదు. ముఖ్యంగా పాశం పెంచుకున్న వనిత అయితే, భర్త మనసుకి నచ్చేవిధంలా నడచుకోగలిగిన భర్తని పొందిన మగడి సంతోషం, అదృష్టం, జీవనం అతీతం. అందుకే భర్తృహరి అంటాడు 'అనుకూలవతి అయిన భర్తని వెదకడంలో పురుషుడు వెచ్చించేకాలం, ధనం, శ్రమ మెచ్చింపదగ్గవి' అని."

కొద్దిసేపాగి చెప్పాడు మాణిక్యశాస్త్రులు.

"సృష్టి అంతటిలో ఒక్క మానవుడే నిరుపయోగి. ఉపయోగకరమయినవన్నీ అతనికి అందుబాటులో వున్నాయి. అదిగో. దూరంగా కనబడే ఆ మంటని చూస్తున్నావుగా. ఇహాన్ని చాలించిన ఓ మానవుడి శరీరం ఆ మంట. కాలిపోతోంది. మరణానంతరం ఆ కట్టె నిరర్థకం. ఎందుకూ పనికిరాదు శరీరంలోని ఏ భాగం. కాని అదే జంతుజాలం అయితే మరణానంతరంకూడా వుపయోగపడతాయి. ఏనుగు దంతం, ఖడ్గమృగం కొమ్ము, పులిచర్మం, సింహం గోళ్ళు ఒంటెకడుపులోనినీరు, తాబేలు కవచం,




మేక మాంసం ఇలా ప్రతి జీవీ మరణా నంతరం కూడా నిరుపయోగం కాదు. వాటికి పాశాలుండవు. బంధాలుండవు. ప్రేమ వుండదు. యాంత్రికంగా బ్రతుకు తాయి. అందుకే బాధలుండవు. బాధ లన్నిటికీ మూలకారణం మనిషి పెంచు కునే బంధం. అతని చుట్టూ అల్లుకునే పాశం. అది ఛేధించుకోగలిగితే మనిషి హాయిగా సుఖంగా వుండగలడు. అది సాధ్యపడకుండా మనసిచ్చాడు దేముడు మానవుడికి."

సత్యమూర్తి దూరంగా రైలుబ్రిడ్జి క్రింద కాలుతున్న శవం తాలూకు మంటని చూస్తూ వింటున్నాడు. మాణిక్య శాస్త్రిలు చెప్పే ప్రతీ మాటనీ అర్థం చేసుకోడానికి ప్రయత్నిస్తున్నాడు.

బ్రతికివుండగా ఆ శవం తాలూకు వ్యక్తిని అమితంగా ప్రేమించే బంధువులు అనేకులు వుండివుండచ్చు. కాని శవం పూర్తిగా కాలకుండా కూడా వెళ్ళిపోయి వుంటారు.

జీవితం ఏమిటి?

వివిధ బంధాలతో, పాశాలతో అల్ల బడ్డ పంజరం ఆ బంధనం ధనంమీద కావచ్చు. పదవిమీద కావచ్చు. స్త్రీ మీద కావచ్చు. శారీరక ఇచ్ఛమీద కావచ్చు. ఆస్తిమీద, సంతానం మీద, కీర్తి మీద, బంధువులమీద, దేశంమీద .. దేనిమీ దయినా లేక అన్నిటి కలయికా అవచ్చు. బ్రతికున్నంత కాలం ఆ బంధంలో, ఆ వుచ్చులో పడికొట్టుకుంటూవుండాలి. అదే ఆనందం.

"శ్రీవల్లి దక్కకపోవచ్చు నీకు. కాని ఆమెమీద ప్రత్యేక వాత్సల్యం వుంది నీకు. అది ఆమె తన చతురతతో కల్పించు కుంది. భార్యగా తన బాధ్యతని చక్కగా నిర్వర్తించింది. నిజానికి ఏ స్త్రీఅయినా భౌతికంగా ఒకటే. శరీర

నిర్మాణం ప్రతీ స్త్రీలో ఒకటే విధంగా వుంటుంది. పరిమాణాలే తేడా. ఏ స్త్రీ ఇచ్చే సుఖం అయినా స్థూలంగా ఒకటే. ఒక స్త్రీతో రమిస్తే ఒక రకం సుఖం, ఇంకో స్త్రీతో సంభోగిస్తే ఇంకో రకం సుఖం దొరుకుతుందనుకోవటం నిజం కాదు. రెండు సుఖాలూ వేరనిపించినా తేడా భౌతికం కాదు. పూర్తిగా మాన సికం! మనస్సు, మమకారం, ప్రేమ వున్న స్త్రీ దగ్గర—అంటే భర్త దగ్గర అనుకుందాం—సుఖం అత్యధికం అని పించడానికి కారణం ఆమెలోని ప్రతీ అణువు ప్రేమమయంగా, విలువయినదిగా అనిపిస్తుంది! సుఖం అత్యధికం అని పించేలా భ్రమింపచేస్తుంది మనసు.

నిజానికి సుఖం దుఃఖంఅంటూరెండూ లేవు. నా స్వభావాన్నిబట్టి, సంస్కా-రాన్నిబట్టి, విషయాన్ని గ్రహించే విధా నాన్నిబట్టి నా మనసే నిర్ణయిస్తుంది సుఖమో దుఃఖమో. తండ్రి మరణిస్తే దుఃఖం కలగాలి. కాని ఆయన మరణా నంతరం చాలా ఆస్తి వస్తోందికదా అనే విషయం నా సంస్కా-రాన్ని బట్టి సుఖ ప్రదమయిన వార్తలా తోచచ్చు నా మనసుకి. నీ ఆలోచనలని బట్టి స్వర్గం లేదా, నరకం నువే సృష్టించుకుంటావు.

దేముడు చేసే అనేక మాయల్లో అతి గొప్ప మాయ ఇదే. నువ్వేది కోరు తావో అది చిక్కదు.

ఏది చిక్కుతుందో అది కోరవు.

లేనిదానికి, రానిదానికి చేతులుచాచడం మనిషిలోని ప్రధాన గుణం. అదే దుఃఖానికి హేతువు. ఆ భ్రమని జయిస్తే యతి అవచ్చు. లేదా చితికిచేరేదాకా దుర్గతే.

అసలు సుఖం అంటే ఏమిటి?

రెండు దుఃఖాల మధ్యవున్న చిన్న విరామం సుఖం.

ఆ పరాత్పరుడు మనిషికి మనసిచ్చాడు. ఆ మనసులోనే వివిధరసాలు పుడతాయి. మనసుని అదుపులో వుంచుకోగలిగితే మనిషికి అంతకుమించిన వరంలేదు. అసూయ, కోపం, ద్వేషం, పగ మొద లయిన రసాలన్నీ మానవుడిని దుఃఖంలో ముంచుతాయి చివరికి. జాలి, కరుణ, దయ మొదలయిన రసాలు దుఃఖాన్ని దూరం చేస్తాయి. మనిషికి మనస్సుని మించిన కష్టంలేదు.

మానసిక పరిపక్వత లేకపోతే కొద్ది పాటి ఒడుదిడుకులచే మానవుడు దుఃఖ సాగరంలో మునిగిపోతాడు. అలాంటిది జీవిత సమస్యలని ఎదుర్కో-వాల్సివచ్చి నప్పుడు మానసిక వత్తిడిని భరించలేక దాన్నించి పారిపోదలచి చెడు అలవాట్లకి గురవుతారు. విపత్తుని తట్టుకునే సాధనాలు మనలోనే వుంటాయి. మన బలంతో వాటిని వినియోగించుకోవాలి.

అన్నిటికన్నా అద్భుతమయిన సాధనం బంధాలలో చిక్కుకోకుండా వుండగల గడం. దేనిమీదా వ్యామోహం కూడదు. తృప్తిని మించిన సుఖంలేదు. దేనిమీదా ఆసక్తి లేనినాడు అంతా తృప్తే. కోరి కలతో సతమతమయిపోతోంటే, ఎన్ని కోరికలు తీరినా తృప్తి కలగదు. ఒకదాని వెనుక మరొకటి సముద్రపు అలలులాగా వచ్చి మనిషిని తాకుతుంటాయి అవి. అలాంటి మనుజుడికి సంతృప్తి లభ్యం కాదు.

మెత్తటి హంసతూలికా తల్పాల మీద రంభల్లాంటి భార్యలతో శయనించిన పూర్వకాలపు రాజులు ఎంత సంపద వున్నా, ఎన్ని రాజ్యాలు జయించినా తృప్తిని, అందులోంచి సుఖాన్ని అందుకోలేకపోయారు. ఇంకా ఇంకా కావాలనుకునేవారు.

ఆలాంటివారికి చంద్రుడు, నక్షత్రాలు సొంతం అయినా సుఖం వుండదు.

మానసికంగా ప్రశాంతత గల వ్యక్తే ధన్యుడు. అదృష్టవంతుడు. అందుకే అంతా మిధ్య. నేను కేవలం ఈ లోకంలో ఓ బాటసారిని అనే అవగాహన కలగాలి.

తనకంటూ ఏం లేదన్న ఒక్క విషయం-డిటాచ్‌మెంట్, ది వెరీ ఫీలింగ్ ఆఫ్ డిటాచ్‌మెంట్ గివ్స్ హ్యూమన్ బీయింగ్ ఇమ్మెన్స్ ప్లెషర్. ఏ సింగిల్ ట్రూత్ దట్ నథింగ్ ఈజ్ మైన్ ఎండ్ ది ఓన్‌లీ స్యూరెస్ట్ ఆఫ్ సర్టనిటీస్ ఈజ్ డెత్ ఇఫ్ అండర్‌స్టుడ్ ప్రాపర్లీ ఎండ్ ది మైండ్ ఈజ్ సింక్రనైజ్‌డ్ టు దట్ ట్యూన్, టు దట్ ట్రూత్, ఏ హ్యూమన్ బీయింగ్ బికంస్ ఏ డిటాచ్‌డ్ మేన్-ఏ సెయింట్."

సత్యమూర్తికి అచ్చ తెలుగుమాట్లాడే ఆయన ఇంగ్లీషు కూడా అంత చక్కగా మాట్లాడటం ఆశ్చర్యాన్ని కలిగించింది. ఆయన చెప్పే ప్రతీ విషయం శ్రద్ధగా అర్థం చేసుకొంటూ వింటున్నాడు. ప్రతీ అక్షరం సత్యమూర్తి బుర్రలోకి ఇంకుతోంది.

"ఆ విధమయిన మానసిక పరిపక్వత సాధించే ప్రయత్నం చేయి. సాంసారిక జగత్తుకి దూరం అవమని కాదు నేను బోధించేది. ఆధ్యాత్మికపరమయిన ఆలోచనలని అలవరచుకో."

"ఆధ్యాత్మికంగా నా కసలు దేముడు అనేవాడు వున్నాడన్న నమ్మకం లేదు."

మాణిక్యశాస్త్రిలు గలగలా నవ్వాడు.

"నిన్ను దేముడిని నమ్మమనటం లేద బ్బాయ్. నిజానికి నువ్వు హిందువుగా పుట్టడం అదృష్టం. అలాంటి అదృష్టం కలిగినప్పుడు దాన్ని సక్రమంగా వినియోగించుకోవటం నీ చేతుల్లో వుంది.

నిజానికి హిందూమతంలోని ఫిలాసఫీ కూడా అంతా మిధ్య అని బోధిస్తుంది. అంటే మానసికంగా ఓ మనిషిని డిటాచ్డ్ స్టేట్‌లోకి లాగి అలాగే నొక్కి పట్టి వుంచుతుంది.

ఆవేదనతో అలమటించే హృదయానికి చేతనయినంత ఆనందం ఇవ్వటమే హిందూమతం వుద్దేశం. అందుకే 'విధి, విధాత, పూర్వజన్మ, పుణ్యం, పాపం' లాంటివి సృష్టించారు ఈ మత పెద్దలు.

దేముడనేవాడున్నాడు. పూర్వ జన్మ వుంది. ఆ జన్మలో చేసే పాపపుణ్యాలని ఈ జన్మలో అనుభవిస్తున్నాము. విధి అనే ఓ పెద్ద శక్తి వుంది. దాన్ని జయించటం ఎవరి తరం కాదు. బ్రహ్మదేముడు ముందరే నా కష్టసుఖాలన్నీ వ్రాసి ఈ లోకంలోకి పంపాడు. వాటిని మార్చగలిగే శక్తి నాకు లేదు.

ఇలా సాగుతాయి హిందూ మతస్థుడి ఆలోచనలు. ఈ ఆలోచనా స్రవంతిలోనే నిరాశావాదం గోచరిస్తోంది. ఏది ఎలా రాసిపెట్టి వుందో అలా జరుగుతుంది అన్న నమ్మకంతో ఆశావాదానికి తావు లేదు. నిరాశని మించిన సుఖం లేదు.

మిన్ను విరిగి మీదపడ్డా కూడా 'ఇది దైవ సంకల్పం' అనుకోవడంలో ఓదార్పు వుంది.

జీవితంలో ఎంతపెద్ద కష్టం వచ్చినా, 'నేనే జన్మలోనో ఏదో పాపం చేసి వుంటాను. ఫలితంగా ఇలా అయింది. అనే తాత్విక చింతనలో నేనేం చేసినా ఈ విపత్తు తొలగదు. ఇలాగే జరగనీ' అనే నిస్పృహ వుంధి. ఏదీ మన చేతిలో లేదు! అంతా పైవాడి లీల. మనం నిమిత్తమాత్రులం' అనే నమ్మకంలో అన్ని కష్టాలు తేలికయిపోతాయి.

నిజంగా అద్భుతమయిన మతం మనది. స్వర్గం నరకం అని రెండింటిని సృష్టించాయి. పుణ్యం, పాపం అని మరో రెంటిని సృష్టించాయి. పాపం చేస్తే నరకానికి పోతామనే మానసిక భయం కలిగించింది. దాంతో పాపం చేయబోయే ముందు మనిషి ఆలోచిస్తాడు. పాపభీతి లేకపోతే మనదేశంలో పాపాలు, నేరాలు ఇంకా ఎక్కువగా జరిగేవి. శిశు హత్య పాపం. భ్రూణహత్య, గో హత్య, బ్రాహ్మణ హత్య పాపాలు. వ్యభిచారం, దొంగతనం పాపాలు. ఇలా ఒక మనిషి సరదాకి, సుఖానికి స్వార్థంతోచేసే పనుల వల్ల ఇంకో మనిషి కష్టపడాల్సివస్తే వాటి నన్నింటినీ పాపాలుగా నిర్దేశించి అవి జరగకుండా కాపాడుతున్నారు మన మత సంస్కర్తలు.

కానీ క్రిష్టియానిటీలో ఈ ఫిలాసఫీ లేదు. ఎన్ని పాపాలు చేసినా చివరికి దేముడి ముందు తన పాపాల్ని వప్పుకుని విలపిస్తే-ఆ కన్ఫెషన్‌వల్ల పాపాలన్నీ కొట్టుకుపోతాయి అన్నది వాళ్ళ సిద్ధాంతం.

దానివల్ల పాపాలు చేసేందుకు వెరవరు వారు. అందుకే క్రిష్టియానిటీ వున్న పాశ్చాత్య దేశాల్లో నేరాలు అధికం. ఎంత చిన్న పాపం చేసినా దాని ఫలితం అనుభవిస్తేకాని పోదు అనే సిద్ధాంతం మన మతంలో వుంది.

అంతేకాదు. మంచి చెయ్యటంవల్ల పుణ్యం వస్తుందనే ఆశ కల్పించడంతో తోటి మనిషికి మంచి చేయడం కూడా వుత్సాహపరచబడింది. అనేక రకాల దానాలని నిర్వచించారు. బాధితులకి సహాయం చేయడం పుణ్యం అన్నారు. తోటి మనిషికి సాయం చేద్దామనే మంచి తనంతో కాకపోయినా,పుణ్యం వస్తుందనే స్వార్థంతో కేవలం పుణ్యంకోసం అలాంటి మంచి పనులు చేస్తున్నారు ఈ నాటికీ అనేకమంది.

విలువలు నమ్మకాలు మారడంతో పాపపుణ్యాల మీద, స్వర్గనరకాల మీద నమ్మకం నశించింది కాని, మునుపటి రోజుల్లో ఆ సిద్ధాంతాలని ప్రజలు విపరీతంగా విశ్వసించేవారు. ఈ రోజుల్లో లాగా ఎవరూ ఆకలిబాధకి మరణించేవారు కాదు. పుణ్యం సంపాయించాలనే ఇచ్ఛతో సత్రాలు, అన్నదానాలు విరివిగా సాగితుండేవి ఆ కాలంలో.

ఇతరులకు కీడు సంకల్పించకుండా మంచినిచేస్తూ, తమకి వచ్చే కష్టనష్టాలకి కృంగిపోకుండా వాటికికారణం ఆ భగవంతుడిగా నమ్ముతూ, తమకి మంచి చేయమని ఆ భగవంతుడిని ప్రార్థిస్తూ, మంచి జరగకపోతేఆ దేముడిని నిందించకుండా,

తమ మొర ఆలకించలేదని బాధపడుతూ జీవితాలని ఒక పరిధిలో, ఓ నిర్ణీత నియమాలతో కట్టుబాట్లతో వెళ్ళబుచ్చుతారు హిందూమతస్థులు. తమకి జరిగే నష్టాలకి ఓ కారణం మతం చూపించింది. కాబట్టి ఆట్టే అలజడికి లోనుకారు. మరే మతం ఈ అవకాశాన్ని కలిగించలేకపోయింది.

జరతుష్ట్రి జోరోష్ట్రియనిజం మతానికి ప్రవర్త. నేను మతపుస్తకాలు కూడా కొన్ని అధ్యయనం చేశాను. ఆ మత బోధనలు ముఖ్యంగా మూడు.

హుంటా-అంటే మంచి ఆలోచనలు.

హుక్తా—అంటే మంచి మాటలు.

హుల్‌రష్టా—అంటే మంచి పనులు.

ఈ మూడూ మనుష్యులు అలవరచుకోవాలని బోధిస్తుందా మతం.

దేవుడున్నాడని నమ్మకం లేకపోయినా, మనకి అంతు తెలియని వింత శక్తేదో మనల్ని ఆడిస్తోందని, మనమా శక్తికి బానిసలమని, మన జీవితంలో వచ్చే ఒడిదుడుకులకి మనంకాదు ఆ శక్తి కారణమని నమ్ము, నీ కొచ్చిన నష్టం కూడా ఆ శక్తి నీ మీద కినుక వహించటంవల్లే."

సత్యమూర్తి చాలాసేపు ఆలోచిస్తూండిపోయేడు మౌనంగా మాణిక్యశాస్త్రిలు చెప్పిన విషయాల గురించి.

ఆ నిశ్శబ్ద వాతావరణంలో, కృష్ణానది గర్భంలో, చల్లగాలిలో, చీకట్లో, కొత్త ఆలోచనలతో సత్యమూర్తి అలాగే కూర్చున్నాడు చాలాసేపు వెలుగుతున్న శవం చూస్తూ. మాణిక్యశాస్త్రిలుకి తెలుసు సత్యమూర్తి మనసులో చెలరేగే ఆలోచనలు. అందుకే ఆయన కూడా



దెయ్యాలున్నాయో లేవో మనం చెప్పలేం గాని, దక్షిణ శ్రీ లంక వాసులకు మాత్రం వాటి మీద గట్టి నమ్మకముంది. యిలాంటి సర్ప కిరీటాలు పెట్టుకుంటే దయ్యాలు భయపడి పారిపోతాయని వారి నమ్మకం.

---

నిశ్శబ్దంగా వుండిపోయాడు. సత్యమూర్తి మనసులో నింపగలిగినన్ని భావాలు నింపాడు. వాటిని వృద్ధి చేసుకోవటమో, మొదట్లో తెంచేసుకోవడమో అతని మీద ఆధారపడి వుంటుంది.

సత్యమూర్తి అకస్మాత్తుగా అడిగాడు.

"ఎక్కడుంది సుఖం?"

"నీకు నేను చెప్పిన అంశాలన్నిటిలోకి ఏది సబబుగా అనిపించింది? ఏది నచ్చింది?"

"డిటాచ్‌మెంట్"

చాలా సేపటికి సమాధానం చెప్పాడు సత్యమూర్తి. మాణిక్యశాస్త్రిలు ఆప్యాయంగా సత్యమూర్తి భుజం మీద తట్టి

చెప్పాడు.

"నే చెప్పింది వృథా కాలేదు. నువే ఓ నాడు అందరికీ చెప్పగలవు సుఖం ఎక్కడవుంటుందో, ఎలా దొరుకుతుందో."

సత్యమూర్తి దూరంగా రైలుబ్రిడ్జి మీద పరుగెత్తే రైలువంక చూసాడు.

"నీ మనసులోని బాధ పోగొట్టాలని, కొద్దిగానయినా వుపశమనం అవాలని నీ శ్రేయస్సుకోరి చెప్పాను. నా మాటలు నీకు వుపయోగపడితే అది ఆ దైవకృపే. ఇవి చెప్పడానికే నేనుఆపాను ఈ రాత్రికి. బహుశ ఆ ఈశ్వరుడే నాలో ఈ ప్రేరణ కలిగించాడు."

"నా మీద మీకు ఎందుకింత అభిమానం కలిగింది?" అడిగాడు సత్యమూర్తి చాలా సేపటికి.

"నేనూ ఓసారి నువు పడ్డలాంటి చిక్కులో పడటంవల్ల నీ మనసు ఎంత అలజడిగా వుంటుందో నేను వూహించగలిగాను కాబట్టి."

"అంటే ?"

"మనకి అన్నం వడ్డించినావిడ నా రెండో భార్య."

"మీ మొదటి భార్య .?"

"బ్రతికేవుంది ఎక్కడో. ఆవిడతో నేను కాపురం చేసింది సరిగ్గా ఇరవై ఒక్క నెలలు. పెళ్ళయిన డబ్భై ఒకటో రోజు మేం విడిపోవల్సింది. అప్పట్లో నాకు సాధ్యంకాలేదు. నా మనసు పూర్తిగా ఆమెమీద లగ్నం అయివుండటంవల్ల చివరికి ఆ బంధం తెంచుకో కలిగాను. అందుకోసం మానసికంగా చాలా కృషి చేయాల్సి వచ్చింది."

కారణాలు అడగదలచుకోలేదు సత్యమూర్తి. ప్రతీమనిషి మనసులో ఓ రహస్యమందిరం వుంటుంది. దాన్ని తెరచిచూసే ప్రయత్నం ఇతరులు చేయకూడదు.

"ఆ భార్య వల్లే ఆధ్యాత్మిక చింతన ఎక్కువగా ఏర్పడి ఈపరిస్థితికి వచ్చాను."

"శ్రీవల్లి ఇక కనపడే అవకాశం లేదంటారా?" అడిగాడు సత్యమూర్తి చిన్నగా నిట్టూర్చి.

"చెప్పలేను. కాని ఇంకో వివాహం చేసుకుంటే శ్రీవల్లి దూరమయిందన్న బాధ తగ్గుతుంది. వెంటనే కాదు. కొద్ది సంవత్సరాలు ఆగి ఇక శ్రీవల్లి రాదన్న సంగతి నిర్ధారణ చేసుకున్నాక అప్పుడు వివాహం చేసుకోవడం వుత్తమం."

"నాకు జాతకాల మీద నమ్మకం లేదు."

"నాకు దైవం వునికిమీద, ఆయన కృప మీద అపారమయిన నమ్మకం వుంది."

ఇద్దరూ లేచారు.

ఇసకలోంచి రోడ్డుమీదకి వచ్చారు. అరగంటలో ఇంటికి చేరుకున్నారు.

"విశ్రాంతి తీసుకో" అన్నాడు మాణిక్యశాస్త్రులు.

పాకబయట పరచివున్న చాపమీద పడుకున్నాడు సత్యమూర్తి. ఆలోచనలతో చాలాసేపు నిద్రపట్టలేదు. శ్రీవల్లి గురించే ఆలోచించాడు ఈ పదిరోజులు.

ఇప్పుడు మనిషికి సుఖం ఎక్కడ ఎలా లభిస్తుంది? మానసిక ప్రశాంతతని ఎలా పొందగలడు? అన్న విషయాల

మీదకి కూడా మళ్ళాయి సత్యమూర్తి ఆలోచనలు.

మర్నాడు ఉదయం నిద్ర లేచేసరికి మాణిక్యశాస్త్రులు గుడికి వెళ్ళిపోయారు.

"నేనో రెండురోజులు మీ ఇంట్లోనే వుంటాను" చెప్పాడు సత్యమూర్తి ఆయన భార్యకి.

## 9

సత్యమూర్తి రాజమండ్రి నుంచి హైద్రాబాద్ వెళ్ళిపోయాడు. అక్కయ్యని తోడిచ్చి పంపించాడు బావ ఓ నెలరోజులు దగ్గరుండి తమ్ముడిని చూసుకునేందుకు.

రాజమండ్రిలోనే బావ పరిదిచేత శెనగలు దానం చేయించాడు గ్రహశాంతి కోసం.

ఆ ఇంట్లో శ్రీవల్లి తాలూకు జ్ఞాపకాలు బాధిస్తున్నా సత్యమూర్తి ఇల్లు మార దలచుకోలేదు, శ్రీవల్లి ఆ ఇంటికి ఎప్పటి కయినా తిరిగి వస్తుందని.

సత్యమూర్తి అక్కయ్య నెల రోజులు దగ్గరవుండి తమ్ముడికి రకరకాలుగా హిత బోధలు చేసింది మనసు నిబ్బరంగా వుంచుకోమనీ, బాధపడవద్దనీ.

సత్యమూర్తి శ్రీవల్లిమీద నుంచి ధ్యాస మళ్ళించడానికోసం తీరిక సమ యాలు లేకుండా పనిలో మునిగిపో సాగాడు. లేదా పుస్తకాలు చదువుకో సాగాడు తీరిక చిక్కితే.

యిదివరకటిలా నవలలు చదవడం లేదు. ఇప్పుడు లైబ్రరీలో మతానికి సంబంధించిన సెక్షన్‌లోవున్న వివిధ గ్రంథాలు చదవసాగాడు ఇంటికి కూడా తెచ్చుకుని.

భగవద్గీతకి, తాత్పర్య వివరణలతో కూడిన ఇంగ్లీషు అనువాద పుస్తకం కొన్నాడు. రోజూ నిద్రలేవగానే మొహం కడుక్కున్న తర్వాత ఓ అరగంట ఆ పుస్తకం చదవడం అభ్యాసంగా చేసు కున్నాడు.

ఉదయం, రాత్రి సంధ్యావందనం వారుస్తున్నాడు. గాయత్రీ మంత్రం ఓపి కున్నంత సేపు జపిస్తున్నాడు సాయం సంధ్య చేసేటప్పుడు.

రోజూ ఉదయం ఆఫీసు కెళ్ళేదాకా ఆదిత్యహృదయం స్తోత్రం చేస్తున్నాడు. రోజూ శ్రీవల్లి తను కలిసి తీయించు కున్న ఫోటో మాత్రం తన పక్కలో పెట్టుకుని నిద్రపోతాడు.

కూతురు సత్యవల్లి ఫోటోలన్నీ ఆల్బంలోంచి తీసి ముక్కలు ముక్కలుగా చింపిపారేసాడు.

క్రమంగా సత్యమూర్తి శ్రీవల్లి దూరమయిన బెంగనుంచి కోలుకో సాగాడు.

అక్కయ్య వెళ్ళబోయేముందు ఓరోజు అడిగింది సత్యమూర్తిని.

"ఇల్లు అమ్మిన డబ్బు ఏంచేశావ్?"

"బేంక్‌లో వేసాను శ్రీవల్లి పేరు మీద."

"శ్రీవల్లి పేరుమీదా? అదేం?"

"ఊరికెనే. ఎవరి పేరయితే ఏంలే అని దాని పేరుమీద వేసాను. దానికి నే తప్ప పుట్టింటివైపు వాళ్ళెవరూలేరు. చిన్నప్పటినుంచి మారుతల్లి రాచి రంపాన పెట్టింది. నాకేమయినా అయితే ఆ మారు తల్లి ఇంటికి చేరకుండా తనబ్రతుకు తాను బ్రతుకుతుందనే వుద్దేశంతో దానిపేరనే వేసాను."

7ఇప్పుడు నీ పేర మార్పించుకో రాదూ?"

"అది సంతకం పెడితే కాని అలా వీలుకాదు."

"అంటే ఇంక ఆ ఎనభై అయిదు వేల రూపాయలకీ నీళ్ళు వదులుకోవాల్సిందేనా?"

"అలాగేవుంది చూస్తూంటే."

"ఏంచేస్తే ఆ డబ్బు తిరిగివస్తుంది?"

"శ్రీవల్లి సంతకంపెడితే."

"ఇంకోమార్గంలేదా?"

"లేదు. బేంక్ ఏజంట్ చెప్పాడు మొదట్లోనే ఇద్దరిపేరా కలసి వేసుకుని వుంటే బావుండేదని. అప్పట్లో ఆ సంగతి నాకు తెలియలేదు."

"బట్టతల వచ్చాక దువ్వెన చేతిలోకి వచ్చినట్లుగా."

"కొండంత మనిషేపోగా లేంది ఈ పాడు డబ్బో లెక్కా? ఇరవై వేల రూపాయల నగలు పోలేదా ఆ మనిషివెంట?"

జాలిగా చూసింది సత్యమూర్తి అక్కయ్య.

"ఏంచేస్తాం చెప్పు. నాకిలా రాసాడు దేముడు. అందుకే ఇలా అయింది."

సత్యమూర్తి అక్కయ్య కళ్ళలోనీళ్ళు తిరిగాయి. నెమ్మదిగా ఏడవసాగింది ఏడుపును ఆపుకునే ప్రయత్నం చేయకుండా.

"దేనికక్కా? నిండయిన మనిషి పోయినప్పుడే నేను ఏడవలేదు. వెధవ డబ్బుకోసం ఎందుకా ఏడుపు?"

"మాయదారి దేముడు నిన్ను పూర్తిగా వగా చేసేసాడురా" అన్నది.

"నావల్ల ఆయన కావిధంగా సంతోషం కలిగినా మంచిదేగా" అన్నాడు సత్య



ఇదేదో మోడ్రన్ ఆర్ట్ అనుకునేరు. ఇది ఎనిమిదవ శతాబ్దంనాటి మన ప్రపంచ మ్యాప్! ఆనాటి నావికులు ప్రపంచ మ్యాప్‌ను యీ విధంగా గీశారు. దీన్ని "మెరోవింగియన్ మ్యాప్" అంటారు!

మూర్తి దిగులుగా నవ్వి.

"నేను రాజమండ్రి వెళ్దామనుకుంటున్నాను ఎల్లుండి."

"రిజర్వ్ చేయిస్తాను రైల్లో."

"నువ్వూ వస్తావా?"

"శెలవ్ లేదు."

"నువ్వు వంటరిగా వుండటం నాకు నచ్చలేదు."

"నా జీవితంలో నాకు చాలా నచ్చలేదు. ఏంచేయను?"

సత్యమూర్తిని బాధపెట్టడం ఇష్టంలేక ఆవిడ ఇంక మాట్లాడలేదు ఆ విషయం.

సత్యమూర్తి అక్కయ్య వెళ్ళిపోయింది.

సత్యమూర్తి జీవితంలో మార్పేమీ రాలేదు, మరో రెండున్నర సంవత్సరాల దాకా.

నివాసంలో కూడా.

# 10

ఉత్తరం చూసుకుని రాజమండ్రీ వెళ్లాడు సత్యమూర్తి. బావ వుద్యోగం లోంచి రిటైర్ అయి ఏడాది అయింది. ఆయన అడిగాడు సత్యమూర్తిని.

"నీకు సంబంధాలు వస్తున్నాయి. పెళ్ళి చేసుకోకూడదూ?"

"పెళ్ళా?" అన్నాడు పొడిగా.

"అవును . నీకు చెప్పలేదు. కాని శ్రీవల్లి గురించిన విచారణ ఆపేస్తున్నామని నాకు వుత్తరం వచ్చింది చాలాకాలం క్రితం విజయవాడ పోలీస్‌స్టేషన్ నుంచి."

"నాకు నమ్మకం చచ్చిపోయింది. ఇక శ్రీవల్లిని ఈ జన్మలో చూడలేను బహుశ. ఎక్కడవుందో ఏం బాధలు పడుతుందో? ఏనాటికయినా రావచ్చనే ఆశకూడా చచ్చిపోయింది. నా జీవితంలో వెలుగులేదిక."

"శ్రీవల్లి చోటుని ఇంకో అమ్మాయి పొందలేదు బహుశ. కాని ఇంటికిరాగానే ఇంత కాఫీచుక్క ఇచ్చి ఆప్యాయంగా పలకరించడానికి, ముందు ముందు చెయ్యి వంగినా కాలువంగినా చూసుకోడానికి, నీ ఇంట్లో మసలుతూ నీ బాగోగులు చూసుకోడానికి ఓ అండ, ఓ తోడువుండాలి."

సత్యమూర్తి మౌనంగా వుండిపోయాడు.

"అంతేకాదు. ముందు ముందు పిల్లలు పుడితే నీలోనూ కాస్త వుత్సాహం కలుగుతుంది."

"చేసుకోరా. నీకేమంత వయసు మించిపోయిందని? నీ స్నేహితులు నీ ఈడువాళ్ళకి ఇంకా చాలామందికి పెళ్ళిళ్లే కాలేదు" అన్నది సత్యమూర్తి అక్కయ్య.

"చెప్పు. నువు 'ఊ' అను చాలు" అన్నాడు బావ.

"నాకు ఆశాలేదు. నిరాశలేదు. కోరిక లేదు. విచారంలేదు" చెప్పాడు దిగాలుగా నవ్వి.

* * *

పెళ్ళిచూపుల గురించి ఆట్టే వుత్సాహం చూపించలేదు సత్యమూర్తి. అతని అక్కయ్యే సంబరపడింది తమ్ముడు వప్పుకున్నందుకు.

ఇద్దరు ముగ్గురు పిల్లల్ని చూసి హైద్రాబాద్ వెళ్ళిపోయాడు. వెళ్ళబోయే ముందు అడిగింది అక్కయ్య.

"ఎవరు నచ్చారు?"

"నీ కెవరు నచ్చితే వాళ్ళు నాకు నచ్చినట్లే" చెప్పాడు.

"అలాకాదు. నీ సంగతి చెప్పు."

"నాకు ఎవరయినా ఒకటే. ప్రత్యేకంగా ఎలాంటి అభిప్రాయంలేదు."

"ప్రియంవదని ఓ పిల్లవుంది. చిన్నప్పుడే తల్లి పోయిందిట. అందరిలోకి బావుంది. చూడటానికి బుద్ధిమంతురాలిలా వుంది శ్రీవల్లికన్నా బావుంటుంది."

సత్యమూర్తి ఓసారి అక్కయ్య మొహంలోకి చూసాడు. చాలా కొత్తగా వుందా చూపు ఆవిడకి. ఆ చూపులో ఏ భావం కనపడలేదు ఆవిడకి.

"శ్రీవల్లిని నేనే కాదు, ఎవరు చేసుకుని వుండినా, శ్రీవల్లిని మించిన అందగత్తెలు ఎంతమంది లభ్యమైనా శ్రీవల్లినే కోరుకుంటారు కాని ఇంకెవరి వైపు మొగ్గరు."

సత్యమూర్తి కంఠంలో బాధ స్పష్టంగా ధ్వనించింది. (ఇంకా వుంది)

# పాకుడుబంధం

## పోల్కంపల్లి శాంతాదేవి

బస్సులో ఆరుగంటలు ప్రయాణంచేసి బస్సు దిగి ఆటోలో ఇంటికి వచ్చేసరికి కొత్త పెళ్ళి కూతురు జయలక్ష్మి తోటకూర కాడలా వేలాడి పోయింది!

మురళీధర్ తాళంతీసి సామాను లోపలికి చేర్చాడు.

అంత అలసటలోనూ తాను కాపురముండ బోయే ఆ అద్దె ఇంటిని కుతూహలంగా చూచు కొంది జయలక్ష్మి. ఇరుకుగా ఉన్న రెండు గదులు. వెనుక ఉన్న కాస్త పెరడూ పక్క పోర్షన్ వాళ్ళు కూడా పంచుకొంటారు. బాత్ రూం, లావెట్రీ కంబైండ్!

"చిన్నదైనా కాస్త అన్నిటికీ సెపరేట్‌గా ఉండేలా తీసుకోకూడదా ఇల్లు."

"ఇది హైదరాబాద్, డియర్! ఈ మాత్రం పోర్షన్ సంపాదించేసరికి నా తాతలు దిగివచ్చారు! నాకొచ్చే ఆరు వందల జీతంలో ఈ పోర్షన్ నూట ఏభై రూపాయల్ని మింగేస్తుంది!"

బ్రహ్మచారిగా ఉన్నప్పుడు మురళీధర్ తన ఫ్రెండ్సుతో కలిసి ఒక రూంలో ఉండే వాడు. మెస్సులో తినేవాడు. వారం రోజుల క్రితమే జయలక్ష్మితో అతడికి వివాహం జరి గింది. అప్పటి కప్పుడు ఈ పోర్షన్ అద్దెకు తీసుకొని భార్యను కాపురానికి తీసుకువచ్చేశాడు.

మరునాడు.

తన అభిరుచి కనుగుణంగా ఇంట్లో సామాను సర్దుకొంది జయలక్ష్మి. పక్కింటి రుక్మిణితో పరిచయం ఏర్పరుచుకొంది.

సాయంకాలం స్నానంచేసి తెల్ల చీరకట్టు కొని, తల్లో మల్లెపువ్వులు పెట్టుకొని భర్త కోసం నిరీక్షించసాగింది. ఆఫీసునుండి తిన్నగా వచ్చేస్తే ఆరుగంటలకల్లా వచ్చేయాలి ఆయన!

ఆరు దాటింది. ఏడు దాటింది. మురళీధర్ రాలేదు.

జయలక్ష్మి కాలుగాలిన పిల్లిలా అటుఇటు తిరుగుతూనే అన్నం వండేసింది. వీక్లీలు, మంత్లీలు తిప్పేసింది. విసుగొచ్చి అవి ఓ పక్కన విసిరేసి టైం చూసింది. పదిదాటి పోయింది!

ఆయన ఎందుకు రాలేదు? కొత్తగా కాపురం పెట్టిన జంట? తనకుండే ఆత్రుత ఆయనకి లేదా?

కడుపులో ఆకలి చురుక్కు మనసాగింది. కళ్ళమీదికి నిద్ర తూగసాగింది.

తలుపుమీద టకటక కొట్టిన శబ్దం, 'జయా' అన్న పిలుపూ వినవచ్చాయి.

జయలక్ష్మి తలుపు తెరిచి, "మీకు పెళ్ళ యిందని, ఇంట్లో మీకోసం నిరీక్షించే భార్య ఉంటుందని మరిచి పోయారులా ఉంది!" అంది నవ్వుతూ.

"మరిస్తే ఇంటికెలా వస్తాను?"

ముద్దగా వస్తూన్న ఆమాట, కాస్త ఉబ్బి నట్టుగా ఉన్న ఆ కళ్ళు చూసి గతుక్కుమంది జయలక్ష్మి. "తాగారా? మీకు తాగుడు అల వాటుందా?"

భర్తను భార్య అడుగుతున్నట్టుగా కాక భర్త భార్యను అడుగుతున్నట్టుగా దబాయిం పుగా వినిపించింది ప్రశ్న! చిరాకుతో ముఖం చిట్లించుకొన్నాడు మురళీధర్. కొత్తపెళ్ళాంతో ఇప్పుడే దెబ్బలాట తెచ్చుకోవడం ఇష్టంలేక తన చిరాకును కప్పిపుచ్చుకొని శాంతంగా జవా బిచ్చాడు. "మా ఫ్రెండొకడు ట్రాన్సఫరై

వెళ్ళిపోతున్నాడు, పార్టీ ఇచ్చాడు."

జయలక్ష్మి మరోమాట మాట్లాడకుండా కంచాలు పెట్టడానికి వెళ్ళింది.

"నువ్వింకా తినలేదా? తినాల్సింది! నేను తినివచ్చాను. నువ్వు త్వరగా తినేసి వచ్చెయ్యి?"

బూట్లు విప్పి మూలకి తన్నేసి గుడ్డలుకూడ మార్చుకోకుండా పక్కమీద పడ్డాడు. తెల్లటి పక్కమీద గుబాళిస్తూ మెత్తగా ఒంటికి తగి లాయి మల్లెపువ్వులు! కళ్ళమీదికి ముంచుకు వస్తూన్న మత్తును బలవంతంగా పక్కకి నెడుతూ భార్యకోసం ఆత్రుతగా నిరీక్షించ సాగాడు.

జయలక్ష్మి వచ్చింది.

"అప్పుడే భోజనం అయిపోయిందా? అయిదు నిమిషాలుకూడా కాలేదు!"

"ఊహుఁ, నేను తినలేదు."

"ఎందుకు?"

"ఇక ముందెప్పుడూ మీరు నన్ను ఇంట్లో ఆకలికి వదిలేసి బయట మెక్కిరాకుండా— మీకిది శిక్షగా ఉండాలని!"

అతడు మాట్లాడలేదు. క్షణం ఆలస్యం కావడం సహించలేనట్టుగా జయలక్ష్మిని చెయి పట్టి మీదికి లాక్కున్నాడు. అతడి కౌగిలిలో, ముద్దులతో జయలక్ష్మికి ఊపిరాడనట్టుగా



అయింది. అతడి నోట్లోంచి వస్తూన్న వాసనకు డోక్కున్నంత పనిగా ఉంది!

అన్నం తిననందుకు తనను ప్రాధేయపడతాడని, తన కోపం పోగొట్టడానికి ప్రయత్నించి తనచేత అన్నం తినిపిస్తాడని జయలక్ష్మి ఊహ పూర్తిగా తలక్రిందులై పోయింది.

మురళీధర్ తనకోరిక తీర్చేసుకొని పక్కమీద గుర్రుపెట్టసాగాడు.

జయలక్ష్మి కళ్ళ నిండా నీళ్ళు!

ఆరువందల జీతం తెచ్చుకోవడం, అబ్బాయి అందంగా ఉండడం ఇది చూడగలిగిన తలిదండ్రులు పదివేల కట్నమచ్చి, అయిదువేలు లాంఛనాలిచ్చి, పైన అయిదువేలు ఖర్చుపెట్టి పెళ్ళి చేశారు, ఇహ అమ్మాయి సుఖపడిపోతుందని. కనిపెంచినందుకు మంచిచోట ఇచ్చామని తృప్తిపడిపోతుంటారు!

కాపురానికి వచ్చి నిండా రెండు రోజులు కాలేదు. అప్పుడే తన కాపురంలో చిన్న అగ్నికణం పడింది! రాజుతోంది!

* * *

రాత్రి పన్నెండు గంటలవుతోంది.

వీధి తలుపు తెరిచి గడప మెట్టుమీద భర్త రాకకోసం నిరీక్షిస్తూంది జయలక్ష్మి.

పక్కింటి రుక్మిణిచూసి, "ఇంత రాత్రివేళ తలుపు తెరుచుకు కూర్చోవడం ఏమిటి జయా? నువ్విలా తలుపు తెరిచి కూర్చోకపోతే వచ్చినవాడు ఇంట్లోకి రాకుండా వెనక్కి వెళ్ళిపోరాదా? ఇంతరాత్రివ్పుడు తలుపులు తీసి ఉంచడం క్షేమంకాదు. అలాపోయే వాడికి దుర్బుద్ధి పుట్టగలదు!" అంది.

"ఏం చేయను? పిచ్చెత్తినట్టు ఉంటుంది. పెళ్ళికాక ముందు వైవాహిక జీవితం గురించి ఎన్నికలలు కన్నాను! అందులో ఒక్కటైనా నిజం కాలేదు! నిజంగా యీ నరకాన్ని నువ్వు ఊహించలేవు, రుక్మిణీ!"

జయలక్ష్మి కళ్ళలో నీళ్ళు తిరగడం చూసి చలించింది రుక్మిణి. "నువ్వు ప్రతిరోజు అన్నం మానేసి నిరీక్షించి ఏం సాధిస్తున్నావు?"

"ఇద్దరికోసం వండుకొన్న అన్నాన్ని—ఆయన రాకుండా ఒక్కదాన్నీ తినాలంటే మనసొప్పదు! తనకోసం నేను అన్నం తినకుండా ఉంటానని తెలిసీకూడా ఆయన వేళకు రావడానికి ప్రయత్నించరు. అసలు ఆయనకు హృదయం అనేది ఒకటుందాని నాకు అనుమానం వస్తూంది!"

* * *

"ఇవాళ పిక్చర్ ప్రోగ్రాం వేసుకొందామండీ!"

"ఆ ప్రోగ్రాం ఏదో నువ్వే వేసుకో, జయా! సన్‌డే వచ్చిందంటే నాకెంత బిజీ! క్రితంసారి పోగొట్టుకొన్న రెండు వందలు తిరిగి సంపాదించుకోనిదే నాకు నిద్రపట్టదు!"

"ఒక్కదాన్ని పిక్చర్‌కి వెడితే ఏం ఉత్సాహం ఉంటుంది?" నీరు గారిపోయి అంది జయలక్ష్మి.

"పక్కింటావిణ్ణి పిలువు! కావాలంటే టికెట్ నువ్వే తీసుకో, ఆవిడకు కూడా."

"పక్కింటావిడ కబుర్లతో బోర్‌కొడుతుంది. పక్కింటాయన్ని పిలుస్తాను."

మురళీధర్ చెయి పైకి లేచింది.

"ఆ చెయి అక్కడే ఆగాలి. లేకపోతే, పెళ్ళాంతో తన్నులు తిన్న భర్తగా ఊరూవాడా ప్రసిద్ధులై పోతారు!"

"నీకెంత పొగరు?"

"మీకంటే తక్కువేదుగాని, నాకంటే తప్పా!"

"ఆడదానివి కాదు. పోట్లగిత్తవి!"

"ఆవులాగా సాత్వికంగా ఉంటే అరికాలి కింద అణిచి పెట్టరూ?"

"ఇప్పుడేదో మీజాతి పొడిచేస్తున్నట్టు!"

మురళీధర్ విసురుగా బయటికి వెళ్ళిపోయాడు.

అతడటు వెళ్ళగానే రుక్మిణి వచ్చింది.

"మళ్ళీ పోట్లాడుకొన్నట్టున్నారే?"

"రోజూ ఉండేదేగా? నాకిక్కడ నరకంగా ఉంది, రుక్మిణీ! మా ఊరికి వెళ్ళిపోదామనిపిస్తోంది."

"వెళ్ళినా మళ్ళీ రావలసిందేగా?"

"ఎందుకు రావాలి?"




"అదేం ప్రశ్న?" విడ్డూరంగా చూచింది రుక్మిణి. "మీవాళ్ళు నిన్ను ఎంతకాలం భరిస్తారు?"

"భరించకపోతే ఎందుకు కన్నారు?"

"కన్నందుకు పెళ్ళిచేసారు. అత్తారింటికి పంపేశారు. వారి బాధ్యత అక్కడితో తీరి పోయింది. అయినా నువ్వు కోపంతో అంటున్నావుగాని నువ్వు మాత్రం అక్కడ ఉండి పోగలవా? వారం రోజులయ్యేసరికి మీ ఆయన మీద మనసు పీకి పరిగెత్తుకు రావూ?"

"రాను." జయలక్ష్మి దృఢంగా అంది.

"బడాయి!" రుక్మిణి నవ్వింది. "పెళ్ళయిన ఆడదానికి అత్తవారింట్లో ఉన్నప్పుడే గౌరవాదరణలు లభించేది. భర్తను వదిలి ఉంటానంటే వాళ్ళే ఒక నరకం చూపుతారు."

"చూపనీ, ఈ నరకం కంటే ఆ నరకం నయమే."

"నువ్వు ప్రతిదాన్నీ సీరియస్‌గా తీసుకొనే దానిలా ఉన్నావు! మగవాళ్ళ బలహీనతలు కొన్ని మనం పట్టించుకోకూడదు. కొన్ని సర్దుకుపోవాలి. అదను చూసి వాళ్ళ ముక్కున తాడు వేయాలి!"

"నీ భర్త ఆరింటికల్లా ఇంటికి వస్తాడు. పిల్లలను ఆడిస్తాడు, ప్రతి ఆదివారం భార్యతో, పిల్లలతో సినిమాకో, షికారుకో వెడతాడు. ప్రతి ఆడదీ నిన్ను చూసీ ఈర్ష్యపడేలా ఉన్న అనురాగ దాంపత్యం నీది! నీకు నా బాధ అర్థం కాదు, రుక్మిణీ!

"నేను కాపురానికి వచ్చి నెలరోజులైంది. ఏ రోజూ ఆఫీసునుండి తిన్నగా ఇంటికిరాదు. ఏ పన్నెండింటికో వస్తారు. రాకపోతే అదీ లేదు. ఎవతింటిలో గడిపేస్తారో? కనీసం సెలవు రోజైనా ఆయనతో గడుపుదామంటే-ఆ రోజు ఇంకా ఎజీ! త్రాగుడూ, వ్యభిచారం, జూదం-సప్తవ్యసనాలంటారే—అన్నీ ఉన్న మహా పురుషుడు నా భర్త! ఈయన్ని మార్చుకోనడమనేది ఈ జన్మకాదు కదా, ఏ జన్మలోనూ సాధ్యంకాదు."

"రెండు సంవత్సరాల క్రితం నువ్వున్న స్థానంలో నేనున్నానంటే నువ్వు ఆశ్చర్యపోతావు,"

"నన్ను ఓదార్చడం కోసం నువ్వు ఏవో అబద్ధాలు కల్పించాల్సిన అవసరం లేదు!"

"అబద్ధాలు కావు, జయా! ఆరేళ్ళుగా మేం

# నేలతల్లి నవ్వింది

ప్రకృతి చేసే పరీక్షకు నిరంతరం గురయ్యే కరువు ప్రాంతాల ప్రజలకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం చేపట్టిన దుర్భిక్ష ప్రాంతాల సహాయ కార్యక్రమం ఒక వరప్రసాదం. మన రాష్ట్రంలో ప్రస్తుతం అనంతపురం, చిత్తూరు, కడప, కర్నూలు, మహబూబ్ నగర్, ప్రకాశం, నల్గొండ జిల్లాలలో ఈ కార్యక్రమం అమలుజరుపుతున్నారు.

చిరకాలంగా కరువుబాధ పడుతున్న ప్రాంతాలను బాగుచేయడంతో పాటు, బలహీన వర్గాల ప్రజలను అన్నివిధాల ఆదుకోవడం ఈ కార్యక్రమం లక్ష్యం.

ఈ కార్యక్రమం కోసం సహాయంగా 1978-79 లో 826 లక్షల రూపాయలు కేటాయిస్తున్నట్లు కేంద్రప్రభుత్వం సూచించింది. ఆ మొత్తానికి సమానంగా రాష్ట్రప్రభుత్వం యిచ్చే విరాళంతో ఈ కార్యక్రమాన్ని చురుకుగా అమలుజరపడానికి 1978-79 బడ్జెట్ లో 1652 లక్షల రూపాయలు కేటాయించారు.

కరువు కాటకాలతో ఎన్నో యిబ్బందులు పడే ప్రాంతాల ప్రజలలో ఈనాడు ఆనందోత్సాహాలు వెల్లివిరుస్తున్నాయి.

---

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సమాచార, పౌర సంబంధ శాఖ డైరెక్టరుచే ప్రకటితము.

7/78-79.



ఇదే పోర్షన్‌లో ఉంటున్నాము. ఎవరి నడిగినా చెబుతారు మా కథ. మీ ఆయన వ్యవహార మంతా బయట నడుస్తోంది: మా ఆయన మిత్ర బృందాన్ని ఇంటికే ఆహ్వానించేవారు. ఆడుతోంటే ఎంతరాత్రి అయిందీ వాళ్ళకు తెలివి ఉండేది కాదు. ఎంత డబ్బు పోయిందీ లెక్క ఉండేది కాదు: ఒక్కొక్కసారి తెల్లవారి పోయేది. నేను పిల్లలతో వంటగదిలో ముదిగి చచ్చేదాన్ని. టీ అని కేకేసి నప్పుడల్లా సర్వ ర్‌లా టీ అందించివచ్చి కూర్చునేదాన్ని. వాళ్ళ అరుపులకు, ఈలలకు నిద్రపట్టేది కాదు: నువ్వు ఒక్క నెలరోజులకే పుట్టింటికి వెళ్ళి పోతానంటున్నావు: నేను అయిదేళ్ళ తరువాత, ఇద్దరు పిల్లలు పుట్టిన తరువాత ఆ నిర్ణయానికి వచ్చాను. అప్పటికి ఒంటిమీది నగలన్నీ హరించుకు పోయాయి. అప్పులు పెరిగి పోయాయి. పిల్లలకి సుస్తీ అయితే మందిప్పిద్దాం అన్నా ఇంట్లో డబ్బుండేది కాదు: ప్రార్థించి, బెదిరించి, తిట్టి, ఏడిచి—ఎన్ని అవస్థలు పడాలో అన్నీపడ్డాను-దేనికీ లొంగని వారు నేను దూరమై పోతానంటే, పిల్లల్ని కూడా నాతో తీసికెళ్ళి పోతానంటే లొంగారు. ఆయనకి ఎంత జూద వ్యసనమున్నా నేనన్నా, పిల్లలన్నా చాలా ప్రేమ. ఒక్కరోజు కని పించకపోతే వుండలేక పోయేవారు. అలాంటిది నేను శాశ్వతంగా వెళ్ళిపోతున్నా ననేసరికి, ఇంకెప్పుడూ ఆడనని పిల్లలమీద ఒట్టేసు కొన్నారు: ఒట్టుకు కట్టుబడ్డారు. ఆటా గీటా అంతా బంద్: తిన్నగా ఇంటికి వచ్చేసి పిల్లలతో గడిపేస్తారు!"

"ఎక్కడిదో సినిమా కథ! అంత జూద వ్యసనమున్న మగవాడు ఒట్టుకూ కట్టుబడడూ, మరి దేనికీ కట్టుబడడు: ఇలాంటి మనుషులు మారుతారంటే నేను నమ్మను."

"స్త్రీకి సహనం అవసరం, జయా! సాధ్యమైనంతవరకు మగవాణ్ణి మార్చుకోడానికి ప్రయత్నించాలి!"

"ఎలా ప్రయత్నించాలి?"

"అతడికి నచ్చినట్టుగా ఉండి అతడి మనసు చూరగొనాలి! "

"ఈ పతివ్రతా ధర్మాలు నాతో చెప్పొద్దు: నాకు నచ్చినట్టుగా అతడు నడుచుకొంటున్నాడా? అతడికి నచ్చినట్టుగా నేను నడుచుకోవడానికి? ఏమిటి ఈ మగవాళ్ళ గొప్ప?" ఉద్రేకంతో అడ్డుపడింది జయలక్ష్మి. "అతడి మనసు ప్రయత్నించి పొందాల్సినంత అవసరం నాకేంలేదు: భార్య మనసు తెలుసుకోలేనివాడు, భార్య కనీసపు కోరిక తీర్చలేనివాడు అసలు పెళ్ళెందుకు చేసుకోవాలి? వంటకీ పంటకీనా?"

"ఇలా ఆవేశపడితే లాభంలేదు: ఏమిటి ఈ మగవాళ్ళ గొప్ప అని అంటున్నావు? ఏ గొప్ప తనం లేకుండానే పదివేల కట్నమిచ్చి కొన్నావా మీ ఆయన్ని?"

"మావాళ్ళకు బుద్ధిలేదసలు!"

"అలా బుద్ధిలేనివాళ్ళు చాలామంది ఉన్నారు ఈ ప్రపంచంలో!"

* * *

కొడుకు దగ్గర నాలుగు రోజులుండి పోవాలని వచ్చింది జయలక్ష్మి అత్తగారు చంద్రావతమ్మ. కొడుకు నడతా, కోడలి ధోరణీ ఆవిడ ఒక్క రోజులో పసిగట్టింది!

"పెళ్ళయితే నన్నా వీడు మారుతాడను కొంటే ఏమీ మారలేదన్నమాట!" అని సణగడం మొదలు పెట్టింది.

"మీ కొడుకు తిరుగుబోతూ, తాగుబోతూ అని తెలిసికూడా ఒక ఆడపిల్ల గొంతుకోయ డానికి మీ మనసు ఎలా అంగీకరించింది?" జయలక్ష్మి ప్రశ్నించింది."

"మార్చుకోవడం చేతగాక నన్నంటావేం? ఈ లోకంలో ఎంతమంది తాగడంలేదు! తిరగడంలేదు?" అత్తగారు గొంతు పెంచింది.

"పాతికేళ్ళు పెంచిన వారు మీ కొడుకును మార్చలేదుగాని ఇప్పుడువచ్చి నేను మార్చలేదంటారేం? మార్చుకోవాలి! మార్చుకోవాలి. మార్చుకోవాలి! ఎవరు చెప్పినా ఇదే డైలాగు: అదేదో సినిమాలో సావిత్రి సాని కొంపపట్టుకు వదలని తన తాగుబోతు మగడికోసం వేషం వేసుకొన్నట్టుగా సానిదానిలా వేషం వేసుకోనా?

అతడికో గ్లాసు తాగించి, నేనో గ్లాసు తాగి "ఇలా ఉండిపోనీ నీదాసినై' అని ఓపాట పాడనా? అలా చేసినా జగ్గయ్యలా హఠాత్తుగా మారిపోవడానికి ఇది సినిమానా, అత్తగారూ?"

"ఆడదానికి ఇంత పెడసరితనం పనికిరాదు!"

"పనికివచ్చేదేమిటి? మెతకదనమా? కలసి సినిమాకు వెళ్ళాలన్న కనీసపు కోరిక తీర్చలేని మగవాడి కోసం నన్నేం చేయమంటారు? ఏం త్యాగం చేయమంటారు?"

"పాతకాలపు దాన్ని! నాకీ నవలల మాటలు అర్థం కావు, తల్లీ!"

"ఇవి నవలల మాటలు కావు! నా గుండె మండి వస్తూన్న మాటలు' ఎన్ని కలలతో భర్త ఇంట అడుగు పెట్టాను! నాకు ఎదురైందేమిటిక్కడ? భార్య అనే దానికి ఒక మనసుంటుందనీ, కోరిక లుంటాయనీ, అవి తీర్చవలసిన బాధ్యత తనమీద ఉంటుందని తెలిసినా పట్టనట్టుండే భర్తతో కాపురం' కోరికలు తీర్చకపోతే మానె! కనీసం ఒక గంట సరదాగా నాతో కబుర్లు చెప్పుకొన్న పాపాన పోయారా? ఆయన మనసెప్పుడూ తన వ్యసనాలమీద ఉంటుందాయె!"

ఏనూ ఆడదే కనుక కోడలిబాధ అర్థం చేసుకొన్న చంద్రావతమ్మ కొడుకును మందలించింది— "ఎప్పుడూ ఆ తిరుగుళ్ళేమిటిరా?" అని.

"మగవాడిని. తిరుగుతాను! ఇంట్లో పెళ్ళాం కొంగుపట్టుకు కూర్చుంటే వచ్చేదేమిటి?"

భర్త సమాధానానికి మండిపడింది జయలక్ష్మి. "సంసారానికి నిండుదనం! ఆలుమగల అనుబంధానికి ఒక అర్థం!"

"నీ వెంట సినిమాలకూ, షికార్లకూ తిరిగితే సంసారానికి నిండుదనం వస్తుందా?"

"సినిమాలకూ, షికార్లకూ అక్కరలేదు. అవి లేకుంటే నా ప్రాణం ఏం పోదు! మీ సమయాన్ని కనీసం కొన్ని గంటలయినా నా కోసం ఉపయోగించలేరా? మిమ్మల్ని తిరుగొద్దని నేను ఆంక్ష పెట్టడంలేదు. ఆ తిరుగుడికి ఒక హద్దు ఏర్పరుచుకొమ్మని కోరుతున్నాను!"

"నన్ను తిరుగొద్దని, హద్దులో ఉండమని చెప్పడానికి నువ్వెవతివి!"

"ఎవతెనో అయితే నాకేం పట్టింది? భార్యని కనుక చెప్పాల్సి వస్తోంది!"

ఈ గొడవలో నేనెందు కనుకుందేమో వారం పదిరోజులుండాలని వచ్చిన చంద్రావతమ్మ నాలుగు రోజులకే వెళ్ళిపోయింది. వెడుతూ కోడలికి హితవు చెప్పింది. "మగవాళ్ళకి మాటకి మాట ఎదురు చెబితే రెచ్చిపోతారు. కాస్త సౌమ్యంగా ఉండి వాడిని దారికి తెచ్చుకో! పంతాలకీ, పట్టుదలలకీపోతే నీ కాపురమే చెడుతుంది!"

* * *

జయలక్ష్మి వాళ్ళ ఇంటికి నాలుగిళ్ళవతల కుమారి అనే ఆవిడ ఒంటిమీద కిరోసిన్ పోసుకొని కాల్చుకొని చచ్చిపోయింది. కారణం భర్త వ్యసనాల్నీ, వాటివల్ల సంసారానికి పట్టిన దరిద్రాన్నీ, అవమానాన్నీ భరించలేక!

"ఒక రోజు నేనూ అదే పనిచేస్తానేమో!" జయలక్ష్మి అంది భర్తకి వినిపించేలా!

మురళీధర్ ఏమనుకొన్నాడో ఆ రోజంతా బయటికి వెళ్ళలేదు. మరునాడు పొద్దుటే ఈ రోజు తొందరగా వంటముగించు. భోజనం చేసి షాపింగ్‌కు వెడదాం!" అన్నాడు.

ఏం కొనాలి? ఏం చేయాలి? అన్న ప్రశ్నలేవీ వేయకుండా జయలక్ష్మి వంట ముగించింది. భోజనాలయ్యాయి.

"మరీ మూగబొమ్మలా అయిపోయావేమిటి ఈ మధ్య? నీ మౌనం కంటే నువ్వు పోట్లాడుతుంటేనే బాగుంటుంది నాకు!" షాపింగ్ ముగించుకొని ఇంటికి వచ్చాక అన్నాడు మురళీధర్. మరునాడు పండుగకు జయలక్ష్మికి చీరా, బ్లవుజ్‌పీస్ తేద్దామనే భార్యను తీసుకు వెళ్ళాడు. చీర సెలెక్షన్ తనమీదే వదిలేసి దిక్కులు చూస్తూ నిల్చుంది. ఆమె తనమాటకు మాట ఎదురు చెప్పడంవల్ల ఎంతకోపం తెప్పించేదో ఈ మౌనం రెట్టింపు బాధను కలుగజేస్తోంది! జయకి మనసు బాగాలేదు! అది తన




ప్రవర్తనవల్లే; తను స్నేహితులలో, ఆటలతో, తాగుళ్ళతో బయట గడిపేస్తూ ఉంటాడు! జయకేముంది ఇంట్లో? తన కోసం కాచుకు కూర్చోవడం తప్ప! తను కొంచెం తన వ్యసనాలని వదిలించుకోవాలి! ఆమె దగ్గర ఎక్కువ కాలం గడపడానికి ప్రయత్నించాలి! జయ తన నుంచి కోరేది అదేగా? మురళీధర్ అలా నిశ్చయం చేసుకొన్న క్షణంనుండి జయలక్ష్మిలో ఏర్పడిన ఈ మూగతనాన్ని, జడత్వాన్నీ వదల్చడానికి ప్రయత్నించసాగాడు కబుర్లతో, జోకులలో!

మనినాడు పండుగ భోజనం సుష్టుగా పట్టించి "గిన్నెలు వచ్చాక కడుక్కోవచ్చు' త్వరగా తయారవ్వు!" అన్నాడు.

"ఎక్కడికి?"

"మాట్నీ షో. ఆలుమగలు!"

పదినిమిషాల్లో తయారయింది జయలక్ష్మి.

కొత్త చీరలో అందంగా మెరిసిపోతున్న ఆమెను చూసి వివశుడయ్యాడు మురళీధర్. కౌగిలిలోకి తీసుకొని గుండెలకు గట్టిగా అదుముకొన్నాడు. "ఇవాళ చాలా అందంగా కనిపిస్తూ నన్ను పిచ్చివాణ్ణి చేస్తున్నావు, జయా! ఆ మాట్నీ షో మానేసి ఇంట్లో మాట్నీ షో మొదలు పెడదామనిపిస్తోంది!"

"ఛీ! మీకెప్పుడూ అదే ధ్యాసా? చీరంతా ముడుతలు పడేలా చేశారు!" ముద్దుగా గొణుగుతూ విడిపించుకొంది జయలక్ష్మి.

"చూడు! ఇప్పటినుండి నేను స్నేహితుల్ని, అన్నిటినీ వదిలించుకొంటాను. నీతోడిదే నా లోకంగా మార్చుకొంటాను' నువ్వు ఈ రోజులాగే సంతోషంగా ఉండాలి! కోపంవస్తే మాట్లాడు! నాకేం కోపంలేదు!"

"తాగుబోతుల మాటలు ఇలాగే ఉంటాయి!"

"నీ మీద ఒట్టు! రేపటినుండి చూడు ఆఫీసు నుండి తిన్నగా ఇంటికి వచ్చేయకపోతే? నీతో కబుర్లు చెప్పుకొంటూ గడిపేస్తాను!"

"అంతకంటేనా?" జయలక్ష్మికి గాలిలోకి తేలిపోతున్నట్టుగా అనిపించింది. ఆమె తాళం కప్ప తీస్తూండగానే వీధి తలుపుమీద టకటక శబ్దం వినిపించింది.

మురళీధర్ తలుపు తీశాడు.

"ఇంట్లో ఏం చేస్తున్నావోయ్ మొన్నటి నుండి? రాజారావింట్లో ఆట మహాజోరుగా సాగుతోంది. నువ్వు రానందుకు మాకు పెద్ద

లోటుగా ఉంది! అసలు మజానేలేదు! నిన్ను లాక్కురమ్మని రాజారావు ఆజ్ఞ!" అన్నాడు వచ్చిన మిత్రుడు.

"మా వైఫ్‌తో సినిమాకు వెడుతున్నానే!"

"సాయంత్రం రాజారావు పార్టీ."

ఆ తరువాత మాటలు వినిపించలేదు జయలక్ష్మికి. అయిదు నిమిషాల తరువాత "జయా! తలుపేసుకో" అన్న భర్తమాట వినిపించి పాతాళంలోకి క్రుంగిపోతున్నట్టుగా అనిపించింది.

దుఃఖం. కసి. కుమారిలా ఒంటిమీద కిరోసిన్ పోసుకు చచ్చిపోదామనిపించింది. తను చస్తే నెల తిరక్కుండానే మళ్ళీ పెళ్ళికొడుకు అవడూ! ఆ వచ్చిన దానికి మళ్ళీ ఇదే గతి పట్టదూ? పుట్టింటికి వెళ్ళిపోతే? రుక్మిణిమాట యదార్థం అవుతుంది. చివరికి పుట్టింటి ఆదరణను కూడా కోల్పోయిన దవుతుంది!

తనకి ఉద్యోగంవచ్చే చదువుంది. ఉద్యోగం ఇప్పించే స్నేహితులున్నారు. ఉద్యోగస్తురాలౌతే సమస్య తీరిపోయినట్టేనా? తనను చుట్టుముట్టే వంటరి తనాన్ని ఏం చేయాలి? మళ్ళీ ఈ మగాడి దగ్గరికే పరిగెత్తుకు రావాలా? అప్పుడూ రుక్మిణి మాటే నిజమౌతుంది! ఈ సమాజంలో మగవాడికి ఒన వంటరితనాన్ని పోగొట్టు కోవడానికి లక్షమార్గాలున్నాయి. కాని, ఆడదానికి తాళికట్టిన మగడు తప్ప మరో మార్గంలేదే!

ఎవరు సృష్టించారీ నీతిని?

ఎవరు ఏర్పరిచారీ కట్టుబాట్లను?

కట్టుబాట్లు మనిషి మనుగడకు సుస్థిరత్వాన్ని ఏర్పరిచేవే అయితే అవి స్త్రీపురుషులకు సమానంగా ఎందుకులేవు?

సంప్రదాయాలు సంకెళ్ళుగా మారినప్పుడు వాటిని త్రెంచుకొని మనిషి స్వేచ్ఛాజీవి కావ

డంలో తప్పేముంది?

జయలక్ష్మి ఆవేశంతో ఒక నిర్ణయానికి వచ్చేసింది.

తనీ సంసారం చేయదలుచుకోలేదని, వెళ్ళిపోయి తన బ్రతుకు తాను బ్రతుకగలనని ఒక చీటీ వ్రాసి టేబిల్ మీద పెట్టేసి, సూటుకేసు సర్దుకొని ఇంటికి తాళం పెట్టి ఆయనవస్తే తాళం చెవి ఇమ్మని చెప్పడానికి రుక్మిణి దగ్గరికి వెళ్ళింది.

జయలక్ష్మి నిర్ణయం విని రుక్మిణి అంది: "చాలా తొందరపాటుతో కూడిన ఆలోచన. జయా! ఇలాంటి విషయాల్లో ఆడది సహనం చూపడం నామోషీగా, అబలత్వంగా, బానిస లక్షణంగా ఎందుకు భావిస్తున్నావు? వెళ్ళిపోయి నీ బ్రతుకు నువ్వు బ్రతకడంతో తీరిపోతాయా సమస్యలు? మురళీధర్ నీ భర్త కాదనుకొందాం మాట వరుసకి! ఇంకెవరో! అతడు త్రాగుబోతూ—నీ మాటప్రకారం సప్త వ్యసన పరుడూ! ఇలాంటి వ్యసన పరులింకా ఈ సమాజంలో ఇంకా ఎంత మందిలేరు? అనాగరికుడు కల్లు పాకలో దూరి సీసాలు కాళీచేస్తే నాగరికుడు బార్ కెళ్ళి జేబు కాళీ చేసుకొంటాడు! కంపెనీ కోసం అంటూ దాని కొక ముద్దుపేరు పెట్టుకొంటాడు! మొత్తానికి ఇద్దరూ ఇల్లూ, ఒళ్ళూ గుల్ల చేసుకొంటారు! ఇంటిని నరకంగా మారుస్తారు! అంతమాత్రంచేత తాము చేస్తున్న పని తప్పని తెలియకపోదు వీళ్ళకు. ఆ దారి నుండి వెనుకకి మరలాలనీ అనుకోకపోరు! కాని, వాళ్ళు నిలబడింది పాకుడు పట్టిన బండ! పాకుడు బండమీద నిలబడిన మనిషి అడుగులు ఎటు జారితే అటు పోవలసిందేగాని తా ననుకొన్నట్టుగా నడవలేడు! ముందు అతడిని ఆ పాకుడుబండ మీదినుండి ఇవతలికి లాగాలి! అప్పుడుగాని అతడి స్వాధీనంలో అతడుండడు!

"అతడు నీ భర్తగా మరిచిపోయి ఒక మనిషిగా మాత్రమే గుర్తుంచుకొని అతడిని సంస్కరించడానికి సంసిద్ధురాలివి కావాలి! అతడిని సంస్కరించి నీ వాణ్ణి చేసుకొన్నప్పుడు నువ్వు గొప్పదానివి అవుతావుగాని, 'నే నీ కాపురం చేయలేను నా ఇష్టం వచ్చినట్టు నేను బ్రతుకు తాను' అని వెళ్ళిపోవడంలో వ్యక్తి స్వేచ్ఛ కాక నీ స్వార్థమే అగపడుతోంది నాకు!"

"నిజంగా వీళ్ళు నిల్చున్నది పాకుడు బండచే. వీళ్ళని ఇవతలికి లాగడం ఎవరికి సాధ్యం" జయలక్ష్మి నిస్పృహగా అంది.

"సహనవంతులకి! నీ తెలివి తేటల్ని ఇందుకు ఉపయోగించు, సమానత్వం కోసం దెబ్బలాటకి కాక ఇలాంటి మనుషులను సంస్కరించి ఒక మనిషిగా తీర్చిదిద్దగలిగిన రోజు నిజంగా నువ్వు గర్వపడాల్సింది! ఇప్పుడు కాదు. నువ్వు వెళ్ళిపోకు, జయా! అడ్డుపెట్టే వాళ్ళు లేకపోతే అతనింకా చెడిపోతాడు!"

జయలక్ష్మి అంతరంగంలో సూటిగానే నాటాయి రుక్మిణి మాటలు!

తాళంచెవి తిరిగి వెనక్కి తీసుకొని ఉమ వాటాకేసి నడిచింది.

జయలక్ష్మి ముఖంలో ఇప్పుడు ఆ అలజడీ, అశాంతీలేవు. □

---

## అప్పు

తీరని అప్పు
ఆరని నిప్పు
తెచ్చును ముప్పు
కాదంటావా, నీవే చెప్పు?

—ఇ. ఎల్. నారాయణ

# పుట్టలోని చెదలు

## ద్విభాష్యం రాజేశ్వరరావు

దశరధరామయ్యగారు బాధగా మంచంమీద కదిలేరు. పొత్తి కడుపులో ఆరంభమయిన మంట కార్చిచ్చులా వ్యాపించి గుండెల్ని దహిం చేస్తున్నట్లు అనిపిస్తోంది. బాధ భరించలేక రెండు నిమిషాలు మెలికలు తిరిగిపోయారు.

"ఏమండీ! మళ్ళీ నొప్పివస్తోందా?" అంటూ జానకమ్మ ఆయన భుజాలమీద అనునయంగా రాసింది.

నోటిలో సమాధానం చెప్పలేక అవునన్నట్లు తలపూపేరు దశరధరామయ్యగారు. నొప్పి భరించలేక కళ్ళు బిగబట్టి మూసుకుంటే, రెప్పల చాటునుండి రెండు కన్నీటి బిందువులు ముడతలుపడ్డ బుగ్గలమీదనుండి పండు మీసాల మీదకు జారిపోయి ఆ గుబురులో నిలిచి పోయేయి. భర్త పడుతున్న అవస్థను గమ నించిన జానకమ్మ గుండెలు అవిసిపోయాయి.

"ఈ మంచి నీళ్ళు త్రాగండి. నొప్పి సర్దు కుంటుంది" అంటూ గాజు గ్లాసుతో నీళ్ల అందిం చింది. మంచంమీద ఆయన లేచి కూర్చో టానికి వెనుక చెయ్యివేసి సాయంచేసింది. జానకమ్మ ఆసరాతో కూర్చొని మంచి నీళ్ళు రెండు గుటకలు మింగి గ్లాసు ప్రక్కనున్న టేబిలుమీద వుంచేరు. మళ్ళీ మంచంమీద వెనక్కు వాలి కళ్లుమూసుకున్నారు. మూడు నిమిషాల్లో కడుపు మంట కొంచెం చల్లారినట్లు అన్పించింది. అయితే ఇది కేవలం తాత్కా లిక ఉపశాంతి మాత్రమే! ఏదో కడుపులో పడగానే చల్లారుతుంది. మళ్ళీ కొద్ది సేపటికి మామూలే!

అంతలో వీధి వాకిలి గేటు తెరిచిన శబ్ద మయింది. "చూడు జానకీ! ఎవరో వచ్చినట్లు న్నారు" అన్నారు దశరధరామయ్యగారు హీన స్వరంతో. జానకమ్మ వీధివైపు చూసింది. పేపరు కుర్రాడు పేపరు లోనికి గిరాటువేసి సైకిలెక్కి వెళ్ళిపోయాడు. పేపరు సర్దిలోనికి తీసుకువచ్చింది.

"పోస్టుమేన్ రాలేదా?" జానకమ్మ చేతి లోని పేపరు వంక చూస్తూ మెల్లగా అడిగేరు దశరధరామయ్యగారు.

"ఇంకా రాలేదు" అంది ఆవిడ. పోస్టుమేన్ ఆ వీధికివచ్చి వెళ్లిపోయి అప్పుడే అరగంట అయింది.

కాని, ఆ విషయం భర్తకు చెప్పటం ఆమెకు ఇష్టంలేదు. మరోగంటసేపు ఆయన్ని ఆ నిరీక్షణలో వుంచటమే ఆమె కిష్టం!

పేపరు ఆయన చేతికి అందించి "మందు వేసుకుంటారా?" అంది.

"మరి కొంచెంసేపు పోనీయ్!" అని రెండు క్షణాలాగి "అసలు, నువ్వు రాసిన ఉత్తరం వాడికి అంది వుంటుందా?" అడిగేరు.

"ఎందుకు అందదు? ఒకటికాదు, రెండు రాసేను. మీ ఆపరేషను ఇరవైయ్యో తారీఖున చేస్తానన్నారు. పదిహేడో తేదీకి—అంటే మూడు దినాలు ముందుగానే సెలవుపెట్టి రమ్మని రాసేను. ఈవేళ తారీఖు పదమూడు. సమాధానం రాయకుండా ఏకంగా బయలుదేరి వచ్చేద్దామని ఊరుకున్నాడేమో!" అంది జానకమ్మ.

"నాకు నమ్మకంలేదు" అన్నారు దశరధ రామయ్యగారు హీనస్వరంతో.

"తప్పకుండా వస్తాడండీ. అయినా ఉద్యో గంలో వాడికెన్ని సాధక బాధకాలున్నాయో!

శెలవు దొరకటం కష్టమయిందేమో! ఇవన్నీ ఆలోచించొద్దూ!"

విరక్తిగా నవ్వేరాయన "జానకీ! వాడికి ఎనిమిదో ఏట కలరా వచ్చింది. నీకు జ్ఞాపకముందా?"

జానకమ్మ అవునన్నట్లు తలవూపింది.

"వాడికి వాంతులూ, విరోచనాలు అయిదు రోజుల వరకూ తగ్గలేదు. మనం ఇద్దరం ఆ వెధవని—అదిగో, అక్కడే, ఆ వీధి వరండాలో పెట్టుకుని కంట్లో వత్తులు వేసుకుని రాత్రీ పగలూ కాపలా కాసేం. నేను ఉద్యోగంలో చేరి ఇంకా పర్మనెంటు అవకుండా అన్ని దినాలు శెలవు పెట్టాననే కదూ; నా ప్రొబెషనరీ పీరియడు ఇంకో సంవత్సరం పొడిగించేరు!!



వాడు 'ఎస్సెల్సీ' చదువుతూ వుండగా కదుపులో కాయవేస్తే వాడి ఆపరేషను కోసం మద్రాసు నాలుగు మూట్లు తిరిగి రెండు నెలలు శెలవు పెడితేనే కదూ పే నాకు రావాల్సిన ప్రమోషను కాస్తా వెనకబడిపోయింది! ఇలా ఎన్నని ఏకరవుపెట్టను? నీకు మాత్రం తెలీదా! నువ్వూ, నేనూ ఎన్ని బాధలుపడి వాడిని పెంచకపోతే, వాడు ఈ రోజు ఇలా తిరుగుతున్నాడు? ఒక్కగా నొక్క నలుసని కంటికి రెప్పలా వాణ్ణి సాకొచ్చేం. అందుకు ఇదీ ఫలితం!వాడికి రెక్కలొచ్చాయి! కళ్ళు విడ్డాయి! ఎగిరిపోయాడు! రాధమ్మ వాణ్ణి వలలో వేసుకుంది. దాన్ని పెళ్ళిచేసుకుని ఏకంగా మామగారింట్లోనే కాపురం పెట్టేడు. ఈవేళ నా ఆరోగ్యం సంగతి వాడికి ఎలా పడుతుంది! వాడు రాడు! వాడు వద్దామనుకున్నా కోడలు రానివ్వదే!" మాట్లాడటం ఆపేరు దశరథ రామయ్యగారు. ఆవేశంతో ఆయిన గుండెలు ఎగిరెగిరి పడుతున్నాయి. ఊపిరి బరువుగా పీల్చుకుంటున్నారు.

జానకమ్మ మౌనంగా వుండిపోయింది.

భర్తకు ఎలా సర్ది చెప్పటం?

రామం తప్పక వస్తాడని తను మాత్రం ఎలా చెప్పగలదు?

ఏడాది క్రితం ఉద్యోగం కోసం హైదరాబాద్ వెళ్ళిపోయి, ఈవేళ్టి వరకూ ఇంటిమొహం

చూడలేదు. మామగారు ఉద్యోగం ఇప్పించేరు. ఇల్లరికం వుంచేసుకున్నారు. ఎప్పుడో రెండు నెల్లకి ఓ ఉత్తరం రాస్తాడు. పండిన ఈ వయస్సులో తనూ, భర్తా ఇక్కడ! కొడుకు అక్కడ!

'ఏదైనా పెద్ద ఇల్లు విడిగా తీసుకోరాదూ! మేమూ అక్కడికే వచ్చేస్తాం' అంటూ బోలెడు ఉత్తరాలు రాసింది తను.

'ఇక్కడ పెద్ద ఇళ్ళు దొరకటమంటే మాటలా? ప్రయత్నాలు చేస్తున్నాను. దొరక గానే రాస్తాను' అంటూ ఆరుమాసాలుగా మాట లతోనే పెదాలమీద బూరెలు వండుతున్నాడు.

'అడ్డాల్లో వున్ననాడు బిడ్డలు కాని, మీసా లొచ్చేక బిడ్డలా?' అనుకొంది.

"అప్పుడే పన్నెండయి పోయింది. అన్నం వడ్డిస్తాను" అంటూ భర్త సమాధానం కోసం ఎదురు చూసింది జానకమ్మ.

"ఆకలిగా లేదు" అన్నాడు దశరథ రామయ్యగారు.

"ఆకలి లేదని తినటం మానేస్తే ఎలా? మరీ నీరసం చేస్తుంది. రెండు మెతుకులు ఎంగిలి పడుదురుగాని, లేవండి." అని క్షణం ఆగి, "పోనీ కంచంలో కలిపి తీసుకురానా? మంచంమీద కూర్చొని తిందురుగాని" అంది జానకమ్మ.

కళ్ళు మూసుకుని వద్దన్నట్లు తల అడ్డంగా ఆడించేరు.

గది గుమ్మానికివున్న తెర సర్ది వీధిలోకి వచ్చింది జానకమ్మ.

గేటు ప్రక్కనున్న జామచెట్టుమీద వాలి కాకి ఒకటే గోలచేస్తోంది.

శీతాకాలమే అయినా, మధ్యాహ్నం ఎండ మాత్రం విపరీతంగా వుంది.

అంతలో రోడ్డుమీద రిక్షా ఆగిన చప్పు డయింది.

రిక్షాలోంచి ఎవరో దిగుతున్నారు! వాడే! రాముడే! సందేహంలేదు!

జానకమ్మ మనసు ఆనందంతో హరివిల్లే అయింది. ఒక్క ఏడాదిలో కొడుకు ఎంత ఎదిగిపోయాడు! చలవకళ్ళజోడు. బెల్ పంట్లాం. చేతిలో చిన్నపెట్టె! దొరబాబులా వున్నాడు! పోల్చుకోలేనంత మారిపోయాడు.

రిక్షావు డబ్బులిచ్చేసి వీధిలోనుండే తన వంక తిరిగి చిరునవ్వుతో "బాగున్నావా అమ్మా!" అన్నాడు.

ఆనందంతో నోటమాట రాలేదు జాన కమ్మకు.

గబగబా అడుగులేసుకుంటూ లోనికి నడి చింది—కాదు! పరుగెత్తింది!

"ఏవండీ!" అంటూ భర్త దగ్గరకు వెళ్లి "రామం వచ్చేడండీ! వాడురాడని బెంగపెట్టేసు కున్నారు మీరు! నా మాటలు విన్నారు కాదు! వాడు నా కొడుకండీ! మీకు ఆపరేషనని రాస్తే రాకుండా ఎలా వుంటాడు?" అంటూ ఆనందోద్వేగాలతో మాట్లాడింది.

దశరథ రామయ్యగార్కి ఒక్కసారి వెయ్యి ఏనుగుల బలం వచ్చినట్లయింది.

ఆనందంతో ఆయన మనసు సముద్రమల్లే ఉప్పొంగింది.

అంతలోనే రామం లోనికివచ్చి సూట్‌కేసు ప్రక్కనపెట్టి తండ్రి మంచంవద్దకువచ్చి "ఎలా వున్నావు నాన్నా! అయ్యో! ఇంతలా చిక్కి పోయారేమిటి? ఆపరేషను 'రిపేర్'కి వచ్చే వరకూ ఊరుకున్నారేమిటి?" అంటూ ప్రక్కన కూర్చుని ప్రశ్నల వర్షం కురిపించేసు.

దశరథ రామయ్యగార్కి ఆనందంతో కళ్ళల్లో నీళ్ళు తిరిగేయి.

"నాకేం, బాగానేవున్నాను! ఎప్పుడో నిన్న సాయంకాలం ఎక్కిన రైలు ఎండన పడి వచ్చావు, స్నానంచేసి నాలుగు మెతుకులు తినిరా! జానకీ, రామూనికి స్నానానికి నీళ్ళు పెట్టు! రాధమ్మ ఎలావుందిరా? అసలే వట్టి మనిషికాదు, జాగ్రత్తగా చూసుకుంటున్నావా?" ఎన్నెన్నో ప్రశ్నలు వేశారు. తనే సమాధా నాలు చెప్పుకున్నారు కొన్నిటికి. హెచ్చరికలు చేశారు. కొడుకు ఒళ్ళు తడిమి "ఇలా చిక్కి పోయావేమిట్రా! నీకా హైద్రాబాద్ నీళ్ళు పడ లేదు" అంటూ వాపోయారు.




"మీరు విశ్రాంతి తీసుకోండి. నేను వెళ్ళి స్నానంచేసి వస్తాను" అంటూ అక్కడనుండి లేచాడు రామం.

దశరథ రామయ్యగారు మంచంమీద లేచి కూర్చున్నారు.

ఇప్పుడాయనకు పేపరు చదవటానికి ఉత్సాహంగా వుంది. లేచి గంతులు వెయ్యాలని కూడా వుంది. రామం వచ్చినందుకు మనసు ఆనందంలో ఉప్పొంగిపోతోంది, అంతవరకూ కష్టం, బెంగ, భయం తీరిపోయాయి. ఇంక పెద్ద ఆపరేషన్ చేయించుకునేందుకయినా ఆయన మనసు రెడీ అయింది. సగం ఆరోగ్యం అప్పుడే చేతికి అందినట్లయింది. ఉత్సాహంగా పేపరు చదవటంలో లీనమయ్యారాయన.

రామం స్నానం ముగించి భోజనానికి సిద్ధమయ్యాడు.

జానకమ్మవచ్చి "మీరూ లేవండి, నాలుగు మెతుకులు తిందురుగాని" అంది.

"నాకు ఆకలిగాలేదు. వాడికి వడ్డించు" అన్నారు.

జానకమ్మ వంటింట్లో పీటవేసి రామానికి అన్నం వడ్డించింది. కొసరి కొసరి రామంచేత తినిపిస్తోంది. దశరథ రామయ్యగారు పేపరు చదవటం ముగించి టేబిలుమీద పడేశారు. వంటింట్లో మాట్లాడుకుంటున్న తల్లీ కొడుకుల సంభాషణ ఆయన చెవిని పడుతోంది.

"అయితే నీకు ఆ రెండు ఉత్తరాలూ అందేయా, లేదా?" జానకమ్మ గొంతు.

"అందేయమ్మా! తీరిక దొరక్క సమాధానం రాయలేకపోయాను. నేను ప్రమోషన్ పేనల్‌లో వున్నానమ్మా! ఇప్పుడు శెలవు పెట్టడం సాధ్యపడదు. ఈ ఒక్క రోజుకే ఆఫీసరు మూలుగుతూ శెలవిచ్చేడు ." కొంతసేపు నిశ్శబ్దం తర్వాత మళ్ళీ రామం గొంతు "మా జోనల్ మేనేజరు ఈవూరి తాసిల్దారుగారి అల్లుడే! నాన్నా, తాసిల్దారుగారూ ప్రాణ స్నేహితులు కదా! అందుకని నాన్నచేత తాసిల్దారుగార్కి చెప్పించి వాళ్ళ అల్లుడికి నా ప్రమోషన్ గురించి రికమెండేషను లెటరు తీసుకు వెళ్దామని వచ్చేను. ఈ ఉత్తరం తీసుకు వెళ్తే నాకు ప్రమోషను ఖాయం.... "

"వీలు చేసుకుని ఆపరేషను ఒక్క రోజూ ఇక్కడ వుండేలారాలేవుట్రా! " జానకమ్మ అభ్యర్ధన. "ఇరవయ్యో తారీఖు మా మేనేజరు కూతురు పుట్టిన రోజు! ఆ పార్టీ ఏర్పాట్లన్నీ ఆయన నా నెత్తిన పడేశాడు. తీరామాట ఇచ్చాక ఇప్పుడు కాదంటే బాగుండదు." రామం గొంతు దశరథ రామయ్యగారి మనసుని కోత పెడుతోంది. దీర్ఘంగా నిట్టూర్చి మెల్లగా మంచంమీద వెనక్కి వాలేరు. □

జ్యోతి కథల పోటీలో ప్రత్యేక ప్రశంసపొందిన కథ!

# పటపు

**సదానంద శారద**

"కొత్తదొర శానా మంచోడె" — అన్నాడు భార్యతో అయిలయ్య.

ఆ మాటలు విని దుర్గమ్మ నవ్వసాగింది.

"ఏంటిదె!—దొర మంచోడంటే నవ్వుతా నవు . దొరల్ల మంచోళ్ళుండరా?" కొంచెం కోపం వచ్చింది అయిలయ్యకు.

"అదికాదయ్యా . వచ్చి రొండురోజులు కాలె అప్పుడే దొర మంచోడో, సెడ్డోడో తెల్సిపోయినాదీ?" అంది దుర్గమ్మ.

"సీదంతా చోద్యం ఒక్కపారి సూత్తె ఎఱుకగాదె మంచీ, సెడ్డ?"

"అట్లనా! ఏదిసెప్పు దొరల ఏంజూసి మంచోడు అంటనవో?"

"నవ్వుకుంటు మాట్లాడుతడే దొరలు తిట్టుకుంట మాట్లాడుతరుగాని నవ్వుకుంటా మాట్లాడుతారె?"

"ఊహూఁ "

"ఒక్కడే రాలె అమ్మగోరినిగూడ ఎంట బెట్టుకొచ్చుకున్నడు "

"పెళ్ళాన్నిఎంటబెట్టుకచ్చుడుగూడాగొప్పే"

"అదికాదే మునుపచ్చిన దొరలు ముందు గాల్నె అమ్మగోర్లతో రాకపోయేదె అసోంటిది ఈదొర పొట్టలోనున్నా అమ్మగోరిని తీసుకొచ్చుకున్నడు—"

"ఉఁఉఁ తీసుకొత్తనె వత్తాది!- ఆమే దొర ఎంబడి పడి వచ్చిండొచ్చు... సూపులుపక్కకు పోతె సురుకలంటించడాన్కి "

భార్య అలా అనడం అయిలయ్యకు రుచించలేదు—

"సాల్లే. ఇంత కూడెయ్యి, జల్దిసబోవాలె" అన్నాడు.

"సంటిదానికి పాలిత్తాన కసబ్దత్తలేదు జర ఆగరాదు?"

"పోవాల్నె సరె నేనేసుకుంట కూకో" అంటూ అరుగుమీదినుంచి ఇంట్లోకి వెళ్ళాడు అయిలయ్య.

"కడుపునిండా తినిపో . ఆయిల్లగూడ తినలే" అంది దుర్గమ్మ పాలు తాగుతున్న సంటిదాన్ని ప్రేమగా నిమురుతూ—

కంచం కడుక్కొని అన్నం వేసుకొని కూర్చున్నాడోలేదో "దొర రమ్మంటాండు" అంటూ వచ్చాడు కనకయ్య.

దుర్గమ్మ కొంగుతో ఇంకా కప్పుకొంది. పాలు తాగుతూన్న పసిది సగం బయట సగం కొంగులోపల ఉండిపోయింది.

కనకయ్యకు పిల్లలులేరు. గేదెలున్నాయి. కనకయ్య తనభార్య పాలిస్తుండగా యెప్పుడూ చూడలేదు. గేదెలు పాలిస్తుండగా మాత్రం రోజూ చూస్తాడు — దుర్గమ్మ పాలిస్తుండగా చూస్తున్నాడు — తినబోతున్నవాడల్లా అన్నం మీదినుంచి లేచివచ్చాడు అయిలయ్య.

"అయ్యో! కూడుతిని పో. అట్లనేపోతావా ఏంది?" భుజంమీద కండువా వేసుకుని భర్త బయిటికి రావడంచూసి అంది దుర్గమ్మ.

"ఆ సెంక తింటలేయె. దొర పిలుత్తాండట— ఎందుకో పోయత్త" అంటూ "ఆయిల్లతిండ్లె

ఇప్పుడుగూడ తినకుండపోతె ఎట్లనయ్యా...."
అని దుర్గమ్మ అంటున్నా వినిపించుకోకుండా గబగబా వెళ్ళిపోయాడు అయిలయ్య.

అది వరంగల్ జిల్లాలోని ఒక పంచాయితీ.

ఆ సంవత్సరంలో అప్పటికే యిద్దరు ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్లు ఆ ఆఫీసుకు ట్రాన్స్‌ఫర్ అయి, ట్రాన్స్‌ఫర్ చేయించుకొని వెళ్ళిపోయారు. కృష్ణమూర్తి మూడో ఆఫీసరు—

అది మారుమూల పంచాయతీ కావటం వలన ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్లెవరికీ ఆ పంచాయితీకి రావటానికి యిష్టం వుండదు.

అందుకే తమకు ఇష్టం లేనివారిని ఆ పంచాయితీకి పంపుతుంటారు పై అధికార్లు-రాగానే ప్రతి ఆఫీసరుచేసే మొదటిపని తనకు అక్కణ్ణుంచి ట్రాన్స్‌ఫర్ చేయించుకోవడానికి ప్రయత్నించడం—ఈ పంచాయితీలతో ఇదే పంచాయితి!....ప్రతి ఆఫీసరు, టీచరూ టిక్‌ట్వంటీ తాగిన మొహాలు పెట్టుకొని ఊసురోమంటూ కన్పిస్తారు—వాళ్ళకెప్పుడూ ట్రాన్స్‌ఫర్ గొడవలే!

పంచాయితీ ఆఫీసు వెనకనున్న డాబా ఇల్లు ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుకోసం కేటాయించబడింది.

ఆరోజు ఆదివారం—

ఆఫీసుకు మాత్రమే శెలవు. ఆఫీసుప్యూన్ అయిలయ్యకు శెలవుండదు — అయిలయ్య తాలూకాఫీసు జీపులాంటివాడు. ప్రతి రోజూ పనిచేయాలి.

ఆఫీసు పనిచేయాలి—ఆఫీసరు ఇంటి పని చేయాలి.

ఆఫీసరును మోయాలి—ఆఫీసరు యింటిని మోయాలి.

ఆఫీసరుగారి ఇంటిముందు ప్యూను నిలుచున్నాడు. ఆరోజు ఆదివారం .... కృష్ణమూర్తి క్వార్టర్ ముందు అయిలయ్య నిలుచున్నాడు. తాలూకాఫీసునుండి తెప్పించిన జీపుకూడా నిలుచుంది.

కనకయ్య వెళ్ళిపోయాడు. ఆఫీసరు ఇంటి వెనకాల పెరటిలోనేవుంది కనకయ్య గుడిసె. కనకయ్య పంచాయతీ ఆఫీసుకు, ఆఫీసర్

## రచయిత గురించి



ఈ పేరులోని అర్థభాగం అర్థభాగం పేరు కలవనివ్వని వారితో,వాటితో పోరా ....ప్రస్తుతం ఉంటున్నది బ్రతుకుతెరువు కోసం పోరాడుతూ హైద్రాబాద్‌లో-తొలిసారిగా ఊపిరి పీల్చింది స్వాతంత్ర్యం వచ్చిన నాలుగు సంవత్సరాలకు వరంగల్‌లో.

ఇప్పుడిప్పుడే సాహితీ లోకంలో అడుగుపెడుతున్నాను. 'పలుపు' కథకు ప్రత్యేక బహుమతి నిచ్చి ప్రోత్సహించిన 'జ్యోతి'కి కృతజ్ఞతలు. ఇది అచ్చయిన మా ఎనిమిదవ కథ. బహుమతి గెలుచుకున్న రెండవ కథ. ఒక ప్రముఖ వార పత్రికలో 'హేమ' అనే నవల సీరియల్‌గా రాబోతున్నది.

ఈ సశేష రచనలోని అందాలను ఆనందించకలిగించేలా, ఆవేదనలను కదిలించేలా చెప్పగలిగితే ఈ గ్రంథంలోని ఒక పుటలో మా పాత్ర అభినయం పూర్తవుతుంది.

—సదానంద్ శారద

ఇంటికి చౌకీదారు-అంటె ఆఫీసుకు, క్వార్టర్‌కు ముందునుంచి కనకయ్య వెనుకనుంచి గుడిసె కాపలా దారులు—

సుష్టుగా భోంచేసి బయటకు వచ్చాడు కృష్ణ మూర్తి.

"వచ్చినవా అయిలయ్యా — మనం తొంద రగా వరంగల్ పోవాలె—అమ్మగారి అమ్మ గారింటికి—జీపు తెప్పించిన" అన్నాడు.

"అట్లనే బాంచెను—" అమ్మగారి అమ్మ గారింటికి అంటే దొరగారి అత్తగారింటికి దొరగారు పోతున్నారు సరే—సంతోషం!- మరి అయిలయ్య ఎందుకు? — ఎందుకంటె దొరగారి బొచ్చుకుక్క కూడా పోతాలేదు ! అత్తగారింటికి అట్టహాసంగా పోవద్దూ! "దొర గోరు శానా మంచోరు—అత్తగారింటికి గూడ నన్ను తీసుకపోతాండు—" మరోసారి దొర గారి మంచితనం కనిపించింది అయిలయ్యకు.

బొచ్చుకుక్కకూ కడుపునిండా తినిపించి అమ్మగారు వచ్చారు. అమ్మగారు, దొరగారు జీపులో ముందు కూర్చొన్నారు, బొచ్చు కుక్కను పట్టుకొని అయిలయ్య వెనక కూర్చున్నారు.

జీపు వేగంగా పోతున్నది. చాలా హుషా రుగా ఉంది.

బొచ్చు కుక్కకూ హుషారుగా ఉంది. కని పించే చెట్టును, పుట్టను చూస్తూ 'కుయ్‌కుయ్' మని మొరగసాగింది.

అయితే అయిలయ్య కడుపులోని ప్రేగులు మాత్రం కోపంతో మొరుగుతున్నాయి. ఆ మనిషి ప్రేగులై పుట్టినందుకు ఏడుస్తున్నాయి!

'మొలుగు' చేరగానే కదలనని జీపు మొరా యించింది. పెట్రోలు బంకును చూడగానే దానికి ఆకలయినట్టుంది! ఫైవ్ స్టార్ హోటల్‌ను చూసినట్టు దాని ముఖం వెలిగిపోయింది! డ్రైవర్ దిగి దాని కడుపు నింపాడు.

ఆ జీపు నయం! ఈ అయిలయ్య వొర్రి మూర్ఖుడు....అనుకున్నాయి అతని కడుపు లోని ప్రేగులు. ఆ జీపు కడుపులో దూరినా బాగుండేది. ఈ మనిషి కడుపులో చిక్కు కున్నాము అని విచారించాయి!

కృష్ణమూర్తి అత్తగారు కూతుర్ని, అల్లుణ్ని, వాళ్ళ అట్టహాసాన్ని చూసి ఎంతో సంతోషిం చారు. ఆఫీసరు దగ్గర పర్మిషన్ తీసుకొని 'మా అత్తగారి ఇల్లుకూడా ఇక్కడే ఉందిసార్ ఒక్కసారి వెళ్ళొస్తా—గంటలో వస్తాసార్.'' అని జీపుతోసహా డ్రైవర్ జారుకున్నాడు.

జీపు తోలుకొచ్చిన అల్లుణ్ని చూసి ఆ డ్రైవర్ అత్తగారూ ఎంతో సంతోషించి ఉంటారు. ఆ వాడంతా తన అల్లుణ్ని, జీపును చూస్తుంటే ఆ అత్తగారింటి ఆనందం ఆకా శాన్ని అందుకొని ఉంటుంది!

అయిలయ్య మాత్రం ఎటూపోక బొచ్చు కుక్కను పట్టుకొని 'దొరగోరి' అత్తగారి మేడ బయటే నిలుచున్నాడు.

కొంచెం సేపటికి లోపలికి రమ్మని బొచ్చు కుక్కకు కబురొచ్చింది.

అయిలయ్యకూ వస్తున్నాయి కబుర్లు.... కడుపులోంచి!

కాని అతడు కదలడు. ఆజ్ఞలు పాటించ డంలో కేసరియాంకాను మించిపోతాడు. అయినా బరుపులేంది కదిలి మాత్రం ఏం చేస్తాడు!

అక్కడ ఊరిలో—అయిలయ్య భార్య దుర్గమ్మ "నీ మొగడు పేటకుపోయిండె" అని కనకయ్య చెబితే విని ఏడ్చినంత పనిచేసింది. తనకు చెప్పకుండా భర్త అలా వెళ్ళినందుకు ఆమె చాలా బాధపడింది. కాని పాపం! ఏం చేస్తాడు అయిలయ్య ఎమర్జెన్సీ వెంటబెట్టుక పోతుంటె!

ఆ రాత్రి కృష్ణమూర్తి భార్యకు నొప్పులు రావడంతో మెటర్నిటీ హాస్పిటల్‌లో జాయిన్ చేశారు. నిద్రాహారాలు మాని వాళ్ళు చెప్పిన పనల్లా చేయసాగాడు అయిలయ్య.

'దొరగోరు శానా మంచోరు' అని మరీ మరీ అనిపిస్తున్నది అయిలయ్యకు. తానెంతో అప్పుడు కనుక ఇలాంటి సమయంలో తనను దగ్గరుంచుకున్నారు మరి ఆకలి దప్పుల మాటేమిటి?-అవసరం వచ్చినప్పుడు అవన్నీ



లెక్క చేయొద్దు!

అయిలయ్యకు అంతా అయినవాళ్ళే.

తన భార్య ప్రసవించినప్పుడు మాత్రం ఇంటి దగ్గరకాదు, అసలు ఊళ్ళోనే లేడు అయిలయ్య! కృష్ణమూర్తికంటె ముందున్న 'దొరగోడు' సీసాలు తెమ్మంటె తాలూకా బజారుకెళ్ళాడు. ఇంటి దగ్గర భార్య పురిటి నొప్పులుపడుతున్నా ఆ 'దొరగోరి' గొంతు నొప్పి మొదట తీర్చాల్సి వచ్చింది. ఇదంతా అయిలయ్య ఆలోచించడంలేదు- అయిలయ్యకు ఈ ఆలోచనరాదు!

రెండు రోజుల తరువాత దొరగారిని, దొరగారి బొచ్చు కుక్కను, ప్యూనును తీసుకొని తాలూకాఫీసు జీపు ఊరికి తిరిగివచ్చింది. వచ్చి రావడంతోనె "మాంచి కోడి పొలావ్ పట్రా అయిలయ్యా. .." అంటూ దొరగారు నవ్వుతూనే ఆర్డర్ జారీచేశారు. తలూపి ఇంటికి వచ్చాడు అయిలయ్య.

కళ్ళు పీక్కుపోయాయి. ముఖం చిక్కిపోయింది

గరను అలా చూసి దురమ్మ మనసు బావురుమంది.

"దొరగోరికి జల్ది కోడి కూరందుకపోవాలె." అన్నాడు అయిలయ్య వస్తూనే.

"అయితే నువ్వొచ్చింది కోడి కూరకా! పెళ్ళాం బిడ్డలను సూడ్డానికొ్కాదు! ." అన్లేదు దుర్గమ్మ. ఆ మనిషి తీరు ఆమెకెప్పుడో అర్థమయింది!

ఆర్రూపాయలు అప్పుపెట్టి ఒక మాంచి కోడిని పట్టుకొచ్చాడు అయిలయ్య 'దొరగోరికి' అని చెప్పి భయపెట్టి తీసుకరావచ్చు. కాని అయిలయ్యకు అంతతెలివి, శక్తియుక్తులు లేవు! అందుకే అయిలయ్య కడుపులోని ప్రేగులు దేవున్ని రోజూ తిడుతుంటాయి... ఆ మనిషి కడుపులో పడేసినందుకు!

నెలరోజుల్లోపల కృష్ణమూర్తి భార్య వచ్చేసింది.

"ఏం మునిగిపోయిందని ఇంక తొందరగా వచ్చేసింది!" అనుకున్నాడు కృష్ణమూర్తి.

"సీసా పాలైతే బాబు ఆరోగ్యం చెడిపోతుందేమోనండి ." అందావిడ గారాలు పోతూ భర్తతో.

"అవునూ సీసా పాలెందుకు?" అన్నాడు కృష్ణమూర్తి.

"పోండి మీకేం అర్థంకాదు—" అంది చిఱుకోపం తెచ్చుకుంటూ — అర్థమయింది కృష్ణమూర్తికి—" ఓ అందుకా అవును సీసా పాలుకావాలి—" అన్నాడు.

"అవే వద్దంటున్నాను కొంతకాలం—"

"వద్దంటె ఎలా?"

"ఎవరైనా పాలిచ్చే మనిషిని చూడండి."

తన సొగసులు తరగిపోతాయని ఆమెబెంగ!

* * *

'గుమ్మల గింజలు గుమ్మల్నె ఉండాలె గునుపాల్లెక్క బిడ్డలుండాలె అన్నట్లున్నది ఆమె ఎవహారం' అనుకున్నది దుర్గమ్మ, భర్త చెప్పిందంతా విని—

"అయితే నన్నేం జేయమంటవయ్యా?" అని అడిగింది. "ఏంటయ్యా నువ్వనేది? నేనియ్యాల్నా ఆ పిల్లగానికి పాలు?"

"ష్. లొల్లి పెట్టకే — దొరగోరి బిడ్డకు పాలిచ్చె అదురుట్టం అందరి కొత్తాదె!" అని ఆమె నోరు మూశాడు అయిలయ్య.

"సంటిది ఏడుత్తాదయ్యా — దానికి సరిపోవయ్యా" అని ఆమె ఎంత చెప్పినా, ఏడ్చినా ప్రయోజనం లేకపోయింది. 'దొరగోరి' దగ్గటికి ఆమెను లాక్కుపోయాడు అయిలయ్య—

కనకయ్య గుడిసె ప్రక్కనే పశువులకు చిన్న పాక ఒకటి ఉంది. ఆ పశువులను కాయడానికి ఒక జీతగాన్ని పెట్టుకున్నాడు. ఆ జీతగాడె వాటి పాలు పితికి అమ్మక వస్తుంటాడు.

వారం రోజుల క్రితమే ఈనిన ఈరయ్య బర్రెను బేరంచేశాడు కనకయ్య. ముట్టెనుంచి తోక దాకా దాన్ని పరీక్షగా చూశాడు.

ఎదురుగా నిల్చున్న దుర్గమ్మను ఆపాదమస్తకం పరిశీలనగా చూశాడు కృష్ణమూర్తి-

బర్రె పొదుగును చేయితో తడిమి చూశాడు కనకయ్య.

చూపుల చేతులతో దుర్గమ్మ రొమ్ములను తడిమి చూస్తున్నాడు కృష్ణమూర్తి.

పరవాలేదు పాలు బాగానే ఇస్తుంది అనుకున్నాడు కనకయ్య.

పరవాలేదు బాగానే ఇస్తుంది అనుకున్నాడు కృష్ణమూర్తి—

బర్రెకు ఒంటిమీద తేళ్ళు, జెర్రులు ప్రాకాయోలేదో తెలియదు కాని ఈగలు, దోమలు మాత్రం ముసిరాయి.

దుర్గమ్మ మాత్రం అక్కడ నిలపలేక ప్రక్కకు పోయింది.

జీతగాన్ని పిలిచి కొత్త బర్రెను, దాని దూడను తీసుకిపోయి పాకలో కట్టేయమని చెప్పాడు కనకయ్య. కొత్త పలుపులు తీసుకొచ్చి వాటి మెడకు తగిలించి తీసుకపోయాడు జీతగాడు,

"ఉంచిపో " అన్నాడు కృష్ణమూర్తి—

"అట్లనే బాంచెను " అని వెళ్ళిపోయాడు అయిలయ్య. దుర్గమ్మకు దుఃఖం ఆగలేదు.పసిదాన్ని వదిలి ఉండలేకపోయింది.

"ఇంకా అక్కన్నే సింటవేందె" ఇలా రా " అంటూ ఆమెను ఇంటి వెనుకకు తీసుకుపోయింది కృష్ణమూర్తి భార్య కుమారి. ఆమె ఎప్పటికీ కుమారిలా ఉండాలని కాబోలు ఆ పేరు పెట్టారు.

పిల్లల్ని కన్నా ఆమె కుమారే మరి!

"బాగా కడుక్కొనిరా " అని దుర్గమ్మను బాత్‌రూంకు పంపించింది కుమారి.

భయం భయంగా ఉంది దుర్గమ్మకు. ఏడ్పు వస్తోంది. పాలిచ్చి తొందరగా అక్కణ్నుంచి పారిపోవాలని ఉందామెకు—

ఆమె బట్టలుకూడా మార్పించింది కుమారి.

రెండుమూడు తువ్వాళ్ళు, గుడ్డలు రొమ్ముల క్రింద పఱచి పాలివ్వడానికి పిల్లవాణ్ని అందించింది. ప్రక్కనే కుర్చీవేసుకొని కూర్చుంది.

దుర్గమ్మ వంచిన తల ఎత్తకుండా నేలమీద కూర్చుంది పిల్లవానికి పాలిస్తూ—ఆ పాలు




త్రాగి ఆమె ఒడిలోనే నిద్రపోయాడు. ... చల్లని ఒడిలో భేదాలు తెలియని పసివాడు!

ముఖం చిట్లించుకొని కొడుకును దుర్గమ్మ ఒడిలోంచి తీసుకొని స్పాంజ్ పరుపుమీద పడుకోబెట్టింది కుమారి.

ఇక వెళ్తానన్నట్లు లేచి నిలబడింది దుర్గమ్మ.

"పోయిరానా అమ్మగోరూ.. " అని అడిగింది.

"పోతవా! ఎక్కడికే?" ఆశ్చర్యంగా అడిగింది కుమారి.

"ఇంటికాడ సంటిది ఏడుత్తాందిగావచ్చు." దీనంగా ముఖంపెట్టి అంది దుర్గమ్మ.

"ఏడి సైవాడు లేడె ఇంటికాడ? నువ్విక్కడ్నే ఉండాలె"

తలమీద పిడుగుపడినట్లయింది దుర్గమ్మకు.

"సంటిది పాలకేడు త్తదిగాదు బాంచెను--" అంది గొంతు పెగుల్చుకొని—

"ఆహా! ఆ పోరికి పాలిచ్చి ఆ ఎంగిలి పాలు మా బాబు కిస్తావు!—వీల్లేదు. నువ్విక్కడ్నుంచి కదలొద్దు—వాడే ఏ పాలోపోసి చూసుకుంటడు నువ్విక్కడ్నే ఉండు. ."

కాళ్ళ క్రింది భూమి కదిలిపోతున్నట్లు, ఆకాశం విరిగి మీద పడుతున్నట్లున్నది—దుర్గమ్మ గుండె దడదడ కొట్టుకోసాగింది.

నామాలు పెట్టుకున్న వాళ్ళంతా భక్తులు కాదు.

కన్న వాళ్ళంతా తల్లులుకారు!

కుమారి తల్లి కాదు.

అందుకే ఆమెకు దుర్గమ్మ 'తల్లి మనసు' అర్థం కాలేదు.

అలా కృష్ణమూర్తి ఇంటి వెనక భాగంలో కట్టివేయబడింది దుర్గమ్మ.

అటువైపు భర్త రాకుండా చాలా కట్టుదిట్టం చేసింది కుమారి—

గడ్డివేసే విషయంలో పాలిచ్చే బర్రెలకు, పాలివ్వని బర్రెలకు వేరువేరు పాలసీలుంటాయి. అవి కనకయ్య జీతగానికి బాగా నేర్పాడు. పాలిచ్చే బర్రెలక్కూడా పాలు పితకడానికి ముందు వేసే గడ్డికి, మామూలు సమయాలలో వేసే గడ్డికి చాలా భేదం ఉంటుంది. పరిమాణంలోనూ, పచ్చదనంలోనూ ఆ భేదం ఉంటుంది.

పాలు పితకడానికి ముందు———పచ్చిగడ్డితోపాటు పల్లిపిండి తవుడు...రుచికరమైన, పుష్టికరమైన ఆహారం ముందుపెట్టి చెంబులు, సర్వలు పట్టుకొని వెనక కూర్చుంటారు

కనకయ్య, జీతగాడు.

దుర్గమ్మకు వి స్తరి నిండా అన్నం పెట్టుక వచ్చి ఇచ్చింది కుమారి. కాని. . ఒక ముద్ద కూడా తినలేకపోయింది దుర్గమ్మ. పసిది కళ్ళల్లో మెదిలి ఆమె గుండె చెఱువై పోయింది.

ఆమెకు రెక్కలుంటే ఆ క్షణంలో అక్కణ్నుంచి ఎగిరిపోయేది. బిడ్డను అక్కున చేర్చుకొని తనివితీరా పాలిచ్చేది.

ఆమెకు రెక్కలుంటే అవి కూడా కట్టివేయబడేవి, కొట్టివేయబడేవి అన్నా ఆశ్చర్యం లేదు!

ఆ అన్నం తినలేక 'అమ్మగోరు' చూడనప్పుడు దొడ్డి గుమ్మం తలుపులుతీసి పెంటలో వేసి చెత్త కప్పింది దుర్గమ్మ.

ఆ సాయంత్రం——

కనకయ్య పశువులపాక వైపు చూస్తూ దొడ్డి గుమ్మాని కానుకొని నిలబడింది దుర్గమ్మ.

దూడను ఒక గుంజకు కట్టేసి బర్రెపాలు పితకడానికి కూర్చున్నాడు కనకయ్య జీతగాడు. ఆ బర్రె ముందు దానా ఉంది. అయితే దాని చూపులన్నీ దూరంగా కట్టివేయబడిన తన దూడమీదే ఉన్నాయి. పాలు బాగా రావాలని పొదుగును, దాని ప్రక్కలను నిమురుతున్నాడు జీతగాడు.

పొదుగును కడిగి మోకాళ్ళ మధ్య సర్వ పెట్టుకొని రెండు చేతులతో పితుకుతున్నాడు. ధారలుగా పాలు సర్వలో పడుతున్నాయి.

దూడ దీనంగా చూస్తున్నది.

మౌనంగా ఏడుస్తున్నది.

తన కూతురు గుర్తుకువచ్చి మనసు దేవినట్లయింది దుర్గమ్మకు——ఆమెకు దుఃఖం పొంగి వచ్చింది..

ఆరాత్రి——ఇంటి వెనక గదిలో దుర్గమ్మ పడుకోవడానికి ఒక చాప, ఒక చిరిగిన దుప్పటి ఇచ్చింది కుమారి.

దుర్గమ్మకు నిద్రపట్టలేదు. దీనంగా చూస్తున్న దూడ....తన కూతురు కళ్ళల్లో మెదిలి ఆమె మనసంతా నీరైపోయింది. కడుపు తరుక్కుపోయింది.

ఆమె అక్కడ ఉండలేకపోయింది. పక్కమీదినుంచి లేచింది. మెల్లగా తలుపులు తీసి బయటికి వచ్చింది.

ఆమె అడుగులు తడబడుతున్నాయి.

దొడ్డి గుమ్మంవైపు నడిచింది. ఆమె గుండె భయంగా, వేగంగా కొట్టుకోసాగింది. అంతలో లోపల్నించి అబ్బాయి ఏడుపు వినిపించింది. లైటు వెలిగింది. గబుక్కున వెనక్కు తిరిగి గదిలో దూరి తలుపేసుకొంది.

కొంచెం సేపటికి కుమారి ఆ గది తలుపులు తట్టింది.

ఆ మరునాడు ఉదయం —— చంటిదాన్ని తీసుకొని అయిలయ్య వచ్చాడు. ప్రాణాలు లేచి వచ్చినట్లయింది దుర్గమ్మకు. గబగబా ఉరికొచ్చి కూతురునందుకొని గుండెలకు హత్తుకొంది ఆర్తిగా. తల్లి స్పర్శ గుర్తించి చంటిది ఆమె కళ్ళల్లోకి చూస్తూ ఏడ్వసాగింది. కొంగును ప్రక్కకు తొలగించ సాగింది. దుర్గమ్మ ఆగలేక రొమ్ముతీసి బిడ్డ నోట్లో పెట్టబోయింది——

'అమ్మగోరు' "ఏందె అది?' అంది అమ్మ వారిలా ఉరిమి చూస్తూ——

దుర్గమ్మ మనసు విలవిల లాడిపోయింది.

దీనంగా భర్త ముఖంలోకి చూసింది.

తలవంచుకున్నాడు అయిలయ్య.

"తీసుకపోరా దాన్ని——అయ్యగారిని పైసలడుక్కొని ఏ పాలో కొనిపోయి పో .. చస్తదా . ఏం చావది " విసురుగా అంది.

అయిలయ్య భార్య చేతుల్లోంచి కూతురిని లాక్కొని గబగబా అక్కణ్నుంచి వెళ్ళిపోయాడు.

గుడ్ల నీరు కుక్కుకొంటూ అలాగే నిలుచుండిపోయింది దుర్గమ్మ——

"ఇంకా నిలుచున్న వేందే? స్నానం చెయిపో——బాబుకు పాలిచ్చేదానివి శుచి శుభ్రంగా ఉండక్కర్లా?" అంది వాళ్ళబ్బాయికి పాలివ్వడానికే దుర్గమ్మ పుట్టినట్లు——

దుర్గమ్మ స్నానంచేసి అబ్బాయికి పాలి



యో౹౹౹

స్తోంది.

కుమారి స్నానం చేస్తున్నది—కృష్ణమూర్తి వచ్చాడు.

పాలిస్తున్న దుర్గమ్మను చూస్తూ నిల్చున్నాడు—కంగారుగా. గబగబా పయిటతీసి నిండా కప్పుకొంది దుర్గమ్మ. అప్పటికే ఆమె వక్ష సంపద అతని కళ్ళబడింది. నవ్వి—ఆ నవ్వును చూసే దొర మంచోడు అనుకుంటున్నాడు అయిలయ్య- "అంతంత లావున్నయి. ఏం పెట్టి లావు చేసుకున్నవే కుడుకలు బాగా తిన్నావు?" అన్నాడు.

ఆ మాటలు వినలేకపోయింది.

పరాయి మగాడు అలా మాట్లాడుతుంటె ఏ ఆడది సహిస్తుంది?

కాని దుర్గమ్మలు సహిస్తారు. పేదరికం వాళ్ళకు సహనాన్ని నేర్పుతుంది. పేదరికం వాళ్ళకు నేర్పేవాటిలో సహనం ఒకటి. ఈ అహంకారం ఇంకా బ్రతికి ఉండటానికి కారణం ఆ సహనమే!—

"పోరనికి పాలివ్వకున్నా మా దానివి ఇంతింత లేవేందే!" అంటూ దగ్గఱగా వస్తున్నాడు—

అలా అంటున్న నాలుకను కసుక్కున కోసేయాలనిపించింది దుర్గమ్మకు—

"నువ్వు బాగున్నావు పెళ్ళిచేసుకుంటా" అన్నందుకే అన్నదమ్ము లిద్దరూ కలిసి శూర్పణఖ ముక్కు చెవులు కోసేశారట!—

పరస్త్రీని పట్టుకొని నీ రొమ్ములు బాగున్నాయనే ఈ మనిషి ముక్కు చెవులెవరూ ముట్టుకోరు!

పైగా వాటికి రోజూ మొక్కుతుంటారు?

ఆ మధ్యాహ్నం భర్తవస్తే మెల్లగా అంది దుర్గమ్మ—"నన్ను తీస్కపోయ్యా ఈడ ఉండలేను" అని.

"ఎందుకే. అమ్మగోరూ, దొర శానా మంచోరు—ఉండు." అన్నాడు అయిలయ్య.

ఈ మొద్దు మనిషికెలా చెప్పాలి అని మనసులో భోరున ఏడ్చింది దుర్గమ్మ.

"ఏందిరా పెళ్ళాన్ని చూడకుండా ఉండబుద్ధి అయితలేదా?" అంది వెటకారంగా వాళ్ల మాట్లాడు కొంటుండంచూసి కుమారి.

తల [ఉంటె!] తీసేసినంత పనయింది

---

(వి) చిత్ర విజ్ఞానం






స్త్రీలో ప్రతి సారీ బహిష్ఠు కాలం ఆసన్న మయే సమయంలో ఆవిడ మానసిక ప్రవర్తన మామూలుగా వుండక దానికి వ్యతిరేకంగా వుంటుంది. స్త్రీ నేరస్థుల మీద జరిగిన పరిశోధనలలో వారు తమ బహిష్ఠు కాలానికి అతి దగ్గరగా ఉన్న రోజుల్లోనే నేరాలు చేశారని రుజు వయింది. ఇతర పరిశోధనల్లో పెక్కు మంది స్త్రీలు ఆత్మహత్యలు ఇదే కాలంలో చేసుకున్నారని కూడ తెలిసింది. స్త్రీ దేహంలోని కొన్ని "స్త్రీ హార్మోనులే" యీ అసాధారణ మానసిక ప్రవర్తనకు కారణాలు!

అయిలయ్యకు "ఏం లేదమ్మగారూ. మంచిగ ఉండని చెబుతాన" అంటూ వెళ్ళిపోయాడు- పేగుల్లాగే దుర్గమ్మ ఆ మనిషిని తిట్టుకుంది.

ఎర్రెర్రగా నల్లగా . చండూరం ముక్కలాగున్న దూడ బక్క చిక్కిపోయి ఎముకల గూడులా అయిపోయింది. దాని డొక్క ఎండిపోయింది. కనకయ్య చెంబులు, సర్వలు పాలతో నిండిపోతున్నాయి.

కనకయ్య జేబులు డబ్బుతో నిండి పోతున్నాయి.

కనకయ్య భార్య మెడ బంగారంతో నిండి పోతున్నది!—

ఒకరోజు సాయంకాలం—

దీనంగా తల్లికేసి చూస్తున్నది దూరంగా గుంజకు కట్టివేయబడిన దూడ. బక్కచిక్కిన ఆ దూడను జాలిగాచూస్తూ నిలుచుంది దుర్గమ్మ.

తనముందు ఎరగా పెట్టిన దానాను బర్రె ముట్టుకోవడంలేదు. మాటిమాటికి వెనక్కు తిరిగి దూడవైపు చూస్తున్నది. 'అంబా . బా ." అని అరుస్తున్నది. జీతగాడు ముందుకు వస్తే కొమ్ములతో కుమ్మబోయింది. పొదుగును కడగబోతె తన్నబోయింది.

పాపం! దూడకు 'అంబా' అని అరిచే శక్తైనా లేదు! ఆదూడలో, తన కూతురు కని పించి గుండెలవిసి పోతున్నాయి దుర్గమ్మకు.

జీతగాడు అటు తిరిగాడు. ఇటు తిరిగాడు. మరింత మేత, దానా తెచ్చివేశాడు. కాని బర్రె ఏ మాత్రం సందివ్వడంలేదు. పాలు పితక నివ్వడంలేదు—దగ్గఱికిపోతె కుమ్మబోతున్నది. పలుపును, గుంజను అటూ ఇటూ లాగు తున్నది.

చివరికి ఆ పలుపును తెంపుకొని గబగబా దూడ దగ్గఱికి పరుగెత్తుక వచ్చింది. ఆత్రంగా దూడ తల్లి పొదుగును నోట్లో కఱచుకొని గుటగుట పాలు త్రాగసాగింది. ఆ తల్లి కళ్ళు తృప్తిగా వెలిగిపోతున్నాయి. ముద్దుతో ప్రేమగా బిడ్డను నిమురసాగింది.

వాటిని చూస్తుంటె ఆనందంతో దుర్గమ్మ కళ్ళు చెమర్చాయి.

రాత్రంతా ఆమెకు నిద్రపట్టలేదు—ఆమె కనుల ముందు పలుపు తెంచుకొన్న గేదె- ఆత్రంగా ఆనందంగా పాలు త్రాగుతున్న దూడ కదిలాయి

అక్కణ్నుంచి ఆమెకు పారిపోవాలని ఉంది.

అక్కణ్నుంచి ఆమెకు వెళ్ళిపోవాలని ఉంది.

పాపం పసికందు పాలకేడిస్తే ఎలా? తల్లికి పాలున్నాయి. ఇస్తుంది.

భర్త ఉద్యోగం? పోతుందా పోనీ! ఇది కాకపోతే మరొకటి ఏ కూలైనా చేసుకొని బ్రతకవచ్చు- అసలిదీ ఒక బ్రతుకేనా?

భర్త కోప్పడి తిరిగి తీసుకొస్తే? చచ్చినా రాదు. పిల్లను తీసుకొని వేరే ఉండటానికైనా ఇష్టపడుతుందిగాని మళ్ళీరాదు!

ఆమె ఇక ఒక్కక్షణంకూడా అక్కడ ఉండలేకపోయింది—

తలుపులు తీసుకొని బయటికి వచ్చింది.

ఆమె అడుగులిప్పుడు తడబడడంలేదు.

అప్పుడప్పుడే చీకట్లు తొలగిపోతున్నాయి. తూర్పు సూర్యుణ్ని కనబోతున్నది! □

# పేద భారతీయుడు

శ్రీకృష్ణ రాజారావు

తూరుపు కాంత రక్తవర్ణపు చీర సింగారించుకొని తన దేవుడి కోసం ఆత్రుతతో ఎదురు చూస్తోంది. చలి హోరెత్తిస్తున్నా ఈ డ్యూటీ తప్పదు కదా అనుకుంటూ, రానా వద్దా అని సంశయిస్తూ మబ్బుల్లోంచి తొంగి చూశాడు సూర్యుడు. కృష్ణశాస్త్రి కృష్ణలో స్నానంచేసి, సంధ్య వార్చుకొని, పట్టు పంచ కట్టుకొని, పట్టు ఉత్తరీయం ఛాతీపై కప్పుకొని ఆలయానికి బయలుదేరాడు.

"కౌసల్యా సుప్రజారామా, పూర్వా సంధ్యా ప్రవర్తతే" అంటూ వేంకటేశ్వర సుప్రభాతం పాడుకొంటూ ఆలయం తలుపులు తెరిచాడు.

కృష్ణశాస్త్రిని చూడటం తోటే "అప్పుడే వచ్చావా" అన్నట్లుగా నవ్వాడు ఆపద మొక్కులవాడు.

"వచ్చాను స్వామీ" అన్నట్లుగా కళ్ళతోనే జవాబు చెప్పి, క్రితం రోజు అలంకరించిన పూలదండలను తీసివేస్తుండగా ప్రెసిడెంటుగారి పాలేరు పూలు, పూల దండలు తెచ్చాడు. కృష్ణశాస్త్రి వాటిని అందుకొని తన తృప్తి తీరా స్వామికి అలంకరణచేసి పూజా కార్యక్రమాలు మొదలు పెట్టాడు. బుద్ధిగా కూర్చొని అన్నీ చేయించుకుంటున్నాడు తిరుమల గిరివాసుడు.

ఆంధ్ర దేశానికి మారుమూల అదొక పల్లె. ఊరంతా తోటలు. ఊరికి ప్రక్కగా పారుతున్న కృష్ణమ్మ, దగ్గరలోనే వేంకటేశ్వర స్వామి ఆలయం. ఆలయానికి దగ్గరగా బ్రాహ్మణవాడ. ఇంకాస్త ముందుకు వెళితే హరిజనవాడ, వాడలో పెద్ద చర్చి. ఆ పల్లెలో అన్నివర్ణాలవారు ఉన్నా—హరిజన, బ్రాహ్మణ కుటుంబాల సంఖ్య మాత్రం కాస్త ఎక్కువ. అయినా ఎవరి ఆచారాలు వాళ్ళవి. ఎవరి సాంప్రదాయం వారిది. ఎన్నో తరాలనుంచి అలా సాగిపోతూనే ఉంది వాళ్ళ జీవన స్రవంతి.

కొన్ని తరాలనుంచి సంక్రమించిన వారసత్వం ప్రకారం కృష్ణశాస్త్రి ఆలయ పూజారిగా కాలం వెళ్ళబుచ్చుతున్నాడు. అతని తాతముత్తాతలు గొప్ప పండితులు. దైవభక్తి పరాయణులు. వారి వారసత్వాన్ని పుణికి పుచ్చుకున్నాడు ఇతడు కూడా. తలితండ్రులు చాలా చిన్న తనంలోనే వివాహం చేసినా అతనికి వైవాహిక జీవితపు వాంఛలులేవు. ఎప్పుడూ తను, తన దేవుడు ఇదే అతని ప్రపంచం. స్వామివారికి వైభవోపేతంగా అలంకరణలు చేసి, ఆయనకు ఎదురుగా కూర్చొని పాటలు పాడుకుంటూ ఆ భగవత్ సాన్నిధ్యంలో బాహ్య ప్రపంచాన్ని మర్చిపోయి భక్తి పారవశ్యంలో మునిగిపోతూ ఉంటాడు. అలా ఎన్ని గంటలో గడిపి మెల్లగా ఇంటికి బయలు దేరుతాడు. దారిలోనే ఉన్న ప్రెసిడెంటుగారి ఇంటికిపోయి స్వామివారి ప్రసాదాన్ని ఇచ్చి

ఇంటికి వస్తాడు. కృష్ణశాస్త్రికి ఇల్లంటే ఆల యమే. తను ఉంటున్న ఇల్లు తనది కాదం టాడు. అది తన తలితండ్రుల ఇల్లట. వాళ్ళి ద్దరూ వైకుంఠ వాసులైనా అతనికి ఏ చీకు చింతాలేదు. వాళ్ళు లేనిలోటు అతని భార్య గాయత్రి తీరుస్తుంది.

ఆలయంలో పూజ అయ్యేవరకు కృష్ణశాస్త్రి పచ్చి మంచి నీళ్ళుకూడా ముట్టుకోడు. అందు కనే అతడు ఇంటికి రాగానే వేడివేడి పాలు అందిస్తుంది గాయత్రి.

మౌనంగా గ్లాసు అందుకొని పాలు త్రాగి, మెల్లగా వచ్చి వరండాలో చాప పరుచుకొని ఏ భగవద్గీతో, రామాయణమో, భారతమో చదువుకుంటూ కూర్చొంటాడు.

వంట కార్యక్రమం పూర్తి అయ్యాం తరు వాత అన్నీ వడ్డించి "భోజనానికి లేస్తారా" అని గాయత్రి కేకవేస్తే-

చదువుతున్న పుస్తకాన్ని మూసి వెళ్ళి మౌనంగా ఆమె పెట్టింది తిని బయటకు వచ్చేస్తాడు.

ఇది వండలేదేమిటి. అది వండ లేదేమిటి అంటూ ఎప్పుడూ అతడు అడగడు. అడిగే అవకాశం గాయత్రి ఇవ్వదు. అతనికి ఏది ఇష్టమో ఆమెకు తెలుసు.

ఇదిలేదు, అదిలేదు అంటూ అతన్ని ఎప్పుడూ విసిగించదు గాయత్రి. కృష్ణశాస్త్రిపై ఉన్న అభిమానం కొద్ది ఊరివాళ్ళే అన్ని వస్తువులు సమకూరుస్తారు.

భోజనం కాగానే కాసేపు విశ్రాంతి తీసు కొని, సాయంత్రం ఆలయానికి వెళితే మళ్ళీ రాత్రికి ఎప్పటికోరాక, మౌనంగా భోజనంచేసి గాయత్రి వేసిన ప్రక్కపై నడుం వాల్చుకొంటే తెల్లారి మళ్ళీ ఆమె లేచేవరకు నిద్ర మెళకువ రాదు. ఇద్దరి మధ్యా ఎక్కువ మాటలతో పని లేకుండా కాలం గడిచి పోతుంది.

* * *

కృష్ణశాస్త్రి త్రుళ్ళిపడుతూ లేచాడు, కిటికీ లోంచి సూర్యకిరణాలు ముఖంమీదపడి చురు క్కుమనే సరికి.

అరే సూర్యోదయం అయిపోయింది. ఇంతవరకు తనని లేపకుండా గాయత్రి ఎక్కడి కెళ్ళింది అనుకుంటూ గబగబా లేచి గాయత్రి కోసం ఇల్లంతా వెతికాడు. పెరట్లో చూశాడు. ఎక్కడాలేదు.

బయటకువచ్చి ప్రక్క ఇంటి వాళ్ళని ఎదురింటి వాళ్ళను అడిగాడు. అక్కడా లేదనే సమాధానం.

'స్వామివారి ఆరాధనకు వేళ మించిపోతుంది, కృష్ణకు వెళ్ళే టైం కూడాలేదు' అనుకుంటూ పెరట్లోనే స్నానంచేసి తలుపులు దగ్గరగావేసి ఆలయానికి బయలుదేరాడు.

ఎందుకనో మనసు మనసులోలేదు. ఎన్నో ఆలోచనలు. ఎంత ప్రయత్నించినా పూజవైపు మనసు లగ్నం కావటంలేదు. అందుకే "దేవా ఈ రోజెందుకనో మనస్సు నీయందు లగ్నం చేయలేక పోతున్నాను. నన్ను క్షమించు" అంటూ ఒక నమస్కారంచేసి ఇంటికి బయలు దేరాడు.

తను దగ్గరగా వేసి వెళ్ళిన తలుపులను తిరిగి తనే తెరిచాడు. ఎన్నడూ లేంది ఇల్లంతా శూన్యంగా కనిపించింది.

తను ఆలయం నుంచి రాగానే వేడివేడి పాలు అందించే గాయత్రిలేదు.

తను ఏ భగవద్గీతో చదువుకుంటూ కూర్చొని ఉంటే "భోజనానికి లేస్తారా" అని పిలిచే గాయత్రిలేదు.

ఎక్కడి కెళ్ళింది?

ఏమిటి తనీ రోజు ఇలా అయిపోతున్నాడు, వాంఛలకు దూరంగా ఉన్నా ఏదో తెలియని ఆరాటం! తాళి కట్టిన పాపానికి ఇలా తను క్రుంగిపోతున్నాడా?

సమాధానం దేనికీ దొరకటంలేదు. బీరువా లోంచి భగవద్గీత తీసుకొని వరండాలో చాప పరచుకొని చదువుకుంటూ కూర్చొన్నాడు. పేజీలు తిరగవేస్తూ ఉంటే చిన్న తెల్లకాయితం మీద ముత్యాల్లాంటి అక్షరాలు కనిపించాయి, ఆ వ్రాత గాయత్రిది.

వాంఛలకు అతీతంగా, పరమ భక్తుడిలా

"నాకు విపరీత మైన క్షోభ కలిగిస్తున్నావు, నీలో నే ఉండలేకపోతున్నాను."

"నేను నీకు క్షోభ కలిగిస్తున్నానా... .. అబద్ధం."

"ఎవరినైనా మోసం చేయగలవేమో గాని, నన్ను నువ్వు మోసం చేయలేవు."




ఉన్న మీకు సేవ చేసుకొనే భాగ్యం నాకులేదు. అందుకే వెళ్ళిపోతున్నా. నిండు మనసులో మీరు క్షమిస్తారని నాకు తెలుసు.

—గాయత్రి.

ఆ చిన్న కాయితం చదువుతుంటే ప్రపంచమంతా గిర్రున తిరిగి నట్లయింది. నోటిమాట రాలేదు.

గబగబా గీతలో తన కిష్టమైన భక్తి యోగాన్ని రెండు మార్లు పఠించిన కాసేపటికి మనస్సు శాంతించింది. కాస్సేపు కళ్ళుమూసుకొని ధ్యానంలో అలాగే కూర్చొండి పోయాడు కృష్ణశాస్త్రి.

"ఎవరు నువ్వు?" ఎదురుగా తనలాంటి మనిషే హఠాత్తుగా కన్పించడంతో గద్దించినట్లుగా అడిగాడు కృష్ణశాస్త్రి కళ్ళు తెరచి.

"నీ అంతరాత్మను."

"అయితే బయటకు ఎందుకు వచ్చావు?"

కృష్ణశాస్త్రి ఏం మాట్లాడలేకపోయాడు.

"నువ్వు వాంఛలనుఅణుచుకుంటున్నావు" మళ్ళీ అంది అంతరాత్మ.

"నేను వాంఛలను అణుచుకుంటున్నానా.... శుద్ధ అబద్ధం."

"నేముందే చెప్పానుగా నన్ను మోసం చేయలేవని."

"సరే నువ్వు చెప్పేదేదో చెప్పు."

"నీకు వాంఛలను అణుచుకొనే శక్తి ఉండవచ్చు, కానీ ఎదుటి మనిషి వాంఛలు ఎలా చంపుకో కలదు? అందుకే గాయత్రి వెళ్ళిపోయింది. నువ్వు వట్టి మూర్ఖుడివి. కామిగాని వాడు మోక్షకామి కాడు అన్న సూక్తి తెలియదా?"

"తెలుసు, కానీ మోక్షం కోసం నేను కామిని కాలేను. అసలు నాకు మోక్షమే అక్కర్లేదు, నాకు కావలసింది మనసా వాచా ఆ దేవదేవుణ్ణి కొలుచుకుంటున్నానన్న తృప్తి"

"నువ్వు ఎంత వాదించినా గాయత్రి వెళ్ళిపోటానికి కారకుడవు నువ్వు . నువ్వు ." అంతరాత్మ ఘోషిస్తూంది.

కళ్ళు మూసుకొని మళ్ళీ కళ్ళు తెరిచేసరికి ఎదురుగా తన రూపంలేదు. అంతా భ్రమ చిన్నగా నిట్టూర్పు నిర్లిప్తత. ఆలోచనలతో ఎన్నో గంటలు గడిచి పోతున్నాయి.

ఈ రోజుకు శెలవు అన్నట్లుగా సూర్యుడు పడమటి సుందరి ఒడిలోకి ఒదిగిపోతూ ఏం శృంగారం అభినయించాడో వళ్ళంతా కంది పోయింది సుందరికి.

కృష్ణశాస్త్రి మెల్లగా లేచి పెరట్లోనే స్నానం చేసి ఆలయానికి వెళ్ళటానికి ఉద్యుక్తుడౌతున్నాడు. ఉదయంనుంచి ఆహారం ఏమీ తీసుకోక పోవటంవల్ల చాలా నీరసంగా ఉన్నాడు. 'పాలు త్రాగారా?' 'భోజనం చేశారా' అని అడిగిన వాళ్ళులేరు. పెద్దలు ఏ పనిచేసినా యోచించి చేస్తారు కాబోలు.... ఎవరికి ఎవరు తోడులేకున్నా 'నేను నీకుతోడు' 'నీవు నాకు తోడు' అని అనుకోవటం కోసం వేసిన బంధమే వివాహమా? ఎక్కడెక్కడ తిరిగి వచ్చినా ఇంటికి రాగానే ఆప్యాయంగా పలకరించే తోడు భార్యా?

ఏమిటో గాయత్రి లేనిలోటు తన కిప్పుడు తెలుస్తూంది. భక్తుడికి దేవుడికి మధ్య అగాధం లాంటిది ఈ సంసార బంధం అనుకొని కోరికలను త్యజించాడు తను. తన పద్ధతి సరి అయినది కాదా?

"కృష్ణశాస్త్రిగారూ" వాకిట్లో ఎవరో పిలుస్తుంటే వరండాలోకి వచ్చాడు కృష్ణశాస్త్రి.

ఎదురుగా ప్రెసిడెంటు లక్ష్మిపతి. ఒక్క క్షణం ఆశ్చర్యపోయాడు. ఎన్నడూ ఈ సమయంలో రాని ప్రెసిడెంటుగారు రావటం విడ్డూరమే. అతిథి మర్యాద గుర్తుకువచ్చి గదిలోంచి కుర్చీ తీసుకొచ్చి వరండాలో వేసి.

"అలా నిలబడే ఉన్నారే...రండి" అంటూ ఆహ్వానించాడు.

మౌనంగావచ్చి కుర్చీలో కూర్చున్నాడు లక్ష్మిపతి. కృష్ణశాస్త్రి చేతులు కట్టుకొని అలా నిలబడే ఉన్నాడు.

"గాయత్రి లేదటగా " లక్ష్మిపతే ముందుగా మాట్లాడాడు.

"లేదు వెళ్ళిపోయింది."

"ఎక్కడికి?"

"తెలియదు."

"పకీరుకూడా లేడట" అసలు విషయం ఎలా చెప్పాలో అర్థంకాక అన్నాడు లక్ష్మిపతి.

గాయత్రి వెళ్ళిపోటానికి, పకీరు లేకపోటానికి సంబంధం ఏమిటి అని మనస్సులో అనుకున్నా పైకి మాత్రం.

"ఆఁహా" అన్నాడు కృష్ణశాస్త్రి.

"ఆహా ఏమిటి పకీరు గాయత్రి కలిసి పట్నం వెళ్ళే బస్సులో ఎక్కటం ముగ్గురు చూశారు."

ఆ క్షణంలో గుండె ఆగి చచ్చిపోతే బాగుండును అనిపించింది కృష్ణశాస్త్రికి. లేకపోతే ఒక ముస్లింతో-రోజూ మడి, ఆచారం, పూజలు పునస్కారాలలో తేలియాడే గాయత్రి వెళ్ళిపోవటమా! వాంఛలకు కులమతాలతో ప్రసక్తేదా?

ఏం మాట్లాడలేక మౌనంగా నిలుచుండి పోయిన కృష్ణశాస్త్రిని చూస్తూ

"ఆలయం రాకాలు ఇలా ఇష్టాంకి' అన్నాడు లక్ష్మిపతి.

"అంటే " అర్థం కానట్లుగా అడిగాడు కృష్ణశాస్త్రి.

"ఈరోజునుంచి మీరు ఆలయానికి రావలసిన పనిలేదు."

"భగవాన్ నా గుండెకు ఇంతటి నిబ్బరం పెట్టావేమిటి. ఒక్కొక్కమాట అగ్ని పర్వతాల్లా బద్దలు అవుతుంటే ఈ గుండె ఆగిపోదేమిటి!" అనుకొన్నాడు కృష్ణశాస్త్రి.

"తాళాలిస్తే నే వెళతాను."

"నేనేం తప్పు చేశాను?" దండిస్తున్న ఉపాధ్యాయుణ్ణి ప్రశ్నిస్తున్న పసివాడిలా అడిగాడు.

"నీ భార్య తప్పు చేసింది"

"అందుకు నాకా శిక్ష?"

"రెండు చేతులు కలిస్తేనే చప్పట్లు మ్రోగేది. మీలో ఏ లోపం లేకపోతే గాయత్రి పకీరుతో ఎందుకు వెళ్లిపోతుంది?" కృష్ణశాస్త్రి మగతనాన్ని సవాలు చేస్తున్నట్లుగా ప్రశ్నించాడు లక్ష్మీపతి కుర్చీలోంచి లేస్తూ.

సమాధానం ఏం చెప్పకలడు. అందుకే చేతిలో ఉన్న తాళాలను లక్ష్మీపతి కిచ్చేశాడు. అప్పుడే ఒకరి కళ్ళల్లోకి ఒకరు సూటిగా చూసుకున్నారు ఇద్దరి కళ్ళల్లో కన్నీళ్ళే.

"శాస్త్రిగారూ—మీ రెంతటి భక్తులో నాకు తెలుసు. కానీ మన బ్రాహ్మణ వాడలోని పెద్దల నిర్ణయం ప్రకారం నడవవలసి వచ్చింది. అందుకు నన్ను క్షమించండి" అంటూ నిండు మనసారా నమస్కారంచేసి వడివడిగా నడుచు కుంటూ వెళ్ళిపోతున్న లక్ష్మీపతిని చూస్తూ నిలుచొండిపోయాడు కృష్ణశాస్త్రి.

ఇంతవరకు ఇల్లే శూన్యంగా కనిపించింది. ఇప్పుడు ప్రపంచమంతా శూన్యంగా కనిపిస్తోంది. తరాలుగా వస్తున్న పూజారిత్వం ఈ రోజు తనతో ముగిసిపోయింది. ఒక విధంగా బ్రాహ్మణవాడ అంతా తనని వెలివేసినట్లే. ఏం మనుషులు వీళ్ళు! తప్పుచేసిన వాళ్ళను వదిలివేసి తప్పుచేయని వాళ్ళకా శిక్షవిధించేది!

ఈ ఆలోచనలు ఎప్పుడూ ఉండేవే. కాసేపు ఆలయానికి వెళితే కాస్త మనస్సు శాంతిగా ఉంటుంది. పూజారిగా తను పనికిరాడని చెప్పారుగాని ఒక భక్తుడిలా వెళితే ఎవరు అభ్యంతరం చెపుతారు.

తలుపులు చేరవేసి ఆలయానికి బయలు దేరాడు. మెల్లగా తను నడుస్తుంటే ఎన్నడూ లేంది అందరూ కొత్తగా వింతగా తనవంకే చూస్తుంటే సిగ్గుతో కుంచించుకుపోయాడు. గాయత్రి లేచి పోయిందన్న వార్త ఊరంతా తెలిసిపోయి ఉంటుంది. పల్లెటూరు కదా ఇలాంటి వార్తలు త్వరగా వ్యాపిస్తాయి. గుడి చుట్టూ మూడుసార్లు ప్రదక్షిణ చేసివచ్చి బయటే తన దేవుడు కనిపించేలా కూర్చున్నాడు. ఆయనకు కూడా తనమీద కోపం వచ్చిందేమో నని పరీక్షగా చూశాడు.

"నువ్వు నాకు పూజచేయటానికి అనర్హుడివి" అన్నట్లుగాలేదు, ఆయన చూపు. "ఏమిటీ ఇంకా బయటే కూర్చొన్నావు రా వచ్చి నీ పూజా కార్యక్రమాలు మొదలుపెట్టు" అని ఆప్యాయంగా పిలుస్తున్నట్లుగా ఉంది.

రామశాస్త్రి పూజచేస్తున్నాడు. మంత్రాలు తనకి స్పష్టంగా వినిపిస్తున్నాయి. చాలాచోట్ల మంత్రాల్లో అపస్వరాలు పలుకుతున్నాయి. విగ్రహాలంకరణకూడా ఏం బాగాలేదు.

పరులకు దత్తు వెళ్ళిపోతున్న పసివాడు తనకు జన్మ నిచ్చిన తల్లితండ్రులవైపు దీనంగా చూస్తున్నట్లుగా ఉంది ఆ దేవుడి చూపు. కళ్ళల్లోని ఆవేదన తనకి తెలియకూడ దని కాబోలు కళ్ళపై నామాలు దిద్దుకున్నాడు. అయినా తనకు ఆయన దీనమైన చూపులు, ఆవేదన కనిపిస్తూనే ఉంది.




రెండు వందల మిలియను సంవత్సరాల క్రితం మన ప్రపంచంలో ఒకే ఒక భూభాగం వుండేది! 180 మిలియను సంవత్సరాల క్రితం, ఇది ఉత్తర (లారేసియా) దక్షిణ (గొండ్వానా) భాగాలుగా విడివడింది. లారేసియా నుండి ఉత్తర అమెరికా, గ్రీన్‌లాండ్, ఐరోపా, ఆసియా ఖండాలు పుట్టాయి. గొండ్వానా నుండి దక్షిణమెరికా, ఇండియా, ఆస్ట్రేలియా, అంటార్కిటికాలు విడివడ్డాయి ఈ ఖండాలు యిప్పటికీ ఒకదాని నుండి మరొకటి దూరంగా జరిగిపోతున్నాయి (Continental Drift)!

స్వామివారికి ప్రసాదం నివేదనచేసి బయటకు వచ్చిన రామశాస్త్రికి యోగిలా కూర్చొన్న కృష్ణశాస్త్రిని చూసేసరికి పరమానందం కలిగింది. తన గొప్ప తెలియ చేసుకొనేందుకు "ఏమిటోయ్ బయటే కూర్చొన్నావు", అంటూ పలకరించాడు.

"ఏం లేదు ." క్లుప్తంగా జవాబుచెప్పాడు కృష్ణశాస్త్రి.

"ఈ రోజునుంచి నన్ను ఆలయ పూజారిగా నియమించారు."రామశాస్త్రి గర్వంగా జంధ్యాన్ని చేతులతో సవరించుకుంటూ చెపుతుంటే నిర్లిప్తంగా నవ్వుకున్నాడు కృష్ణశాస్త్రి.

రామశాస్త్రికి తనంటే ఎప్పుడూ ఈర్ష్యే! ఎందుకో మరి కారణం తెలియదు.

'తన పదవి నాకొచ్చిందని ఏడుపు కాబోలు ఉలుకు పలుకు లేకుండా కూర్చొన్నాడు' అనుకొంటూ గొణుక్కుంటూ లోపలకు వెళ్ళిపోయాడు రామశాస్త్రి.

చీకటి బాగా చిక్కబడింది. కీచురాళ్ళు వింత ధ్వనులు చేస్తున్నాయి. ఆకాశంలో చుక్కలు మిణుకు మిణుకు మంటున్నాయి. అప్పటివరకు కళ్ళుమూసుకొని ధ్యానంలో మునిగిపోయిన కృష్ణశాస్త్రి మెల్లగా కళ్ళు తెరిచాడు. చుట్టూ చీకటి.. ఆలయం తలుపులు తాళాలువేసి ఉన్నాయి. మెల్లగా లేచి ఇంటికి బయలుదేరాడు.

"ఈ రోజు స్నానానికి రాలేదేం" అన్నట్లుగా కృష్ణమ్మపైనుంచి వచ్చిన గాలి ఒడలంతా తడిమి వెళ్లింది. ఊరంతా నిద్రపోతుంది.

అక్కడక్కడా వీధి కుక్కలు మాత్రం "భోయ్" అంటూ అరుస్తున్నాయి.

ఈ రోజల్లా తనకు ఉపవాస దినమే. ఇంటికి వచ్చాడు. ఇల్లంతా చీకటి రంగు పూసుకున్నట్లుగా ఉంది. లైటన్నా వెలిగించుకోకుండా చీకటిలోనే మంచం వాల్చుకొని పడుకున్నాడు. మళ్ళీ ఆలోచనలు

తనకు పెళ్ళయి పది సంవత్సరాలైనా, గాయత్రి కాపురానికొచ్చి మూడేళ్ళే. గాయత్రి కొత్తలో తనని ఎంతగా కవ్వించేది.

అవసరం ఉన్నా లేకపోయినా తనని రాసుకుంటూ తిరిగేది. స్నానం చేయగానే ఆ తడి బట్టల్లో వచ్చి తన ఎదురుగా నిలుచునేది. తడి బట్టల్లోంచి ఆమె యవ్వనపు పొంగులు అణువు అణువు కనిపిస్తుంటే తనలో ఆవేశ తరంగాలు ఉవ్వెత్తున లేచినా, పొంగే పాలపై నీళ్ళు చిలకరించినట్లుగా భక్తిమార్గం కనపడేది. ఎన్నో రాత్రులు హఠాత్తుగా మీదపడి తన వక్షద్వయాన్ని తన గుండెలకు గాఢంగా అదిమి తనలో కామవాంఛ పొంగించేందుకు ఎన్నో ప్రయత్నాలు చేసింది. అయినా తను పాషాణమే.

"నన్నెందుకు పెళ్ళిచేసుకున్నారు?" అంటూ ఒకసారి సూటిగా ప్రశ్నించింది గాయత్రి.

"నే చేసుకోలేదు! నా తల్లితండ్రులు చేశారు"

"మీ ఇష్టం లేకుండానే చేశారా?"

"నా కప్పుడు చిన్న వయస్సు. నా ఇష్టాయిష్టాలతో వాళ్ళు ప్రమేయం పెట్టుకోలేదు .. గాయత్రీ నాకు ఈ వాంఛలులేవు. అనవసరంగా నాపై ఆశలు పెంచుకోకు." అంటూ ఖచ్చితంగా చెప్పేశాడు ఓ రోజు.

ఆ తరువాత తన తల్లి తండ్రులు కొద్ది రోజుల తేడాతో స్వర్గస్థులు కావటంతో ఇంటి బాధ్యత గాయత్రి తీసుకొంది. మెల్లమెల్లగా పరిస్థితులతో రాజీపడిపోయింది. ఆ నాటినుంచి గాయత్రి తన సేవకురాలు. ఇప్పుడు అర్థం అవుతుంది, గాయత్రి ఇన్నాళ్ళు ఆలంబన కోసం ఎదురు చూసింది. ఆసరాగా పకీరు దొరికాడు.

వెళ్ళిపోయింది. ఆమెలో ఏ తప్పూలేదు.

అసలు తనలో ఇంత భక్తి భావం పెరగటానికి తన తల్లే కారణం. చిన్నప్పుడు భారతం, రామాయణం, శివపురాణం, భగవద్గీత ఇలా ఎన్నో భక్తి ప్రధానమైన పుస్తకాలలోని సారాంశాన్ని తనకు పాలతో కలిపి పట్టించింది ...కళ్ళల్లోకి నిద్రాదేవత రావటంతో కళ్ల మూసుకున్నాడు కృష్ణశాస్త్రి.

* * *

"శాస్త్రిగారూ మీ భార్య లేచిపోయిందటగా." వరండాలో కూర్చొని రామాయణం చదువు



కుంటున్న కృష్ణశాస్త్రి తలఎత్తి చూశాడు. ఎదురుగా ఇకిలిస్తూ నిలబడ్డాడు ఆచారి. ఆచారి ప్రక్కవూరి పూజారి. అంటే ఈ వార్త ప్రక్కవూరికి కూడా వ్యాపించిందన్నమాట.

అతనితో మాట్లాడటం ఇష్టం లేకపోయినా మర్యాదకోసం

"రండి ఇలా వచ్చి కూర్చోండి" అన్నాడు.

ఆచారివచ్చి చాపమీద కూర్చొన్నాడు.

"మా వూరంతా గుప్పుమనేసరికి ఏదో కష్టకాలంలో ఉన్నారు కదా పలకరించి పోదామని వచ్చాను. అసలు ఏం జరిగింది"అన్నాడు ఆచారి.

అతడు సానుభూతితో అంటున్నాడో, వ్యంగ్యంగా అంటున్నాడో కృష్ణశాస్త్రికి అర్థం కాలేదు.

"ఏమిటండీ ఇందాకటి నుంచి నేనే మాట్లాడుతున్నాను, ఒక్కదానికి సమాధానం చెప్పరేమిటి?"

"ఏం సమాధానం కావాలి మీకు?"

"మీ భార్య ఎందుకు లేచిపోయింది?"

"అది నా భార్యను అడగవలసిన విషయం" విసుగ్గా అన్నాడు కృష్ణశాస్త్రి.

"అయ్యో ఏదో పలకరించి పోదామనివస్తే విసుక్కుంటారేమిటి, అయినా సంసారానికి పనికిరాని వాళ్ళ భార్యలే లేచిపోవటం జగమెరిగిన సత్యం. ఎప్పుడూ ఈ గుళ్ళు రామాయణాలు కాకుండా కాస్త డాక్టరు దగ్గరకుపోయి మీలో లోపం ఏమిటో తెలుసుకోండి. వస్తా" అంటూ విసురుగా లేచి వెళ్ళిపోతున్న ఆచారిని చూస్తూ "ఎందుకు వచ్చినట్లు ఎందుకు వెళ్ళినట్లు" అనుకున్నాడు. లీలగా ఆ ఉదయం జరిగిన సంఘటన గుర్తుకు వచ్చింది.

తను స్నానంచేసి వచ్చేవరకు ఒడ్డునే నిలబడే హరిజనవాడ నాయకుడు ఆనందం ఈ రోజు తను స్నానం చేస్తుంటే కృష్ణలో దిగి తనకు దగ్గరగా వచ్చి మరీ కడవతో నీళ్ళు ముంచుకు పోతూ.

"ఏం పంతులు నీ పెళ్ళం లేచిపోయిందటగా" అంటూ ఎంత హీనంగా మాట్లాడాడు.

"దేవుడికి నాలుగు పూలేసి పూజచేయటమే కాదు. పెళ్ళాంతో సంసారం చేయటం కూడా వచ్చి ఉండాల" అంటూ తనకి గీతోపదేశం కూడా చేశాడు.

ఇంకా నలుగురైదుగురు ఇలాగే మాట్లాడారు. ఏమిటి వీళ్ళంతా ఇలా పరిహసిస్తున్నారు....నిజంగా తను వైవాహిక జీవితానికి

పనికిరాడా? తనకి మగతనం లేదా? అందుకేనా ఇన్నాళ్ళు కోరికలు లేకపోవటం! ఆలోచనల మీద ఆలోచనలు. రామాయణం పుస్తకాన్ని బీరువాలో పెట్టి వచ్చి మళ్ళీ వరండాలో కూర్చొన్నాడు. తన బ్రతుకు కుక్క బ్రతుక్కంటే హీనం అయిపోయింది. వూళ్ళో వాళ్ళందరూ తనని తన్నినా బాధపడేవాడు కాదు. కానీ తుపాకి గుళ్ళకంటే పదునుగా గుండెల్ని కోసేసే మాటలు.

"సంసారానికి పనికిరాని వాళ్ళ భార్యలే లేచిపోవటం జగమెరిగిన సత్యం."

"దేవుడికి నాలుగు పూలేసి పూజచేయటమే కాదు పెళ్ళాంతో సంసారం చేయటం వచ్చి ఉండాల."

మళ్ళీ మళ్ళీ గుర్తుకు వస్తున్నాయి. ఉన్నట్లుండి ఈ వూరి వారందరిమీద కోపం, ద్వేషం గుండెల్ని చీల్చుకొని ఆవేశంగా బయటికి వస్తున్నాయి. తన మగతనం నిరూపించుకోవాలి. ఎలా? ఎలా? ఇన్నాళ్ళ నిగూఢంగా దాగి ఉన్న కామక్రోధాలు ఒక్కసారి విజృంభిస్తున్నాయి. శరీరం కోరికలతో కాగిపోతుంది. ఇన్నాళ్ళు అక్కర్లేని "అనుభవం" ఇప్పుడు కావాలి కావాలి అంటూ గోలచేస్తుంది హృదయం. ఆవేశంగా లేచి బయలుదేరాడు. అప్పటికే చీకటి పడిపోయింది. వడివడిగా నడుస్తున్నాడు.

తను ఎక్కడికి వెళుతున్నాడో ఏం చేయాలనుకుంటున్నాడో అతనికే అర్థం కాలేదు. కృష్ణమ్మ గాలి వంటికి చల్లగా తగిలేసరికి కాస్త ఆగాడు కొద్దిగా ఆలోచిస్తున్నాడు.

తను ఇక్కడ కెందుకు వచ్చాడు? ఏముందిక్కడ? ఎవరో వస్తున్నట్లుగా అడుగుల చప్పుడు వినిపించి వెనక్కి తిరిగి చూశాడు. ఎవరో ఓ మనిషి నీళ్ళ చెంబు పుచ్చుకొని అటుగా వస్తూంది. పల్లెటూళ్ళల్లో ఆడవారు "అవసరం" తీర్చుకోవటానికి వచ్చే సమయమది. దగ్గరిగా వచ్చిన ఆ మనిషిని పరికించి చూశాడు. ఆమె హరిజనవాడ నాయకుడు ఆనందం కూతురు నీలి.

నీలి కృష్ణశాస్త్రిని చూసి తలవంచుకొని గబగబా ప్రక్కనుంచి వెళ్ళిపోతుంటే కృష్ణశాస్త్రి మెదడులో దురాలోచన మెరిసింది.

'నీలీ' రహస్యం చెబుతున్నట్లుగా పిలిచాడు.

నడుస్తున్నదల్లా ఆగి వెనక్కి తిరిగి చూసింది నీలి.

కృష్ణశాస్త్రి మోహావేశంతో, పరుగులాంటి నడకతో నీలికి దగ్గరగా వచ్చాడు.

నీలి భయంతో రెండడుగులు వెనక్కి వేసింది. అయినా ఆమె చేతిని గట్టిగా పట్టుకొని ఆపాడు.

'బాబుగోరు మేం అంటరాని వాళ్ళం' అంది. ఎన్నడూ తన వంకైనా సరిగ్గా చూడని కృష్ణశాస్త్రి ప్రవర్తన ఆమెకు భయం, కంగారు కలిగించాయి.

"నీలీ నువ్వు కావాలి" అంటూ గట్టిగా కౌగిలించుకున్నాడు. నీలి చేతిలోని నీళ్ళచెంబు క్రింద పడిపోయింది. జరగబోయే ప్రమాదం గ్రహించి గట్టిగా విదిలించుకో బోయింది. ఉడుం పట్టులా పట్టుకున్నాడు కృష్ణశాస్త్రి.

"బాబుగోరు తమలాంటి మంచోళ్ళు చేయవలసిన పనికాదిది. దయచేసి నన్నొదలండి" ఏడుస్తూ వేడుకుంది నీలి.

ఆమె మాటలు అతనికి వినపడటంలేదు. గింజుకుంటున్న ఆమెను మరింత దగ్గరగా తీసుకొని మొహమంతా ముద్దులతో నింపసాగాడు.

"రక్షించండి" అంటూ పెద్దగా కేకపెట్టింది నీలి.

ఆమెకేకె ఏ "ఆపద మొక్కుల"వాడి చెవులకు సోకలేదు. మళ్ళీ కేకపెట్టకుండా కృష్ణశాస్త్రి ఆమె నోటికి అడ్డంగా తన చేతిని గట్టిగా నొక్కిపట్టి, ఎక్కడలేని బలాన్ని ప్రదర్శించి ఆమెను మావిడి తోటలోకి లాక్కుపోయాడు ఆకలితో ఉన్న సింహంలా.

నీలి మేక పిల్లలా గింజుకుంది. అతన్ని గోళ్ళతో రక్కింది.

జుట్టంతా పీకింది. చేయవలసిన ప్రయత్నమంతా చేసి చివరకు నిస్సహాయంగా అతని చేతిలో ఓడిపోయింది.

స్వర్గంలో తేలియాడుతున్న కృష్ణశాస్త్రి ఒక్కసారి తేరుకున్నాడు. ఒక్క క్షణంలో మనిషి పశువులా ఎలా మారగలడో తెలుసుకున్నాడు. తను చేసిన పొరపాటు గ్రహించాడు. అప్పటికే అతన్ని విదిలించుకొని నీలి ఏడుస్తూ వెళ్ళిపోయింది.

కృష్ణశాస్త్రికి ఒక్కసారి భయంవేసి వళ్ళంతా చెమటలు పట్టాయి.

నీలివెళ్లి వాళ్ళ వాళ్ళతో చెపితే అప్పుడు తన పరిస్థితి?

గబగబా ఇంటికి వచ్చేశాడు. ఎదురయ్యే పరిస్థితులు ఆలోచిస్తూ చీకటిలోనే కూర్చొన్నాడు. ఉన్నట్టుండి పెద్దగా కేకలు వినబడటంతో బయటకు వచ్చాడు. లాంతర్లతో హరిజన వాడంతా నడిచి వస్తూంది. అందరి చేతుల్లో కత్తులు, కొడవళ్ళు, గొడ్డళ్ళు ఉన్నాయి. ఆనందం ఉగ్రనరసింహమూర్తిలా ఊగిపోతూ కేకలు పెడుతుంటే ఊరు ఊరంతా మేల్కొంది. వీళ్ళందరూ తన ఇంటి వైపే వస్తున్నారు తనని చంపేస్తారా? ప్రాణ భయంతో గబగబా పెరట్లో ఉన్న గడ్డికుప్పలో దాక్కున్నాడు. కేకలు మరింత దగ్గరగా వినిపిస్తున్నాయి. అందరూ కృష్ణశాస్త్రి ఇంటి ముందు ఆగారు.

"ఏరా పంతులూ నా బిడ్డ జీవితం నాశనం చేస్తావురా రా బయటకు నిన్ను ఈ రోజు నరికి పాతేయాలి " అరుస్తున్నాడు ఆనందం.

ప్రెసిడెంటు లక్ష్మీపతి విషయం తెలుసుకోవటానికి వచ్చాడు.

"అరే ఆనందం ఏమిటిరా ఇదంతా" కంగారుగా అడిగాడు లక్ష్మీపతి.

"ఏమిటని మెల్లగాఅడుగు తావేమిటయ్యా. మీ బావనోడు నా బిడ్డని అన్యాయం చేశాడు. ఈవాళ ఆ నా కొడుకుని చంపిగాని నేవెళ్ళను"

"అర్థం లేకుండా మాట్లాడకు. నీ కూతురికి అన్యాయం చేస్తే ఆ విషయం పంచాయితీ జరిపి నేరస్థుణ్ణి శిక్షించాలిగాని ఇలా దౌర్జన్యం జరపటం మంచిపని కాదు" గ్రామ పెద్దగా హెచ్చ

రించాడు లక్ష్మీపతి.

అతని హెచ్చరిక ఎవరూ లక్ష్యపెట్టలేదు. వాడలోని అందరికి ప్రతీకారం తీర్చుకోవాలనే కాంక్ష పెరిగి పోయింది.

"ఇంకా చూస్తారేమిటిరా వాడి ఇల్లు తగల పెట్టండి," కేకపెట్టాడు ఆనందం.

"మీరు ఇల్లు తగల పెడుతుంటే చూస్తూ కూర్చోటానికి ఇక్కడ ఎవరూ గాజులు తొడుక్కోలేదు" అంటూ పెద్దగా తన వాళ్ళనందరిని పేరుపేరున కేకపెట్టాడు లక్ష్మీపతి.

అతని కేకకోసమే ఎదురుచూస్తున్న వాళ్ళందరూ కత్తులు, గొడ్డళ్లు భుజాన వేసుకొని రంగంలోకి దిగారు.

"నాకు న్యాయం చేయకపోగా మీ బాపనోళ్ళందరూ కలిసి నాకు అడ్డం వస్తారా. ఈ రోజు ఈ వూళ్ళో ఒక్క బాపనోడు కూడా లేకుండా నరికి పారేస్తాం. ఆ గుడిని బద్దలు కొట్టేస్తాం". ఇష్టం వచ్చినట్లుగా అరుస్తున్నాడు ఆనందం.

"మీరు మమ్మల్ని చంపి మా గుడిని బద్దలు కొడితే, మేం మిమ్మల్ని చంపి మీ చర్చిని భూస్థాపితం చేస్తాం."

అందరూ పెద్దగా కేకలు పెడుతున్నారు. ఆడవాళ్ళందరూ భయంతో ఏడుస్తున్నారు. చూడటానికి అదో చిన్న కురుక్షేత్రంలా ఉంది

కాసేపాగితే రక్తం వరదలై కృష్ణలో కలవటానికి సిద్ధంగా ఉంది. పరిస్థితి అంతా గమనించాడు కృష్ణశాస్త్రి. ఒక్క క్షణం కూడా ఆలస్యం చేయకుండా స్థిరచిత్తంతో గడ్డి కుప్ప లోంచి బయటకు వచ్చి

"ఆగండి" అంటూ పిడుగులా అరిచాడు.

కలకలం ఆగిపోయింది. అందరి దృష్టి కృష్ణశాస్త్రి పై నిలిచింది.

"తప్పు చేసింది నేను. నా గురించి రక్తపాతం జరగటానికి వీల్లేదు", గంభీరంగా కృష్ణశాస్త్రి చెపుతుంటే

"అణ్ణి చంపండి " ఎవరో అరిచారు.

నలుగురు వాడలోని హరిజనులు ముందుకు ఉరికారు అతణ్ణి చంపటానికి.

"ఆయన్ని చంపటానికి వీల్లేదు" అంటూ అరిచింది ఓ కంఠం. ఆ కంఠం నీలిది. అందరూ ఆశ్చర్యపోయారు.

"ఏమిటే నీకు పిచ్చి పట్టిందేమిటే."

"ఇది పిచ్చి కాదయ్యా ఆవేదన . . నా ఒక్కదానివల్ల తరాలుగా కలిసి మెలిసి జీవిస్తున్న మీ అందరూ కత్తుల్తో కొడవళ్ళతో పొడుచుకొని చావటానికి సిద్ధమౌతారంటే ఈ చిన్న ప్రాణాన్ని కృష్ణమ్మలో కలిపేసేదాన్ని నేనెలాగో పాడైపోయా. నావల్ల ఆయన్ని చంపటానికి వీల్లేదు. మీరందరూ కొట్టుకొని చావటానికి వీల్లేదు" ఏడుస్తూ ఆవేశంగా చెపుతున్న నీలి వంక కృతజ్ఞతా పూర్వంగా చూశాడు కృష్ణశాస్త్రి.

పుట్టింది తక్కువ కులంలోనైనా, ఎంత గొప్ప మానవత్వం.

"నీలి " అర్ధిస్తున్నట్లుగా పిలిచాడు.

"ఏమిటి బాబుగోరు" అంది నీలి.

"నన్ను పెళ్లి చేసుకుంటావా?"

ఇటు అగ్రవర్ణాలవారు అటు హరిజనవాడలోని వాళ్లు ఉలిక్కిపడ్డారు. ఏదో విననిమాట విన్నట్లుగా అదిరిపడ్డారు ఒక్కరిలో చలనం లేదు.

"హరిజనులపై అగ్రవర్ణాలవారు అత్యాచారాలు చేస్తున్నారు అంటూ మీటింగులుపెట్టి హరిజనుల అభిమానం, తక్కువ కులంవాళ్లు మమ్మల్ని ఎదిరించటమా అని అగ్రవర్ణాల వారిని కాకాపట్టి వారి అభిమానం సంపాదించి వచ్చే ఎలక్షన్‌లో ఎమ్మెల్యే అవుదామనుకుంటున్న ఓ పెద్ద మనిషి గుండెల్లో రాయి పడింది.

"బాబుగోరు మీరు ఆలోచించే అంటున్నారా? నేను "నీలి అనుమానంగాచూసింది.

"నువ్వు ఎవరన్నది నా కినవసరం. నీలో నే చూసింది నీ మంచితనం. నువ్వు కాదంటే నే చేసిన పాపానికి పరిహారం లేనేలేదు . ... ఇంత జరిగిం తరువాత నువ్వు కాదంటే నాకు ఆత్మహత్యే శరణ్యం."

"అంతమాట అనకండి బాబుగోరు.

నేను అదృష్టవంతురాల్ని " సిగ్గుతో తల వంచుకొని అంది నీలి.

"ఏమిటి నీలిని పెళ్లి చేసుకుంటావా. మతి ఉండే మాట్లాడుతున్నావా" అంటూ కోపంగా అడిగాడు లక్ష్మీపతి.

"ఆ బాగా ఆలోచించే మాట్లాడుతున్నా" స్థిరంగా పలికాడు శాస్త్రి.

"అలా చేస్తే నిన్ను ఈ వూరినుంచి వెలి వేయవలసి ఉంటుంది."

"ఒకసారి వెలివేయబడ్డవాణ్ణి నాకేం దిగులు లేదు" అంటూ నీలి వైపు తిరిగి "నీలీ నాతో వచ్చేస్తావా" అన్నాడు.

"ఆ . ." అంగీకారంగా తల ఊపింది.

"ఎక్కడికి వెళతావే నంజ మేం అందరం చచ్చాం అనుకున్నావా. నువ్వు వాడవదిలి బయటకు వెళ్ళావంటే చంపేస్తాను" అంటూ అడ్డంగా నిలుచున్నాడు ఆనందం.

నీలి తండ్రి కాళ్ళపై బడి

"చంపు అయ్యా చంపు. జన్మ నిచ్చిన తండ్రి చేతిలో చావటం కంటే అదృష్టమేముంది" అంది.

ఏడుస్తూ కాళ్ళపట్టుకొని ఉన్న నీలిని విదిలించుకుంటూ

"ఛీ ఛీ సిగ్గుమాలిన నంజ నువ్వు నా కులంలో పుట్టటమే నాకు అవమానం. నీ ఇష్టం వచ్చిన వాడితో పో. నా కంటికి కనిపించకుండా వెళ్ళు. రండిరా ఎదవల్లారా ఆ నంజ ఆటిలో పోయెంటు. ఇక ఇక్కడ మనకేం పని. పదండి" అంటూ వాడనుంచి ఎంత ఆగ్రహంతో వచ్చాడో అంత ఆగ్రహంతో వెళ్ళిపోతున్న ఆనందాన్ని వాడలోని వాళ్ళందరూ అనుసరించారు. నీలి కళ్ళు కన్నీళ్ళు వర్షిస్తున్నాయి.

"నన్ను క్షమించు అయ్యా క్షమించు. ఒకసారి ఒకరికి మానం అర్పించుకున్న తరువాత ఇక ఆయనే నా సర్వస్వం" అంటూ మనస్సులోనే అనుకుంది.

"నీలీ . వీళ్ళందరికి దూరంగా ఎక్కడో అక్కడ ప్రశాంతంగా బ్రతుకుదాం పద" అంటూ చేయి చాపాడు కృష్ణశాస్త్రి. అతని చేయినందుకుంది నీలి.

"కృష్ణశాస్త్రి . . " అంటూ లక్ష్మీపతి పిలిచాడు.

ఏమిటన్నట్లుగా చూశాడు కృష్ణశాస్త్రి.

"కృష్ణశాస్త్రీ నీ నిర్ణయం ఆవేశంతో కూడుకుంది. ఈ క్షణంలో నువ్వు చేసిన పని నీకు బాగుండవచ్చు కానీ రేపటి ప్రపంచంలో మీ స్థానం ఏమిటి? మీకు పుట్టబోయే బిడ్డల మాటేమిటి? మీకు పుట్టే బిడ్డ హరిజను డౌతాడా? బ్రాహ్మణుడౌతాడా? ఒక్కసారి బాగా ఆలోచించు."

"లక్ష్మీపతిగారూ నే ఒక్కమాట చెపుతా దయచేసి వినండి. మనది మతసామరస్య దేశం కానీ ప్రతి మనిషి గుప్పెడు గుండెలోనూ మత తత్వం ఎంతగా జీర్ణించుకు పోయిందీ ఈరోజు కళ్ళారా చూశాను నాకు పుట్టబోయే బిడ్డ హరిజనుడు కాదు. బ్రాహ్మణుడు కాదు. వాడు 'భారతీయుడు.' నా బిడ్డల్ని కుల మతాలకు అతీతంగా భారతీయులుగా తయారు చేస్తాను, అందరికి నా నమోవాకాలు" అంటూ అందరికీ చేతులెత్తి నమస్కరించి నీలి చేయి అందుకున్నాడు కృష్ణశాస్త్రి. అందరూ వారిద్దరి వంక విచిత్రంగా అభిమానంగా చూస్తున్నారు. నీలి, కృష్ణశాస్త్రి సాగిపోతున్నారు—'ఇన్టూ దట్ హెవెన్ ఆఫ్ ఫ్రీడం ఫాదర్, లెట్ మై కంట్రీ ఎవేక్' అని రవీంద్ర కవీంద్రుడు కోరుకొన్న స్వర్గతుల్యమైన సమాజ స్థాపనకు పునాదు లేస్తున్నట్లుగా ముందుకు సాగిపోతున్నారు. ☐

★ ఇస్రాయిల్ దేశాన్ని గురించి ఒక స్నేహితునికి వివరిస్తూ ఒక పెద్దమనిషి ఇలా అన్నాడు. "ఇస్రాయిల్‌కు తూర్పువైపు అరబ్బులున్నారు. పడమరవైపూ అరబ్బులున్నారు. ఉత్తర దక్షిణాలలోనూ అరబ్బులే! పాపం! అరబ్బుల్ని ఆ భగవంతుడు రక్షించుగాక."




# తరతరాలుగా భారత స్త్రీ

యీ భారత దేశంలో తరతరాలుగా స్త్రీలు ఏ మెట్టుమీద వున్నారు, వారికి ఏ మాత్రం గౌరవం యివ్వబడిందో యీ మహిళా శతాబ్దంలో ఒక్కసారి తిరిగి ఆలోచించటం ఎంతైనా అవసరం. కనీసం అలా ఆలోచించటానికి ప్రయత్నిస్తే మన తరం కాదు. మన అడుగుజాడలలో నడిచే ముందు తరం ఐనా స్త్రీ జాతికి విముక్తి కల్గిస్తుందేమో అని ఆశపడటంలో తప్పులేదు.

తరతరాలుగా యీ భారత దేశంలో స్త్రీ ఒక బానిసకు బానిసగా, ఆస్తిలేని పురుషుడికి ఆస్తిగా మాత్రమే నిలబడగల్గింది, అంటే ఆమె కేవలం సంతానాన్ని వుత్పత్తి చేయటం, అతని అహంకార పూరితమైన కోరికలు తీర్చటమే కాకుండా, అతని ఆస్తిగా అమ్మబడుచున్నది. నాశనం చేయబడుచున్నది.

మనం ఎంతో పవిత్రంగా వూహించుకుంటున్న గ్రంథాలు, మతాలు సైతం స్త్రీని చిన్న చూపు చూస్తూ క్షమించరాని నేరం చేస్తున్నాయి. ఏ మతంలో చూచినా యీ భావం నేను అంటూ బయట పడుతుంది. కొన్ని వుదాహరణాలు చూద్దాం—

క్రిష్టియానిటీలో పాపానికి కారణం స్త్రీ అని చెప్పుతారు. యీ మతం ప్రకారం భగవంతుడు పురుషుడ్ని ముందు సృష్టించాడు. అతనికి వుపచారం చేయటానికి, అతనిని సంతోష పెట్టటానికి మాత్రమే స్త్రీని సృష్టించాడు. భగవంతునికి కూడా పక్షపాతమేనా? పవిత్రమైన బైబిల్‌లో సైతం స్త్రీ పవిత్రమైన చెర్చిలో ప్రశంగించుట, మాట్లాడుట, సిగ్గుమాలిన చేష్టగా చిత్రింపబడినది. ఆ గ్రంథం ప్రకారం స్త్రీ మూలంగానే, ఆమె ప్రోద్బలం మూలంగానే మానవునికి యిన్ని కష్టాలు వచ్చినది అని తేల్చారు. మరి అసలు స్త్రీ యీ సృష్టికి కారకురాలే కాకపోతే యీ నాడు యీ మతాధికారులు, యింత నాగరికంగా రాయటం, చదవటం, జీవనం సాధ్యపడేదా. మరి యిటువంటి ఆలోచనలు దరిజేరనివ్వరు కాబోలు మహానుభావులు!

హిందూ మతంలో కూడా యిలా స్త్రీని అవమాన పర్చటంలో నేను ఏ మాత్రము తీసిపోనట్లు శాసనాలు, ఆచారాలు, వున్నవి. సహగమనము, శిశు వివాహాలు, పునర్ వివాహ నిషేధం అమలు జరిపి స్త్రీకి తీరని అన్యాయం చేకూర్చుతున్నాయి. హిందూ పురుషులు సైతం స్త్రీని పాపాల మూటగా చిత్రించి ఆడపిల్ల పుట్టిందంటే చేసిన పాపాలకు ప్రతిఫలంగా పుట్టిందని భావించేవారు. తాను ఏ మాత్రము కారణం కానట్లు భార్యను చిత్రహింసలకు గురి చేయబడిన కథలు ఎన్నో మన చరిత్రలో అపూర్వంగా లిఖించబడ్డాయి.

మనం ఎంతో పవిత్రంగా ఎంచుకుంటున్న రామాయణ, మహాభారతాలు సైతం అదే జాబితాలో చేర్చబడతాయి. గొప్ప చరిత్ర కలవాడిగా పేరు పొందిన రఘువంశ కిరీటి, తనతో పాటు కష్టాలు అనుభవించిన భార్యను, ఒక అజ్ఞాని చూపిన చిరుకారణానికిగాను, ఆమెను విడనాడాడు. నిజంగా స్త్రీ అంటే గౌరవమున్న నాడు తాను కూడా ఆమెతో వెళ్ళేవుండేవాడు. కానీ అలా జరగలేదు. అయినా అతను నేటికీ

జ్యోత్స్న జి.

చాలా గొప్పవాడుగా కీర్తింపబడుతున్నాడు. అలాగే ఒక స్త్రీని పండు వలచినట్లు అయిదు గురికి పంచి మగవాడి దాహానికి గురిచేసారు భారతంలో.

పవిత్రమైన 'గీత'లో సైతం స్త్రీలు, సూద్రులు వైశ్యులు, పాపముయొక్క గర్భ మందు జన్మించినవారు అని చెప్పబడుతున్నది. (9-12) (9-13). మరి యీ మహానుభావులకు గుర్తులేదు కాబోలు తాముకూడా పాప గర్భము నందు పుట్టిన స్త్రీ గర్భమునందే తామూ జన్మిం చామని. అట్లయిన వీరింకా పాపాత్ములు కదా!

బుద్ధుడు సైతం భగవన్ నామస్మరణకు కూడా స్త్రీ సంఘంలో చేరటానిక్కి పనికి రాదని నిరాకరించాడు. అట్లాగే "మను స్మృతి" పవిత్ర గ్రంథంగా ఎంచబడింది. యిందులో చాలా స్త్రీ ద్వేష సూత్రాలు లిఖించబడ్డాయి. వాటిలో కొన్ని.

1) స్త్రీ అనేది చిన్నతనంలో తండ్రిచే యుక్త వయస్సులో భర్తచే, వృద్ధాప్యంలో కొడుకుచే రక్షింపబడాలి, కాని స్త్రీ ఎప్పుడూ స్వతంత్రంగా జీవించకూడదు. (8-148)

2) స్త్రీ తన అందాన్ని గురించి తన వయస్సు గురించి శ్రద్ధ తీసుకోకూడదు అవి కేవలం పురుషుడికి మాత్రమే హక్కు (9-14)

3) స్త్రీ తన యింటిలో సైతము స్వతంత్ర ముగా తన యిష్టము వచ్చిన వారితో గడపటం నిషిద్ధం. (5-147)

4) స్త్రీ తృప్తమైన కోరికలు, ఉగ్రకోపము మోసము, ద్వేషము, అసూయ, చెడునడత కలది (9-17)

'మను' తర్వాత 'కౌటిల్యుడు' తను రచిం చిన 'చాణుక్య నీతి దర్పణి'లో యిట్లు వివరించెను.

1) స్త్రీలు నిజాయితీ లేనివారు, ఆత్యాశ గలవారు, క్రూరమైన స్వభావము కలవారు (2-1)

2) స్త్రీలు విశ్వాసము లేనివారు (16-2)

హిందూ మతంలో 'కౌటిల్యుడి' తర్వాత 'శంకరాచార్యుడు' చెప్పుకో దగ్గవాడు. అతను స్త్రీలు నరకానికి సింహద్వారము వంటి వారని చిత్రించాడు.

యిస్లామ్ మతం స్త్రీలని జంతువులతోనూ దున్నేపొలముతోనూపోల్చబడింది. వారు స్త్రీలకి బురఖాలు తగిలించి, ప్రపంచ ముఖము చూడ కుండా కట్టుదిట్టం చేసారు. యీ మతం ప్రకారం సమాజంలో తానూ వ్యక్తిగా పాల్గొ నుట క్షమించరాని నేరము.

భక్తులకు కొరవలేని భారత దేశంలో సుమారు 99 శాతం మంది భక్తులు, స్త్రీని అవమాన పరచినవారే. ఆమె వునికిని తీవ్రంగా విమర్శించిన వారే. 'కబీరు' అనే మహాభక్తుడు, స్త్రీ అన్ని పాపాలకు కారణం, ఆమె వునికినీ పురుషుడ్ని గుడ్డివాన్నిచేస్తుంది అని తెల్పాడు. యింకో భక్తుడు 'తులసీదాస్' యింకొంచం ముందుకు వెళ్ళి తన రామచరిత్రలో స్త్రీ జంతు వులతో సమానం కనక ఆమెను కొట్టి హింసిం చవచ్చు అన్న తన నిర్ణయం తెలిపాడు.

పూర్వపు రోజులలో స్త్రీలు వేదాలు చదు వుట కూడా సహించలేకపోయేవారు. స్త్రీని అజ్ఞానం అనే పవిత్ర ఆచారంలో దాచారు. అట్లా అయినచో హిందూ మతంలో వున్న అన్యాయమైన అతి క్రూరమైన అంశాలు చూచి తిరగపడకుండా వుంటారని వుద్దేశం కాబోలు. యీ విధంగా స్త్రీలని పవిత్రమైనవని చెప్పే ఆవులతో పోల్చుతూ క్రూరంగా హింసించుతూ ద్వేషించుతూ వుండేవారు.

యిప్పటికీ ఆసియాలోవున్న చాలారాజ్యాలు స్త్రీని బానిసగానే చూస్తున్నాయి. కొన్ని దేశా లలో వ్యభిచార వృత్తి ప్రధానంగా నిర్వహించ బడుతున్నది. ఆమెను అన్ని విధాల వుపయో గించుకుని అతి క్రూరమైన, దైన్యమైన చావుకు గురిచేసారు.

"యిదంతా పూర్వకాలం. కాలం మారింది. స్త్రీ యిప్పుడు సంపూర్ణ, స్వేచ్ఛా, స్వాతం త్ర్యాలు పొందుతుంది" అంటారు చాలామంది. నిజమే ముగ్గురు, నల్గురు స్త్రీలని దేశాధినేత లగా చూడగలిగాం. నూటికి మహిళలని వుద్యో గునులుగా చూడగలిగాం. మన పిల్లలలో అతి తక్కువ మంది స్కూలుకు వెళ్ళటం చూడ

గలుగుతున్నాము. నూటికి 80 మందిగా వుండి కనీసము చదువుకునే హక్కు, మాట్లాడే హక్కుకూడా పొందలేని వారి మాటేమిటి. అప్పటికీ యిప్పటికీ అభివృద్ధి జరిగింది. మానవుడు గ్రహాంతయానం చేస్తున్న యీ సమయంలో స్త్రీలుగా మనం పొందుతుంది బహు తక్కువ.

ప్రతి దాంట్లో అసమానత్వం చూపుతూ యీ సమాజం సైతం స్త్రీని కించపరుస్తుంది. విద్యావకాశాలలో, వుద్యోగావకాశంలో కూడా ఎన్నో తేడాలు సృష్టిస్తున్నారు. పురుషుడితో పాటు సమాన పనిచేస్తున్న స్త్రీకి సమాన జీతాలు అందచేయరు. స్వీడన్‌లో స్త్రీలకి 24 శాతం, జపాన్‌లో 50 శాతం, మన భారత దేశంలో 30 శాతం ఫ్రాన్స్‌లో 17 శాతం తక్కువ జీతాలు అందచేస్తున్నారు.

స్వేచ్ఛా, స్వాతంత్ర్యం అనేది స్త్రీ సోషలిస్టు రాజ్యాలలో మాత్రమే అనుభవించ గల్గుతుంది. ప్రయివేటు ఆస్తులను నిర్మూలించినప్పుడే మానవుడు స్వేచ్ఛగా ఒకరికి లొంగకుండా బ్రతకగలడు. సమాజంలో వున్న అసమానతలు తొలగించిననాడే, స్త్రీ పవిత్రంగా, ఒక పవిత్రమైన, గౌరవమైన వ్యక్తిగా గౌరవింపబడుతుంది. యిది యిప్పటివరకూ ఒక సోషలిస్టు సమాజంలోనే సాధ్యపడింది. మహిళాలోకం అంతా కదిలిన నాడు అసమానత్వం, బానిసత్వం రూపుమాసిపోక తప్పదు. యిది చరిత్ర నిరూపించిన సత్యం. □

శుభకార్యాలలో
ఆనందాన్నిచ్చే
అందమైన వస్త్రాలకు!

మా

# న్యూక్లాత్ షోరూమ్

కు
దయచేయండి



**చల్లా బులిశివయ్య**
**అండ్ కో.,**
భీమవరం-534201
ఫోన్: 227

నవీనమైన వస్త్రాలు
నమ్మకమైన ధరలు

మినీ కథ:

# మనవాడు

ఆయనకి సన్మానం జరిగింది. యించక్కటి వేదికమీద రంగు రంగుల నిలువెత్తు పూల దండల్లో ముంచెత్తి ఉచితాసనంమీద కూర్చో బెట్టారు. నుదుట తిలకం దిద్దారు. గంధం పూసారు. హారతి పట్టారు. అక్షతలు జల్లారు. వేదోక్తంగా మంత్రాలు చదివారు. హృదయం విప్పి విశాలమైన సన్మాన పత్రాలు చదివారు. శక్తివంచన లేకుండా తలోవిధంగా పొగిడారు. ఉచిత రీతిని ఆయన సమాధానం కృతజ్ఞత చెప్పాడు.

యివన్నీ చేసి అంతా నీరసించే సమయంకి తేనీటి విందు జరిపారు.

గ్రూపుగా టేబిల్సు ఏర్పాటుచేసిన విందులో గ్రూపుల సంభాషణ ఈ మాదిరిగా జరిగింది.

ఒకచోట: "జి. ఆర్. లూ అంటే ఎవరో అనుకున్నా. 'జి. రాములు' అని మీటింగు కొచ్చేవరకూ తెలీదు. మన తెలుగు వాడే నన్నమాట. అంతేనండీ. మన తెలుగు వాడు ప్రపంచ విఖ్యాతమైన పేరు తెచ్చు కుంటేనేగానీ మన కంటపడడు."

మరోచోట: "చూసావ్? ఆయన్ది మన కోస్తా ప్రాంతమే. మన జిల్లా. పైపెచ్చు మనకోన సీమ. ఎంతసేపూ కొబ్బరి కాయలు లెక్క పెట్టుకోడమేగానీ ఆయన ఘనత గుర్తించలేక పోయాం."

ఒక టేబిల్: "విన్నావా బ్రదర్. ఆయనది మన తాలూకా యేనట. మన తాలూకా వాడికి పేరొచ్చిందంటే మనకి కాదూ?"

మరో టేబిల్: "ఆశ్చర్యకరమైన వార్త. మన పుల్లేటికుర్రులో పుట్టాడట ఆయన. తెలివి తక్కువ వాళ్ళం కనుక్కో లేకపోయాం. మనం విడిగా పుల్లేటి కుర్రులో ఆయనకి సన్మానం చెయ్యాలి."

ఒకమూల: "జి. రాములుగారు ఏ వర్ణమో కని పెట్టావా? మనకాస్టే. ఆ రీవి దర్పం వర్చస్సు ప్రోగ్రెస్సు మన జాతిలో కాకపోతే యింకెక్కడున్నాయి."

మరోమూల పీటన్నిటినీ అధిగమించి ఒకా యన జి. రాములుగార్ని సన్నిహితంగా గమ నించ సాగాడు. చిన్నప్పుడు వేలు విడిచిన మేనల్లుడొకడు యింట్లోంచి పరారీ అయి దేశాల పాలయ్యాడు. వాడేనేమోనని అను మానంతో పుట్టు మచ్చల కోసం వెతుకు తున్నాడు.

— గుత్తుల భాస్కరరావు

# హితవు

నా గతంలోకి రాకు—
అంతులేని నా ఆలోచనల్లో
సమాధి అయిపోతావ్!
నా భావిలోకి రాకు—
నా భావ సుమా గుచ్ఛాలలో
మరుగున పడిపోతావ్!
నా కలల్లోకి రాకు—
నా ఉలికిపాటుతో
అదృశ్యమయిపోతావ్!
నా కలంలోకి రాకు—
నా కవితా ప్రవాహంలో
కొట్టుకొనిపోతావ్!
అందుకే ఓ చెలీ,
నా కన్నుల్లో నీ కళ్ళతో
నీ ప్రతిబింబం చూచుకుంటూ
మరీ రా!
నిన్ను నా హృదిలో సుధగా
దాచుకుంటాను కలకాలం!

—గంగుల నరసింహారెడ్డి

# మాతృభూమి! వందనం!

"ఎలావుంది. స్రవంతీ' కాకరకాయ వేపుడు" అన్నాడు తాతయ్య తన బోసి నోటితో పెరుగు చప్పరిస్తూ.

"అబ్బబ్బా! వుండు తాతయ్యా హాయిగా అరగిస్తువుంటే మధ్యలో డిస్టర్బ్ చేస్తావేమిటి? యింతకూ ఎవరు తాతయ్యా చేసింది?" అంది స్రవంతి పరమానంద పడిపోతూ.

"చెప్పుకో చూద్దాము ''

"యింకెవరు? మా బామ్మ చేసివుంటుంది. ఆహా మా బామ్మ చేసిన వంట మహా అద్భుతముగా వుంది"

"ఆఁ అక్కడే పొరబడుతున్నావు. ఈ కాకరకాయ వేపుడు చేసింది నేను కనుకనే అంత బాగావుంది!"

"ఏమిటీ!" అంది స్రవంతి కళ్ళు పెద్దవి చేస్తూ.

"నమ్మలేక పోతున్నావు కదూ! అదే చిత్రము. సాధారణముగా మగవాడు వంట చేయడుగాని, చేసాడూ అంటే అది నలభీముల లెవెలుకు చేరుకోవలసిందే!" అన్నాడు తాతయ్య రీవి వొలకబోస్తూ.

"వుండు. వుండు తాతయ్యా!" అంది స్రవంతి యిబ్బందిగా ముఖంపెట్టి.

తాతయ్య తికమక పడ్డాడు.

స్రవంతి ఏదో అసౌకర్యానికిలోను అవుతున్నట్లు కనిపించింది.

"ఏమిటి స్రవూ? ఏమైంది! యిప్పటిదాకా బాగా వుంటివే" అన్నాడు తాతయ్య ఆందోళన వ్యక్తంచేస్తూ.

సమాధానంగా గట్టిగా తుమ్మింది స్రవంతి. తాతయ్య మనస్సు కుదుట బడింది.

"ఓసీ యింతేగా. నేను యింకా ఏమిటో అని భయపడ్డాను. యింతకూ అసలు విషయం మరచిపోయాను. .చూడు స్రవంతీ నీవు ఏ వూళ్ళో పుట్టావు!"

"నేను వేటపాలెంలో — అయినా అది గూడ నీకు తెలియదా ఏమిటి తాతయ్యా ఏదో వింత విషయం అడిగినట్లు అడుగుతావే?"

"అక్కడే వుంది అమ్మాయి తమాషా. మనము మామూలుగా నమ్ముతూ వస్తున్నా విషయములలో యిది ఒకటి. భోజనం చేసేటప్పుడు ఎవరైనా తుమ్మేరే అనుకో వారిని ఆ ప్రక్కనవున్న వాళ్లు ఏవూళ్లో పుట్టేవని అడగడం జరుగుతుంది. అది మనకు వాడుకగా వస్తున్న సంగతి" అన్నాడు తాతయ్య 'మూడు' లోకి వచ్చి.

స్రవంతికి అర్థమయింది 'తను మరొక కొత్త విషయమును తెలుసుకో బోతుంది' అని. "చూసేవా తాతయ్యా నీవు యింతవరకుఏ వేవో చెప్పావు. నమ్మాను. కాని ఈ విషయంలో మాత్రం నేను నీతో ససేమిరా ఏకీభవించలేను. మనిషికి తుమ్ములు రావటం సహజం. భోజనం చేసేటప్పుడు అయితే దానికి అవకాశం కాస్తంత ఎక్కువగూడాను. ఆ మాత్రం జరగడంలో తప్పేమున్నది? ప్రక్కవాళ్ళు ఏవూళ్లో పుట్టేవు అని అడుగకపోతే వచ్చే ముప్పేమున్నది?" అంది స్రవంతి తాతయ్యను నిలదీస్తూ.

"వుండు స్రవూ! ఎందు కంత తొందర పడిపోతావు. నీకు అసలు ప్రతి విషయంలోను తొందరే! తరతరాలుగా ఈ నమ్మకము వాడుకలో వుందన్న విషయమును వదిలెయ్యి. నమ్మకానికి వెనుకనున్న అర్థాన్ని అన్వేషించడానికి ప్రయత్నిం చేద్దాము'' మనం అన్నాడు తాతయ్య నిదానముగా.

"సరే చెప్పు" అంది స్రవంతి సరిగ్గా కూర్చొని.

## అర్థమున్న నమ్మకాలు

"జననీ జన్మ భూమిశ్చ.
స్వర్గాదపి గరీయసి"అన్నారు మన పెద్దలు. అంటే జన్మనిచ్చిన తల్లీ! జన్మభూమి, స్వర్గం కన్నా ఘనమైనవి" అని అర్థం. అంతేగాదు పుట్టుకనిచ్చి పోషించి, తిండి, నీరు, గాలివగైరా జీవితావసరాలు అందించే జన్మభూమి గొప్పతనం యింత అనీ వెలకట్టలేనిది. విలువైనది. కాని ఈ రోజుల్లో ప్రజలు అనేక కారణాల వలన తాము పుట్టిన చోటినుండి దూరం అవటము దూరంగా బ్రతకడం జరుగుతుంది. తమ తమ పనులతో, కార్యభారంతో బిజీ అయిపోయి తీరికలేని స్థితిలో వుండిపోతారు వాళ్ళు. అందుకే జన్మభూమిపట్ల ప్రేమాదరాలు కలిగియున్నాగూడా దానిని గుర్తుపెట్టుకోలేని దయనీయ స్థితిలో వుండిపోతారు. అంటే వాళ్ళకు తమజన్మభూమిపట్ల మక్కువలేదని కాదు. కొన్ని ఏళ్ళ తరువాత వాళ్ళు మళ్ళీ తమ జన్మభూమిని దర్శించడానికి వెళ్ళినప్పుడు వారిలో తప్పక పులకింత కలుతుంది. అందుకే, మన పెద్దలు యిలాంటి పద్ధతి ఏర్పాటుచేసి వుంటారని నా వుద్దేశం. ఈ నెపంతోనైనా అప్పు డప్పుడు స్వర్గాతి ముఖ్యమైన జన్మనిచ్చిన గడ్డ గుర్తుకు వస్తుందని ఆలోచించి వుంటారు మన పెద్దలు''

తాతయ్య మాటలకు నివ్వెరపోయింది స్రవంతి!

—ఆలపాటి

---

# సుప్తారణ్యాలు

నిద్రను సమస్యలు చెరుస్తున్నాయి
కళ్ళను కబళించిన ఆకాశం ఉరుముతూ
నిప్పు చినుకులను వర్షిస్తోంది గుండెల్లో—
యీ చీకటిని చీల్చుతూ కూస్తుందనుకున్న కాంతిపుంజు
ఎక్కడో నిషా సముద్రంలో యింకా నిద్రపోతూనేవుంది
యీ గదిలోనుంచి
వేకువ వెల హస్తాలతో ఉప్పెనలా ముంచుకొస్తుందనుకున్న నిన్నటి ఆశ
యింకా గీయని చిత్రంగానే మిగిలిపోయింది
కుక్కకు ఆహారంలో మందుపెట్ట బడుతున్నట్టు .యిక్కడి అగ్ని
మొక్కలను పురిట్లోనే తీయని విషప్రవాహాల్లో ముంచేస్తున్నారు—
పులిని ఊరిపైకి వదిలి పెట్టడం స్వేచ్ఛనివ్వడం కాదు
విశృంఖలతకు ఓ తరాన్ని బలిచేయడమౌతుంది—
నక్షత్రాలను కోల్పోతున్న ఆకాశంలా యీ దేశం
ఒట్టి శూన్యంలో ఏడుస్తోంది నిశ్శబ్దంగా—
యిక తప్పదు
యిప్పటిదాకా అచేతనంగా వున్న అడవులు పంజాలు విప్పక
యిక తప్పదు
యీ తలవంచుకుపోతున్న యోగులు రుద్రులు కాక
తప్పదు
యీ నేల యజ్ఞకుండమై ప్రజ్వలింపక—
మండుతున్న కళ్ళలో నా ఎదురుగా కిటికీలో
అనల ప్రళయంలో విచ్చుకుంటున్న ఎర్రని ఉషోదయాన్ని చూస్తున్నాను
అరణ్యాలు ప్రసాదించాల్సిన
అనంతదీప్తికి — స్వాగతం పలుకుతున్నాను—

—రామా చంద్రమౌళి

# పలురంగాలలో ఆంధ్ర ప్రముఖులు

**మే** మాసాంతంలో మద్రాస్ హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి పదవి చేపట్టారు జస్టిస్ రామప్రసాదరావు. వాణిజ్య వేత్తల కుటుంబంలో 1917 లో మద్రాసులోనే జన్మించారు శ్రీరావు. అపూర్వమైన ప్రతిభతో తమ విద్య నభ్యసించిన శ్రీరామప్రసాదరావు, గణిత శాస్త్రంలో ప్రత్యేకమైన ప్రతిభ చూపించారు. 1938 లో లా డిగ్రీ తీసుకొన్నారు.

లాయర్‌గా ప్రసిద్ధులైన ఎంతమందితోనో కలిసి విజయవంతంగా పనిచేసిన శ్రీరావు మొట్టమొదటగా 1966 లో ఎడిషనల్ జడ్జీగా ఆ పిమ్మట 67 లో మద్రాసు హైకోర్టులో పర్మనెంట్ జడ్జిగా నియమించబడ్డారు.

'77 ఏప్రియల్‌లో శ్రీరామప్రసాదరావు 'తాత్కాలిక ప్రధాన న్యాయమూర్తి'గా వుండి ఇప్పటి తమిళనాడు గవర్నర్ శ్రీ పట్వారీచే ప్రమాణ స్వీకారం చేయించారు. శ్రీరామప్రసాదరావు 'తీర్పు'లెప్పుడూ ప్రశంసలు పొందే విధంగా వుంటూ వచ్చాయి.

'ప్రధాన న్యాయమూర్తిగా నాకీ పదవి రావడం భగవంతుని కృపగా భావిస్తున్నాను. ఉన్నతమైన సాంప్రదాయాలతో నిర్వహించబడ్డ యీ పదవీ నిర్వహణ అత్యంత క్లిష్టమైనది. న్యాయశాస్త్ర విద్యాపారంగతులేగాక, సామాన్య ప్రజానీకంయొక్క అంచనాలమేరకు ఈ పదవిని నిర్వహించే గురుతరమైన బాధ్యత ఎంత బాగా చేపట్టగలనా అని ఒకింత ఆందోళన కూడా చెందుతున్నాను' అన్నారు శ్రీరావు తాము నూతనంగా చేపట్టిన పదవి గురించి ప్రశ్నించినప్పుడు.

శ్రీ రామప్రసాదరావు



కేసుల పరిష్కారంలో జరుగుతున్న విపరీత జాప్యం ఆయన దృష్టికి తేగా "నిజమే. ఆలస్యంగా అందించిన న్యాయం, అసలు అందించని న్యాయం క్రిందే లెఖ (జస్టిస్ డిలేడ్ యీజ్ జస్టిస్ డినైడ్)'' అన్నారాయన. ఈ సమస్యా పరిష్కారానికి తాను హృదయపూర్వకంగా ప్రయత్నిస్తానని వివరిస్తూ "న్యాయశాస్త్రసాంప్రదాయాలను కాపాడుతూ, వీలైనంత త్వరగా అందరి మన్ననలు పొందేలా, జరుగుతున్న ఆలస్యాలని నివారించి కేసుల పరిష్కారానికి నిరంతర కృషి జరిపేందుకే నిర్ణయించుకొన్నాను" అన్నారాయన.

'న్యాయాధికారిగా ఇంతటి ఉన్నత పదవి ఎలా చేరుకోగలిగారు' అని అడిగినప్పుడు ఆయన చిరునవ్వుతో అన్నారు "నిర్దుష్టమైన నీతి వర్తనం, బాధ్యతా నిర్వహణలో 'ప్రయత్నలోపం' చేయక పోవడం, శ్రమ శిక్షణతో కూడిన పరిశ్రమ—చేసిన దానికి ఆకాశమంత ప్రతిఫలం ఆశించని మనస్తత్వం. ఈ కారణాలుగానే అనుకొంటాను'' అని.

ప్రస్తుత నిరుద్యోగ సమస్యపై మీ వ్యాఖ్య ఏమిటన్నపుడు "న్యాయశాస్త్రేతర వృత్తుల గురించి చెప్పనుగాని, న్యాయశాస్త్ర సంబంధమైన వృత్తిలో ఎవరూ త్వరితంగా ఫలితాలు ఆశించగూడదు. ఆ వృత్తి చేపట్టిన నాలుగైదు సంవత్సరాలవరకూ నిరంతర పోరాటమే అది. నిరుత్సాహపడకుండా కృషిసాగించటమే కర్తవ్యం'' అన్నారాయన. "స్కూల్‌స్థాయిలో 'ఒకేషనల్ ఓరియంటెడ్ ఎడ్యుకేషన్' విధిగా అవసరం—ఈ నిరుద్యోగ సమస్య నిర్మూలనకు" అని అభిప్రాయపడుతున్నారాయన.

శ్రీరావు ఫైన్ ఆర్ట్సును అమితంగా అభిమానిస్తారు. ఆయన నటుడుకూడా. ఇంగ్లీషు, తెలుగు నాటకాలలో నటించిన అనుభవముంది ఆయనకు. ఇప్పటికీ సమయం లభించినప్పుడల్లా మద్రాసులోని తెలుగువారి సంస్థల సాంస్కృతిక కార్యక్రమాలూ, ఇతర కార్యక్రమలలో పాల్గొంటుంటారాయన.

"తెలుగు నాటక రంగం చాలా నిరుత్సాహం కలిగించే స్థితిలో ఉంది. చాలా ప్రగతి చెందిన తమిళ నాటకానితో తెలుగు నాటకాన్ని పోల్చను కూడా లేము. తెలుగు నాటక ప్రదర్శనలో రెండు సీన్స్ మధ్య జరిగే జాప్యం గురించి తలచుకొంటేనా విచారం కలుగుతుంది. తమిళ నాటకాలు—ఎమెచ్యూర్స్ ప్రదర్శించేవి కూడా—సాంకేతికంగా ఉన్నత స్థాయిలో ఉండ గలుగుతున్నాయి. ఇతర ప్రాంతాలలో ప్రదర్శించే నాటకాల విషయం నాకంతగా తెలియదుగాని-మద్రాసులో ప్రదర్శించబడుతున్న తెలుగు నాటకాలు—బహుశా సరైన ప్రోత్సాహం కొరవడిన కారణంగా అలా ఉంటున్నాయేమో" అంటూ తమ ఆవేదన వెలిబుచ్చారు శ్రీరావు.

సాహిత్యాన్నీ, సంగీతాన్నీ కూడా అభిమానించే శ్రీరావు అభిమాన రచయితలు శ్రీ విశ్వనాథ సత్యనారాయణ, శ్రీ దాశరథి. సంగీతంలో కర్ణాటక సంగీతాన్ని అభిమానించే యీయనకు అభిమాన సంగీత విద్వాంసులు శ్రీమతి యం. ఎల్. వసంతకుమారి, శ్రీమతి యం. ఎస్. సుబ్బులక్ష్మి.

'జ్యోతి ద్వారా సాటి తెలుగు వారందరికీ నా శుభాకాంక్షలు అందిజేయ గోరుచున్నాను' అన్నారు శ్రీరామ ప్రసాదరావు, ఆయన దగ్గర సెలవు తీసుకొనేందుకు లేచి నప్పుడు.

—పి. సరళా సూర్యారావు

---

(వి) చిత్ర విజ్ఞానం




విమానం అంటుకుంటే? రెండే రెండు నిముషాల్లో అది ఎంత పెద్ద విమానమైనా కాలిపోయి బైపోతుందట! అగ్నిప్రమాదానికి గురైన విమానాన్ని కాపాడ్డానికి యిప్పుడు మరో విమానం సాయపడుతున్నది. ఇది వి-1 విమానం. దీనితో ఒకప్పుడు హిట్లరు ఇంగ్లాండును అదరగొట్టాడు. దీంట్లో పైలట్ వుండడు. సూచించిన ప్రదేశానికి సూటిగా ఎగిరి బాంబుల్ని జారవిడుస్తుంది. ఇప్పుడు దీంట్లో బాంబులకు బదులు అగ్నిమాపక రసాయనాలను నింపారు. వీటిని యిది అగ్నిప్రమాదానికి గురైన విమానంమీద క్షణాల్లో గుమ్మరిస్తుంది. ఐతే దీని ఉపయోగం విమానాశ్రయల్లో నేలమీద వున్న విమానాలకే. ఎగిరే విమానాలని అగ్నినుండి కాపాడే పద్ధతి మనం యింకా కనిపెట్టలేదు.

# శ్రీశ్రీ నిర్వహించు పదబంధ ప్రహేళిక

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | 3 | | 4 | 5 | | 6 |
| | | 7 | | | | | | |
| 8 | 9 | | | | | | 10 | |
| 11 | | | | 12 | | 13 | | |
| | | | 14 | | | | | |
| 15 | | | | | | 16 | | 17 |
| 18 | | | 19 | | 20 | | 21 | |
| | | 22 | | | | 23 | | |
| 24 | | | | | 25 | | | |

ఆధారాలు ఆగస్టు '78

అడ్డం

1. భారతం ఎలా వుంటుంది
4. తార
7. బతకలేడు, చావలేడు
8. తలక్రిందుల చెరసాల
10. ఆ
11. కుమ్మరి కాని మొల్ల
12. చెయ్యి మారితే విధము
14. • శ్రీ రాగం
15. చక్రికి వాసుకి
16. గొంతు
18. ఇంటి పేరు
21. పడగైనా, పటమైనా ఎగిరేదే
22. పిడకలవేట ఎక్కడో?
24. శ్రుతి సాధనలు
25. మొసలి

నిలువు

1. ఆంధ్ర—తాపీ
2. ఆమ్రేడిస్తే కొట్టుకోవడం
3. దీర్ఘం

4. ఇనుము విరిగితే ఇది
5. తంతువు
6. తలమీద ధరించునది
9. అడిగినవన్నీ ఇస్తుంది
10. ఉన్నటులుండి
12. ఏదుపందులూ, వాటికుందేవి
15. శాంతి చిహ్నం
17. ప్రస్తుతం
19. కోరికలు కొంచెం ఆగమంటాయి
20. బాపిరాజుగారి నాయకుడు
22. దీర్ఘాంతద్విరేఫధ్వని
23. కావ్యనాయిక

జూలై పదబంధ ప్రహేళికకు సమాధానం :

అడ్డం : 1. నమ్ముతారు, 4. అమర్యాద, 7. నంబెరుమాళ్ళు, 8. రాక, 10. నయం, 11. నా విష్ణుః, 13. సవతి, 14. రోకళ్ళు, 15. విడత, 16. ఆసామి, 18. కప్పు, 21. లుక్కు, 22. శంకుస్థాపన, 24. తలపడు, 25. పదిలము,

నిలువు : 1. నజరానా, 2. తానం, 3. రుబెగ్గు, 4. అమాస, 5. మళ్లు, 6. దమయంతి, 9. కవి చౌడప్ప, 10. నవరసాలు, 12. అకవి, 15. వికలత, 17. మిక్కుటము, 19. దూకుడు, 20. పపప, 22. శంప, 23. నది.

## నిబంధనలు గమనించండి!

పదబంధ ప్రహేళిక కొట్టివేతలు, దిద్దుబాట్లూ లేకుండా పూర్తిచేసి ఆగస్టు 15వ తేదీలోపు మాకు చేరునట్లు పంపండి. తెల్ల కాగితంమీద గళ్ళు గీసి పూర్తిచేసి పంపిన ఎంట్రీలు చెల్లవు. ఎంట్రీలు పంపువారు వారి పూర్తి చిరునామా ఎంట్రీపైనే రాసి పంపాలి. ఆల్ కరెక్టు ఎంట్రీకి రు. 50/- బహుమతి. ఒకటికి మించి ఆల్ కరెక్టు ఎంట్రీ వొచ్చినపుడు బహుమతి సొమ్ము విజేతలకు సమానంగా పంచబడుతుంది. ఆల్ కరెక్టు ఎంట్రీ ఒకటీ రాకపోతే బహుమతి సొమ్ము పైనెల బహుమతి సొమ్ముకు కలిపి అందజేయబడుతుంది.

జూలై పదబంధ ప్రహేళిక విజేతలు :

మూడు ఆల్ కరెక్టు ఎంట్రీలు వచ్చినవి. పంపినవారు బి. బి. ఆర్. కృష్ణమూర్తి, ట్రంక్‌రోడ్, శ్రీకాకుళం-532 001. కె. యమ్. కృష్ణారావు, అగ్రహారం, ఏలూరు; శ్రీమతి కె. ముత్యాలు టీచర్, గర్ల్సు హైస్కూలు, ఏలూరు. వీరికి బహుమతి సొమ్ము రు. 50 లు పంచి పంపిస్తున్నాము.

జూలై సంచికలో ఆరుద్రగారు అత్వం, ఇత్వం అంటూ పారిభాషిక పదాలవరకు అనవసరంగా పరుగెత్తుకెళ్ళారు. శ్రీశ్రీ గారిది పదబంధ ప్రహేళిక. 'ప్రహేళిక' పదం గమనార్హం. వ్యాకరణం తెలీనివాళ్ళుకూడా ప్రహేళికలో పాల్గొంటారని శ్రీశ్రీకి తెలుసు కాబట్టి, పాండిత్యాన్నే కాకుండా బుద్ధికికూడా పని కలిగించేలా 'లాత్వం' ఆధారం యిచ్చారు. ఈ విషయంపట్ల ఆరుద్రగారి ఉద్రేకం విచారణీయం.

—ఎన్నార్కేమూర్తి, మద్రాసు-26.

# సినిమా

## అన్నదమ్ముల సవాల్!

ఈ చిత్రం గురించి క్రొత్తగా చెప్పవలసిందేమీలేదు. కృష్ణ, రజనీకాంత్, చంద్రకళ, జయచిత్ర ప్రధాన పాత్రలలో నటించిన, సారధీ స్టూడియోస్ నిర్మించిన ఈ చిత్రం విజయవంతమై నూరు రోజుల పండుగ చేసుకొంది. ఆ ఉత్సవాన్ని మద్రాసులో జరిపారు నిర్మాతలు. దర్శకులు పి. పుల్లయ్య అధ్యక్షతన ప్రముఖ నిర్మాత, స్టుడియో అధినేత బి. నాగిరెడ్డి ముఖ్య అతిథిగా విచ్చేశారు. 'షావుకారు' జానకి బహుమతి ప్రదానం చేశారు. విడుదలవుతూన్న చిత్రాలలో ఎక్కువ భాగం విజయవంతం కాలేక పోతున్న ఈ రోజుల్లో ఒక చిత్రం వంద రోజులు పండుగ జరుపుకోవడం అందరికీ సంతోషం కలిగించే విషయమే. అందరితోపాటు మేమూ సంతోషిస్తూ, ఈ చిత్ర నిర్మాతలకు, సాంకేతిక నిపుణులకు, నటీనటులకు అభినందనలు తెలియజేస్తున్నాము.

## సెన్స్ అండ్ సెన్సార్!

పై సభలో దర్శకులు పి. పుల్లయ్య, రచయిత మహారధి తెలుగు చిత్రాల సెన్సారింగ్ విషయం ప్రస్తావించారు. చాలా అర్థ రహితంగా కూడా 'కట్స్' వేస్తున్నారని విమర్శించటం జరిగింది. పరిశ్రమలో కీలకమైన వ్యక్తి

'సింహబలుడు'లో వాణిశ్రీ, రామారావు



గానే గాక, కేంద్ర సెన్సార్ బోర్డు మెంబర్‌గా కూడా ఉన్న నిర్మాత నాగిరెడ్డి ఆ తర్వాత మాట్లాడుతూ సెన్సారింగ్ గురించి ఇచ్చిన వివరణ, చిత్రాల స్థాయి పతనమౌతున్నందుకు వెలిబుచ్చిన ఆవేదన చాలా అర్థవంతంగా వుంది.

సెన్సారింగ్ జరుగుతున్నపుడు చిత్రాలకు పడే కత్తిరింపుల మంచి చెడుల గురించి వివరించే ముందు, అసలు తెలుగు నిర్మాతలలో చోటు చేసుకొన్న రాంగ్ టెండెన్సీ- చిత్రంలో విధిగా ద్వంద్వార్థాల మాటలు, పాటలు ఉండాలన్నది—మారాలని విజ్ఞప్తి చేశారు నాగిరెడ్డి. 'పది పదిహేనేళ్ళకు ముందు తెలుగు చిత్రాలు చాలా సభ్యతాయుతంగా ఉండేవని గర్వం కలిగేది. ఇప్పటి చిత్రాలు ఆవేదన కలిగిస్తున్నాయి. తెలుగు చిత్ర పరిశ్రమతో చాలా కాలంగా సంబంధంవున్న వ్యక్తిగా చాలా ఆవేదన చెందుతున్నాను. నటీనటులుగా చక్కని పేరు తెచ్చుకొని కీర్తితోపాటు, ఆర్థిక పరంగా కూడా సంపాదించుకొన్న నటుడు కృష్ణ, జయచిత్ర (వేదికమీద ఉన్నారు) లాటి వాళ్ళు నటించడానికి చిత్రాలు అంగీకరించే ముందు ఒక్కసారి తామెటువంటి చిత్రాలలో నటించబోతున్నారో ముందుగా ఆలోచన చేయవలసిందిగా విజ్ఞప్తి 'చేస్తున్నాను' అంటూ చాలా ఆవేదన చెందుతూ తమ అభిప్రాయాన్ని వెలిబుచ్చారు నాగిరెడ్డి.

సెన్సారింగ్ విషయంగా విమర్శలు ఎప్పుడూ ఉంటూనే ఉంటాయి. లక్షలు వెచ్చించి చిత్రం నిర్మించిన నిర్మాత ఎఫెక్ట్ అయే సందర్భం అది. 'అయితే నిర్మాతల గురించిన ఆలోచన కన్నా, సమాజం గురించి ఎక్కువ ఆలోచించటం తమవిధి' అంటారు సెన్సార్ బోర్డ్ సభ్యులు. అసలీ సెన్సారింగ్ పరంగా చాలా విభేదాలున్నాయి, పరిశ్రమలోనే కాక, సామాన్య ప్రజానీకంలో కూడా. ఇటీవలనే ఎక్కడో చదివాను ప్రముఖ దర్శకుడు శ్యామ్ బెనెగల్ ఇండియాలో ఒక సంవత్సరం 'సెన్సారింగ్ హాలిడే' ప్రకటించబడితే బాగుంటుందని అభిప్రాయపడుతున్నట్లు. నిజానికి

'కటకటాల రుద్రయ్య'లో కృష్ణంరాజు



సెన్సార్ బోర్డు సభ్యులు 'ఇంకా మేమెందు కక్కడ' అనుకొనేలా చిత్రాలు సభ్యతా యుతంగా నిర్మించగలిగితే సమస్యలుండవు. అసభ్యతో, అశ్లీలమో, ద్వంద్వార్థపు మాటలో, పాటలో చిత్రాలలో ప్రధానమైన ఆకర్షణలుగా నిర్మాతలు భావించినంత కాలం, వాటిని తొల గించే తాపత్రయంలో నిజంగానే అలా లేకుండా వున్న కొన్ని భాగాలపైన కూడా సెన్సార్ వారి కత్తెర పడొచ్చునేమో మరి.

ప్రేమ కలాపాలు, పోరాటాలు, సరసోక్తులు (రెండర్థాల మాటలు)—చిత్రాలలో ఉండకూడదని కాదు. అవే అర్థవంతంగా ఉండాలని మా అభిప్రాయం. తెరమీద ముద్దు కూడా ఉండొచ్చును కాని ఆ 'ముద్దు' కోసం ఒక దృశ్యం కల్పించినట్లుగా కాకుండా ఉండాలి. ఆ దృశ్యం చూస్తున్న ప్రేక్షకుడి కంటివరకే కాక హృదయంవరకూ చేరగలిగేలా ఉండాలి. అలాగే సరసోక్తులు కూడా. పాత్రౌ చిత్రాన్నే మాత్రం పరిగణలోకి తీసుకోకుండా ఆ మాటల



'పదహారేళ్ళ వయసు'లో శ్రీదేవి



'రాధాకృష్ణులు'లో జయప్రద

ప్రయోగం మాత్రమే ధ్యేయంగా ఉండకూడదు. శృంగారం అంటరానిదేం కాదు. పరిధులు దాటి ఆ శృంగారాన్ని అంటరానిదిగా చేస్తుంత టమే విచారకరం. ఈ విషయాలు మరింత కూలంకషంగా చర్చించుకొని, మంచి చిత్రాలు ప్రేక్షకుల కందించడం పరిశ్రమ బాధ్యత.

## సింహబలుడు!

'దక్షిణ భారతదేశంలో అత్యంత వ్యయంతో నిర్మించబడుతున్న జానపద చిత్రం'గా చెప్ప బడుతున్న సింహబలుడు చిత్రానికి దర్శకుడు కె. రాఘవేంద్రరావు. అధిక వ్యయంతో ఈ చిత్రానికిగాను నిర్మించిన ఎరీనా సెట్ను హిందీ నటులు ధర్మేంద్ర, వినోద్ ఖన్నా, అమోల్ పలేకర్, రేఖ, కన్నడ నటులు రాజ్ కుమార్, విష్ణువర్ధన్ మొదలైనవారు స్వయంగా వచ్చి చూసి ముగ్ధులయ్యారు. తొలి షెడ్యూల్లో చిత్రీకరించబడ్డ ఎన్. టి. ఆర్. మోహన్ బాబుల మధ్య వలపై జరిగే యుద్ధం, బెన్ హర్ చిత్రపు స్థాయిలో ఛారియట్ రేస్, వాణిశ్రీతో పాటు అరవై మంది డాన్సర్స్ పాల్గొన్న



'సాహసవంతుడు'లో జగ్గయ్య, ఎన్. టి. ఆర్.

అద్భుతమైన క్లైమాక్స్ నృత్యం విశేషాకర్ష ణలుగా నిలుస్తాయీ చిత్రంలో. ఎన్. టి. రామారావు, వాణిశ్రీ, రావు గోపాలరావు, సత్యనారాయణ. మోహన్‌బాబు, రామదాసు, సారథి, మాడా, త్యాగరాజు, జగ్గారావు, అంజలీదేవి, రమాప్రభ, జయమాలిని మొద లైన వారు పాల్గొంటున్నారు. ఈ చిత్రాన్ని డాక్టర్ డి. వి. ఎస్. రాజు సమర్పణలో డి. శ్రీరంగరాజు నిర్మిస్తున్నారు.

## కరుణామయుడు నూరవరోజు!

చిత్రం విడుదల కాక ముందే ఇదేమిటని ఆశ్చర్యపోకండి. విషయమేమిటంటే కరుణా మయుడు చిత్రీకరణ జరిగిన 'షూటింగ్ డేస్' వంద పూర్తయ్యాయి. అంతేగాదు సరిగా లెఖకి ఒచ్చినట్లు ఆ నూరవ రోజుతో చిత్రం షూటింగ్ పార్ట్ పూర్తయింది. క్రీస్తు జీవితంపై భారీ వర్ణ చిత్రంగా తయారౌతున్న ఈ చిత్రాన్ని జూలై పదిహేనుకు పూర్తిచేసి ఫస్టు కాపీ రెడీ చేసేలా షెడ్యూల్ చేశారు. ఆగస్టులో విడుదల కావచ్చు.



'మా యింటి దేవత'లో హరనాథ్



'సింహగర్జన'లో కృష్ణ

## హలో! తెలుగు ప్రేక్షకు లక్షలుహో!

అలో! తెలుగు ప్రేక్షకులక్షలుహో! ఎంటీ తెలుగు ప్రేక్షకులు. అసలు తెలుగు ప్రేక్షకు లక్షలపడం ఏట్టాగో తెలవడంటన్నావా...తల్లీ ....పోన్లు కనక్సన్లిచ్చే తల్లీ....నీకు తెలుగు ప్రేక్షకులు....అహా....తెలుగు తెలియదంటు న్నావా....సర్లే....కలుహో.... అలో.....నేనండీ తుమ్మలపాడు చినపద్దయ్యను.....అయ్యా.... ఇక్కడండీ సినిమాలు అయ్యా బాగానే ఉండు య్యండి .... విషయమేమిటంటే సండే ....



'దొంగలవేట'లో కృష్ణ, జయప్రద



'యుగపురుషుడు'లో ఎన్. టి. ఆర్.

అయ్యా....కొత్త సినిమాలు ఎట్టా ఉందయ్యం టారా....అయ్య....తమరే చెప్పాలి గదండీ. తమకు తెలియన్దేముందండీ .... అయ్య .... అసలు విషయమేమిటంటే నండీ....ఇదిగో తల్లీ....ఆపరేటర్ తల్లీ నువ్వడ్డం రాకు.... కలుపో....తెలుగు ప్రేక్షకు లక్కలుపో.... మూడు నిమిషాలుగాపోతే ముప్పై నిమిషాలు మాట్లాడతాను....నువ్వు కలుపో....అయ్య.... విషయమేమిటంటేనండీ..నేనండీ.. అమ్మమ్మ మరిచిపోతే ఎట్టాగండి....నూటొక్క జిల్లాలకు అందగాడ్నే....పవర్ ఫుల్ మనిషిని....అయ్య ....విషయమేమిటంటే నండీ....తుమ్మలపాడు చిన పద్దయ్యనండి....అబ్బెబ్బె నేను చలిచీమను కానండీ........ఇంటి దగ్గర బంగారమంటి బూముంది....అయ్యా.......టౌన్లో సావిత్రి కూడా ఉందండి నాకు....ఇంటో పోనుందండి. అక్కడ్నించే సావిత్రింట్లోంచే మాటాడ్తన్నాను....అయ్యా .... విషయమేటంటేనండీ. ఆడు ఆ రామన్నగాడు....నా పొలం కౌలుకు చేసుకుబతికే నౌకరుగాడు....ఆ రామన్నగాడు పొలంలోంచి లేవనంటాడండీ....నా పొజిసన్ బాగోక పొలం అమ్ముకొంటే యీడు కాలీ సెయ్యనంటాడు....అయ్య....మరీ యీ ఆపరేటర్ గొడవసేస్తోంది—మిమ్మల్ని స్వయంగా కలుసుకుంటానండి....అయ్య జూలై ఏడు నండి. మీ వూరొస్తున్న చలిచీమలు సినిమాలో వత్తానండి....అయ్య డైరెట్రా....ఈ సినిమాకు డైరెట్రు దేవదాసండి. అయ్యయ్య....అబ్బెబ్బె



'శ్రీరామ రక్ష'లో అక్కినేని, వాణిశ్రీ

'అనురాగ ప్రేమ'లో కమలహాసన్



శరత్ దేవదాసు కాదండీ....అయ్యో....అ.... లేదండీ ఓసీతకథ లో నటించినాయనేనండి. ఇంకానా సత్యేంద్రకుమార్, ఐ. ఆర్. రాజు, రాళ్ళపల్లి, ఉపేంద్ర, పండురాజు, పెక్కం సూర్యనారాయణ, శైలజ, లావణ్య, పద్మ, టి. రాజేశ్వరి యీళ్ళంతా ఉండారండి. నా పేరంటారా? చెప్పాను గదండి. తుమ్మలపాడు చినవద్ద...అదా నన్ను ఇదివరకు వరప్రసాదనే వాళ్ళండి. అ....అయ్యో ముత్యాల ముగ్గులో నిత్య పెళ్ళికొడుకునే నండి అయ్యో ఇప్పుడు నూతనప్రసాద్ నయ్యానండి. అయ్యో ఉంటా నండి కలుస్తాను జూలై. 7న సెలవ్.

## హరనాథ్ పునరాగమనం!

అయిదేళ్ళ క్రితమే మేం జరిపిన ఇంటర్వ్యూలో తన ఫ్యూచర్ గురించి చాలా ఆశాజనకంగా చెప్పిన హరనాథ్, కొంచెం ఆలస్యం గానే అయినా తిరిగి నటుడుగా తెలుగు తెర పైకి తిరిగి వస్తున్నాడు చిరంజీవి చిత్ర నిర్మించే 'మా యింటి దేవత' ద్వారా. ఈ చిత్రంలో కృష్ణ, జమున, హరనాథ్, రామ



### జ్యోతి పాఠకులకు

# జయసుధ జవాబులు

అందాల తారగా యువహృదయాలు దోచుకోవడమేగాక మంచి నటిగా కళాభిమానుల ప్రశంసలు పొందిన కుమారి జయసుధ జ్యోతి పాఠకుల ప్రశ్నలకు సమాధాన మివ్వడానికి అంగీకరించారని తెలుపుటకు ఆనందిస్తున్నాము.

విసుగెత్తించేలా ఒకే రకం ప్రశ్నలు గాక, వైవిధ్యంతో గూడిన ప్రశ్నలకు ప్రాధాన్యత ఉంటుంది.

చిలిపి ప్రశ్నలకు నిషేధంలేదు. అల్లరి చేసేలా, అఫెండింగ్‌గా ఉండే ప్రశ్నలు పరిశీలించబడవు.

ప్రశ్నలను : జయసుధ జవాబులు c/o జ్యోతి, 17-బి. రాజారాం కాలనీ, మద్రాసు-600 024 చిరునామాకు పంపండి.

**ఉత్తమ ప్రశ్నకు జయసుధ సంతకంతోకూడిన కలర్ ఫొటో బహుమతి.**

---

కృష్ణ, సత్యనారాయణ, పద్మనాభం, మోహన్ బాబు, శాంతకుమారి, నాగశ్రీ, జయమాలిని, మధు (నూతన నర్తకి) నటిస్తున్నారు. పద్మనాభం దర్శకత్వంలో తయారవుతున్న చిత్ర మిది.

## 'ప్రేమ - పగ'

బాలయ్య మంచి నటుడిగానే గాక, మంచి నిర్మాతగా కూడా తెలుగు ప్రేక్షకులకు బాగా తెలుసు. చిత్రానికీ, చిత్రానికీ మధ్య వ్యవధి తీసుకొన్నా మంచి కథ నెన్నుకొని గాని చిత్ర నిర్మాణం ప్రారంభించని బాలయ్య అందుకే విజయవంతమైన చిత్రాలు సమర్పించ గలిగాడు. ఇప్పుడు బాలయ్య సమర్పణలో అమృతా ఫిలింస్ నిర్మిస్తున్న 'ప్రేమ - పగ' చిత్రం పూర్తయి విడుదలకు సిద్ధమైంది. బాలయ్య, మురళీ మోహన్, సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, అల్లు రామలింగయ్య, మాడా, మిక్కిలినేని, సత్యేంద్ర కుమార్, సారథి, సావిత్రి, లత, రూప మొదలైన వారు నటించారు. దర్శకత్వం బి. వి. ప్రసాద్. సంగీతం ఎస్. రాజేశ్వరరావు.

—యస్వీనారాయణ





పచ్చని పొలాలతోను, పసిపాపల లాంటి
మనసులు గలిగిన పల్లెటూళ్లలో సైతం
రాబందులు లాటి మనుషులు ఉంటారు
వాళ్ల రెక్కల నీడ కింద బడుగు ప్రాణాలు
కాయకష్టాలు చేసుకుని. బతుకుతూ
ఉంటారు.







అలా సాగిపోతే ప్రాణం లేని కథ అవుతుంది
ఎక్కడో, దేనికో ఈ బడుగు ప్రాణి ఆరాబందుల
రెక్కలు విరిచేస్తే మంచికథ అవుతుంది.
అలాంటి మంచికథను
శ్రీ అన్నపూర్ణ సినీ ఎంటర్‌ప్రైసెస్ వారు
ఎన్నుకుని చిత్రం నిర్మించారు.
దానిపేరే "ప్రాణంఖరీదు"





శ్రీ అన్నపూర్ణ
సినీ ఎంటర్‌ప్రైసెస్

# ప్రాణం ఖరీదు?

నిర్మాత: క్రాంతికుమార్
దర్శకత్వం: కె. వాసు



# నవలల పోటీ

## ప్రథమ బహుమతి: రు 2000/-
## ద్వితీయ బహుమతి: రు 1000/-
## తృతీయ బహుమతి: రు 750/-

పోటీలో పాల్గొను రచయితలు పాటించవలసిన నిబంధనలు :

1. నవలలు 'జ్యోతి నవలానుబంధం' సైజులో 128 పేజీలకు మించకుండా 96 పేజీలకు తగ్గకుండా (ముద్రణలో) ఉండాలి.
2. స్వీయరచనలే పంపాలి. అనువాదాలు, అనుకరణలూ అంగీకరింపబడవు. రచన స్వీయమేననీ, అనువాదంగానీ, అనుసరణగానీ కాదని హామీపత్రం జతపరచాలి.
3. కాగితానికి ఒకేవైపు రాయాలి.
4. రచనలు తిప్పిపంపగోరువారు తగినన్ని పోస్టల్ స్టాంపులు అతికించిన స్వంత చిరునామా గల కవరు జతపరచాలి.
5. **నవలలు మాకు చేరవలసిన ఆఖరుతేది 20, సెప్టెంబర్, 1978**
6. కలం పేర్లతో రచనలు పంపినా రచయితలు తమ పేర్లను విధిగా తెలియజేయాలి.
7. రచనలు పంపే కవర్లపై 'నవలల పోటీకి' అని తప్పక రాయాలి.

## గమనించండి!

* బహుమతులు పొందని నవలలో ప్రచురణార్హమైన వాటిని జ్యోతిలో సాధారణ ప్రచురణకు ఎన్నుకొనే హక్కు మాకుంటుంది.
* ఎన్నుకోబడిన నవలలు 'జ్యోతి నవలానుబంధం'లో ప్రచురింపబడుతాయి.
* ప్రచురణ సౌలభ్యం కోసం అవసరమైన మేరకు నవలను సంక్షిప్తీకరించే హక్కు మాకుంటుంది.
* పోటీకి సంబంధించి 'జ్యోతి' సంపాదకులదే తుది నిర్ణయంగా ఉంటుంది.

ఈ పోటీలో రచయితలు వైవిధ్యమున్న రచనలతో పాల్గొని సహకరిస్తారని ఆశిస్తున్నాము

— ఎడిటర్

Edited & Published by V. Leelavathi Raghavaiah, at 17B Rajaram Colony Kodambakkam, Madras-600 024, & Printed by D. Hanumantha Rao, at Kranti Press, 12, Francis Joseph Street, Madras-600 001.